*Prasāra Sāhityaṃ*

**(Plays and Stories, transmitted through radio)**

**By Nayani Subbarao**

**A Birth Centenary Publication 1899-1999**



---

Cover page design : Lakshmi Narayana
Price Rs : 125/-
Published by . Nayani Subbarao Trust
Laser Typeset : Haripriya Pulikonda
Printed at · Dynamic Offset Printers, Panjagutta, Hyderabad.
For copies : (1) 898/2, Nagarjuna Nagar, Hyderabad. Tel.3747133
(2) VISHALANDHRA Book House, Hyderabad.

**For copies:**

# ఆముఖం

ఇది శ్రీ నాయని సుబ్బారావుగారి శతజయంతి ( 1899 - 1999 ) ప్రచురణ. ఆయన గుంటూరు జిల్లాలోని నరసరావుపేట మునిసిపల్ హైస్కూలులో ప్రధానోపాధ్యాయులుగా 1955 లో పదవీ విరమణ చేసిన తరువాత, 1959 నాటికి హైదరాబాదు చేరారు. ఇక్కడ ఆకాశవాణిలో, ఆయా ప్రసారాల కవసరమైన విషయాలను వ్రాసే పనిలో చేరారు. ఎక్కువగా గ్రామస్థుల కార్యక్రమాలకు వ్రాస్తుండేవారు. ఆ విభాగాన్ని నడిపే శ్రీ త్రిపురనేని గోపీచంద్‌కు ఈ కవి అంటే పితృభావం. అప్పుడు ఆ విభాగంలో శ్రీ రావూరి భరద్వాజ, శ్రీ రెడ్డి చిన వెంకట రెడ్డి, కవి వ్రాసిన విషయాలను, ప్రసారం చేస్తుండేవారు. ఇదంతా ఒక అనుబంధంతో అల్లుకుపోయిన కుటుంబమా అన్నట్లుగా ఉండేది. అప్పుడప్పుడూ స్త్రీల కార్యక్రమాలను నడిపే శ్రీమతి న్యాయపతి కామేశ్వరమ్మ కవిగారిచేత నాటికలూ, పద్యాలూ, పాటలూ వ్రాయించుకునేవారు.

ఈ సంపుటిలో నాటికలూ పౌరాణిక కథలూ చేర్చబడ్డాయి. పాటలూ, పద్యాలూ, వ్యాసికలూ ఇందులో లేవు.

నాటికలు, అటు పౌరాణిక కథలపైన ఆధారపడినవీ, ఇటు సాంఘికేతి వృత్తాలపైన ఆధారపడినవీ ఉన్నాయి. అహల్య, మహిషాసుర మర్దని, సత్యభామ, దక్షయజ్ఞం వంటివి పౌరాణికేతి వృత్తాలు. మనమంతా ఒకటే, ప్రజాపరిషత్తు, కుటుంబ గౌరవం వంటివి సాంఘికేతి వృత్తాలు. `కవి బ్రహ్మ', తిక్కన వ్యక్తిత్వాన్ని మలచడానికి చిత్రింపబడిన నాటిక. ఆ కవి అంటే ఈ కవికి ఎనలేని మక్కువ.

అపార గౌరవం. ఈయన రచనలో అడుగడుగునా దోబూచులాడు తున్నట్లు ఆ కవి తొంగిచూస్తూ పలకరిస్తున్నట్లుండడం పరితను ఆనంద పారవశ్యంలో ముంచు తుంటుంది.

కటుత్వం ఎరుగని పలుకు, శిరీష కుసుమ పేశలమైన రీతి ఈ కవి వచన రచనలో ఎలా పొదువుకుని ఉన్నాయో ఆధ్యయనం చేయడానికి, ఈ సంపుటి మంచి ఆకర గ్రంథం.

ఈయన వచనం తక్కువ వ్రాసినా ఆ కాస్తలోనూ పలకబారిన జామపండు రుచి విశద మౌతుంటుంది. ఆ తీయదనం నిత్యజీవన వ్యవహారంలో ఆయన పలికే పలుకుల్లోనూ ఉంది. మనిషి ఎంత హుందాగా, గంభీరంగా, కనిపిస్తారో మాట ఆ గుణాలను వదలకుండానే, సన్నని జరీ పోగులాంటి సున్నితమైన హాస్యాన్ని మెరిపిస్తుంటుంది. అది ఆయనకు గల గొప్ప ఆకర్షణ.

ఈ లక్షణాలన్నీ మనం ఈ గ్రంథంలో చూడవచ్చు. ఇవి చెప్పి వ్రాయించుకున్నవైనా, రచనా మార్గంలో మాత్రం, ఆరచన నడిచినంతమేరా ఆయనే ప్రభువు.

కవిపుత్రిక, అంకితుని గన్నయమ్మ

**నాయని కృష్ణకుమారి**

8-3-898/2

నాగార్జున నగర్

హైదరాబాదు - 73

1-3-2000

# విషయానుక్రమం

## రేడియో నాటికలు



## మహాభారత కథలు



----- 0 -----

# అహల్య

*పాత్రలు:*

శ్రీరాముడు
విశ్వామిత్రుడు
అహల్య
గౌతముడు
ఇంద్రుడు

నేపథ్యం :

పాట

వాసుదేవుని పదము తాకిడికి
భూమి సర్వమ్ము పులకల తేరినట్లుగా
దశరథాత్మజుని అడుగు సవ్వడికి
వసుధ మొత్తమ్ము చెవియొగ్గి విన్నట్లుగా
గౌతమాశ్రమ పరిసర భూములవి యెల్ల
వాతాహతాలోల తీవ్ర దర్భాగ్రములు
వ్యాకీర్ణ ఘనశిలా నిబిడ దుర్గమ్యములు.

అదుగో కొండంత చీకటిని చీల్చే వెన్నెల వత్తిలా, కరడు గట్టిన ఈ నిర్జన పదంలో అడుగుల సవ్వడి యుగాలుగా బండబారి చైతన్య మెఱుగని ప్రకృతిలో ఆశాజనకమైన, మనోహరమైన కదలిక.

దూరాన పాదచ్ఛాయలు
అవే పాదచ్ఛాయలు

**పాట**

పాదచ్ఛాయలు పాదచ్ఛాయలు
వేదాంతర్గత విమలచ్ఛాయలు
పశ్చాత్తాపపు వెలుగులు చిమ్మి
పారద్రోలి పాపపు చీకట్లను
అడుగు అడుగునా ఆశ మెఱయగా
సడలిపోని విశ్వాసము నింపే
పాదచ్ఛాయలు పాదచ్ఛాయలు
వేదాంతర్గత విమలచ్ఛాయలు

పాపము గానీ శాపము గానీ
బ్రతుకు బండలై పోయిన పతితల

గుండెలందు నవజీవనామృతము
నిండజేయు స్వర్గాంత వాహినులు
పాదచ్ఛాయలు పాదచ్ఛాయలు
వేదాంతర్గత విమలచ్ఛాయలు

- : అడుగుల చప్పుడు మెల్లగా ఆగిన వెనుక రాముడు విశ్వామిత్రుడు: -

రాముడు: విశ్వామిత్ర మహర్షీ. ఈ ప్రదేశమంతా పాడ. భయాన్ని కలిగిస్తున్నా, ఇక్కడంతా అంతర్గతంగా ఏదో చైతన్యం స్ఫురిస్తూనే ఉంది మనం ఎక్కడున్నాం స్వామీ

విశ్వా: నాయనా రామచంద్రా. ఇదే గౌతముల ఆశ్రమం ఆ కథ చెపుతాను విను

--ఫ్లాష్ బాక్ సంగీతం--

నేపథ్యం : - పాట

విధాత పరిణత సృష్టి కొక విజయ చిహ్నమై
గౌతమాశ్రమ భూమి ముంచెత్తు సౌందర్య కుల్య
పతి తీవ్ర తపము కాకల కగ్గమై పోయి
వసి వాళ్ళు పడు కుసుమ కోమల శ్రీ తనువహల్య

పతి దుష్కర తపమ్ము పట్టి ఒకనాడైన
సతి వంక మోహ వాంఛా దృష్టి పరపడే
సతి మనస్సున కోరికల మంట చెలరేగి
పతి యభావమున మేన్ పసివాళ్లు వాడునే

--కొట్టవచ్చినట్టుగా కోడికూత--

అహల్య: కోడి కూసినట్లుగా ఉంది. మహర్షి కాల్యకరణాలు

తీర్చుకోవడానికి వెళ్ళినట్లున్నారు. కాని, ఇదేమి, ముసిరిన చీకట్లు విరియనేలేదు తూర్పున వెలుగు రేకలాడే చిహ్నమైనా లేదు. కాని కోడి కూసింది కదూ. ఆగి-

ఈ క్షణాన నా మనస్సెందికిలా అల్లకల్లోలంగా ఉంది ఆ కోడి కూత సామాన్యంగా లేదు. అదే నాలో సంచలనం కలిగించిందా?

---- మళ్ళీ కోడి కూత ----

అదుగో మళ్ళీ! అదే ధ్వని - ఆ ధ్వని లో నామనస్సుకు ప్రియమైన అంశ ఏదో ఉంది నేను మనసా వాంఛించే విషయమేదో ఉంది.

---- దూరంగా మళ్ళీ కోడి కూత---

మళ్ళీ మళ్ళీ! ఆ గౌతమ మహర్షి వచ్చేస్తున్నారు కలకల చెలరేగిన ఈమనస్సును ఎలా అదుపులో పెట్టుకోను?---- స్వామీ

ఇంద్రుడు : అహల్యా నాప్రియా

అహల్య: (తనలో అనుకున్నట్లుగా) - ప్రియా? ఇది గౌతముల పిలుపా? కాదు. - ఆఁ ఇంద్రుడు. ముల్లోకాధినేత, అందగాడు, కౌశికుడు ------ మునివేషం ఎంత బాగ కట్టావు?

ఇం: వేషం కట్టటమేమిటి? నీకోసం కోడినై ఇల్లెక్కి కూశాను. అహల్యా! అహల్యా!

ఈ ముల్లోకము లేలు నట్టి దొరనై ఏనొక్కసామాన్యుడున్
భామా నీ యసమాన యౌవన మహారాజ్యమ్ము చేపట్టగా
లేమిన్, నిత్య వినూతనమ్మయిన నీ లీలా విలాస ప్రభా
శ్రీమంతమ్ముగ నన్ను నేలుకొనవే. శృంగార రమ్యాకృతీ.

అహల్య: నామీద నిజంగా అంత అపేక్షా నీకు? నీమోహావేశానికి నా మనస్సు అవశమౌతోంది. నాలో కోరికలు తెరలు తెరలుగా కమ్ముకుంటున్నయ్. నీ చిక్కని కౌగిట్లో చిక్కిన నా దేహం అవశమై అచేతనమై పోతున్నది. ఆబ్బ!

ఇంద్రు: అహల్యా. నారాణీ. నీసౌందర్య శోభ చూడడానికి నాయీ రెండు కళ్ళూ చాలటం లేదు. ఒళ్ళంతా కళ్ళు చేసుకొని నిన్ను చూడాలని ఉంది. నీ లావణ్యాన్ని వెయ్యి కళ్ళతో తాగేయాలని ఉంది.

--పిడుగు పడినట్లుగా గౌతముడు వచ్చి.--

గౌతముడు: ఓరీ ఇంద్రా! మోసకారీ! త్రిలోక పాలుడవు. దేవతలకు రాజువు. ఉన్న రెండు కళ్ళతో కూల్చిన కొంప చాలక వెయ్యి కళ్ళు కావాలా నీకు? అహర్నిశలూ వెంటబడడమేనా నీపని! ఛీ.ఛీ చర్మాస్థి వసా కల్పితమైన అవయవ శోభ నిన్నింత చేసింది. ఇక వికృతాకారుడవయిపోతావు. దుర్మార్గుడా. ఫో. ఇక్కడనుంచి.

----సంగీతం----

ఇంద్రుడు: శరణు. గౌతమర్షీ శరణు- కన్నూ మిన్నూ కానక నీకు చేసిన ద్రోహానికి నాకీ శిక్ష పడవలసిందే. కాని ఈ వికార రూపంతో ముల్లోకాలకూ అధిపతినని కొండంత అవమానం మోస్తూ ఎలా బ్రతకను. నా ముఖం అందరకీ ఎలా చూపించను. కరుణించు స్వామీ కరుణించు.

గౌత: కరుణిస్తున్నాను పశ్చాత్తాపమే పాపాన్ని మాడ్చేది. నిన్ను నీవు తెలుసుకొని మసలుకో నీ శరీరం మీద వికారపు ముద్రలు నేత్రాలై భాసిస్తవి. సహస్రాక్షుడవని అందరూ నిన్ను పొగడుతారు. ఫో!

అహల్య: స్వామీ నన్ను క్షమించండి

గౌతమ: క్షమ! మోహావేశంలో నీవు కోల్పోయిన చైతన్యం తిరిగి నిన్ను చేరదు. బండరాయివై పడిఉండు.

అహల్య: స్వామీ నా పాపానికి ఆశిక్ష చాలదు. నా పతనానికి కారణమైన ఈ కోరిక నాలోనే ఉండి నేను రాయినై పోతే ఇక నాకు నిష్కృతి ఏది? ఈ కోరిక సమూలంగా నాశనమయ్యేట్టు కరుణించండి. పవిత్రత చెంది ఎప్పటికైనా నేను నిష్కామ చిత్తంతో, అచంచల ప్రవృత్తితో మిమ్మల్ని చేరుకునే భాగ్యం అనుగ్రహించండి. ఈ మనవి పెడచెవిన పెట్టకండి.

గౌత: అహల్యా. నీ వన్నది నిజం. పశ్యాత్తాపమనే అగ్నిలో నీలోని కోరికల్ని ఇగిరించుకో. రూపానికి పెను శిలవైనా. హృదయం కలిగి సంతత మననశీలవై ఉండు. నీలో కోరికలు కరిగిన నాడు నీ అదృష్టం రామచంద్రుడై వచ్చి, నీకు రూపం ఇస్తాడు. ఆయన పాద ధూళితో పవిత్రమైన నీవు ఈ ఆశ్రమ వాటికి తిరిగి జీవభిక్ష పెట్టగలవు. వెళ్ళు! శాపాంతం వరకూ వేచి ఉండు. వెళ్ళు. అహల్యా!

---విరామ సంగీతం---

విశ్వామిత్రుడు: అది తండ్రీ కథ. అహల్య శాపాంత సమయం ఆసన్నమైంది. కోరికలు ఇగిరి నిష్కంప దీపకళికలా స్థిరమైన పవిత్రమైన ఆవిడ హృదయం నీ పాదధూళిని సోకడాన్ని కాంక్షిస్తున్నది. భర్తృసేవా పరత్వం కోసం ఎదురు తెన్నులు చూస్తోంది. రా, నాయనా, ఇటు, ఇటు, ఇటు తండ్రీ.

----నేపథ్యంలో గీతం--

---రాముని అడుగులు ముందుకు, సాగెనెంత తొందరగా---
రాతికి అంతశ్చేతన, కూడె నంత వేగముగా
రాముని పదధూళి రేగి, క్రమ్మెనెంత దట్టముగా,

రాతికి భావావేగము, కలిగెనంత గాఢముగా.
రాముని చరణాగ్ర స్పర్శ సోకెనెంత లాలనగా,
రాతికి రామా రూపము అమరె నంత అందముగా.

అహల్య: రామభద్రా. రాయి సోకి, కంది చిగుళ్ళయిన నీ అడుగ లేవి తండ్రీ? ఈ జీవిని శాపవిముక్తను చేయడానికి అయోధ్యనుండి తరలి వచ్చిన అడుగులేవి నాయనా? విశ్వామిత్ర మహర్షీ! గౌతమ ధర్మపత్ని అహల్య నమస్కరిస్తున్నది.

విశ్వా: శుభం తల్లీ. అలా చూడు. నీ భర్త గౌతమ మహర్షి నీ కొఱకై వస్తున్నాడు.

అహల్య: మహా ప్రసాదం (ఆగి) స్వామీ! గౌతమ మహర్షీ. అనుగ్రహించండి. నేను అహల్యను. ఇతడు రూపం దాల్చిన నా భాగధేయం చిరంజీవి రామచంద్రుడు.

రామ: ముని దంపతులకు దశరథేశుని పుత్రుడు రాముడు నమస్కరిస్తున్నాడు.

గౌతమ: కళ్యాణమస్తు.
అహల్య: - కళ్యాణమస్తు.

విశ్వా: ఆద్యులూ, ఋషులూ అయిన వారి వాక్కుల్లో భవిష్యత్సూచన ఉంటుంది ఈ చిరంజీవిని కళ్యాణార్థమే మిథిలకు తీసుకు వెళుతున్నాను.

అహల్య: అవునయ్యా రామప్రభూ? జనకరాజస్థానిలో పౌరోహిత్యం నిర్వహించే శతానందుణ్ణి చూడు. మీ తల్లికి శాపవిముక్తి కలిగించిన వ్యక్తిని నేనేనని అతనికి నిన్ను ఎఱుక పఱుచుకో. మైథిలీ సహితుడవై, అయోధ్యాభిముఖుడవై వెళ్ళబోయే ముందు దంపతులిద్దరూ ఒక్కసారి నాకన్నులకు పండుగ చేయండి.

వెళ్ళిరా తండ్రీ వెళ్ళిరా!

నేపథ్యంలో --- అవే! మిథిలా నగరపు మార్గానుసారులై--,

పాదచ్ఛాయలు పాదచ్ఛాయలు
వేదాంతర్గత విమలచ్ఛాయలు.
శివధనుస్సు నవలీలగ విరిచీ
అవని పతివ్రతలందు మేలియగు
ముల్లోకమ్ముల తల్లి జానకిని
మురియింపగ వేగిరపడు రాముని
పాదచ్ఛాయలు పాదచ్ఛాయలు
వేదాంతర్గత విమలచ్ఛాయలు.

పాదధ్వనులు దూరంగా దూర దూరంగా

(ప్రసారం: 15-11-59).

----- 0 -----

# ఇంద్రధనుస్సు

*పాత్రలు:*

రామయ్య
సుబ్బయ్య
యాదగిరి
యెంకి
సుబ్బి
రమణయ్య

యెంకి: సుబ్బీ, సుబ్బీ, ఏంచేస్తున్నావే? ఇంకా తయారు కాలా?

సుబ్బీ: అయిపోయింది, యెంకమ్మొదినా, ఇదిగో వస్తున్నా----

యెంకి: అబ్బో ! మరదలు పిల్ల ఇయ్యాల బలే షోగ్గా తయారయిందే! మొగాన కొట్టొచ్చినట్టు ఆ కుంకం బొట్టు, తలలో ఆ మందార పూలూ, ఆ తెల్లని రైకా, ఆ ఆకు పచ్చ చీరా, ఏం అందంగా వున్నావే, మరదలా ! అచ్చంగా మన జాతీయ జెండాలాగ రెప రెప లాడుతున్నావు! పో.

సుబ్బి: నువ్వెప్పుడూ ఇంతే వదినా. నన్నూరికే ఆటలు పట్టిస్తావ్.

యెంకి: ఆటలు కాదే. అదుగో అటు చూడూ, ఇంటింటి మీదా జెండాలు గాలిలో ఎంత అందంగా ఎగురుతున్నాయో ! వాటిని చూస్తూ, వాటి అందానికి మురిసిపోతూ ఇటొచ్చాను. ఇక్కడ నీ సోకు చూచి మనసు తబ్బిబ్బైపోయింది. ఇంతేనే.

సుబ్బి: ఇయ్యాల ఏదో పండగటగా?

యెంకి: అవును. అందుకేగా మన ఫాక్టరీకి ఇయ్యాల సెలవిచ్చింది?

సుబ్బి: ఏం పండగొదినా, అదీ? కాస్త ఇమర్శగా చెప్పవూ?

యెంకి: మా తమ్ముడు యాదగిరిని అడక్కపోయావూ? వాడంతా అరిటిపం డొలిచి చేతిలో పెట్టినట్టు నీకు ఇమర్శగా చెప్పేవాడుగా.

సుబ్బి: ఫో వదినా నీ వెప్పుడూ ఇంతేనూ !

యెంకి: ఏం నంగనాచివే. పట్నం వచ్చి ఇంకా నెలతిరగలేదు. అప్పుడే మావాణ్ణి కొంగున కట్టేసుకున్నావు గదా, నీ జాణతనానికి ఏమనాల్నే నిన్ను !

సుబ్బి: నేనేం అన్నెం పున్నెం ఎరుగను యెంకమ్మొదినా. తప్పంతా మీ

తమ్ముడిదే.

యెంకి: మీలో తప్పెవరిదైనా మీ ఇద్దర్నీ కలిపి శిక్షించాల్సిందే. ఈ పండగరోజునే ఆ శిక్ష వేస్తే బాగుండేట్లుందే !

సుబ్బి: పండగ, పండగ అంటావు గాని అదేందో కాస్త చెప్పవమ్మా అంటే చెప్పవు.

యెంకి: ఏదో పదేళ్ళనుంటి చూస్తున్నానన్నమాటే గాని, అదేదో నాకు మాత్రం ఏఁ తెలుసునే?

సుబ్బి: ఏం? మా రామయ్యన్నను అడక్కపోయా? అరిటి పండొలిచి నోట్లో పెట్టినట్టు ఇమర్శగా చెప్పేవాడుగా నీకు.

యెంకి: ఆసి ఏం గడుసుదానివే. నా చదువు నాకే అప్పగిస్తున్నావు? ఇంత గడుసుదానితో మా తమ్ముడు ఎట్లా ఏగుతాడో ఏమో.

సుబ్బి: ఏగకపోతే చల్లగా అట్లాగే ఉంటాడులే. ఈ రోజు ఏం పండగో కాస్త చెపుదూ, నీకు పుణ్యముంటుంది.

యెంకి: ఇదేందో రిపబ్లికు పండగంట. మరదలా, పదేళ్ళనించి ఈ పండగ చేస్తున్నారు కాని ఒక్కసారైనా దీని సంగతేమిటో కనుక్కుందామని నా మనస్సుకు తట్టనే తట్టలేదే. అదేం సిత్రమో.

సుబ్బి: రామయ్యన్నయయినా వస్తే బాగుణ్ణు. నేనే అడిగి తెలుసుకుందును.

యెంకి: నిదర మంచాన లేచి యాదగిరి, సుబ్బయ్యా కలిసి ఎక్కడికో వూరేగారు. తొందరగా లేచి తయారై రావయ్యా, అని మీ అన్నయ్యతో చెప్పి, నేనిట్లా వచ్చా. ఇంతవరకూ వాళ్ళ అయిపే లేదు. ఎక్కడ ఏం పెత్తనాలు చేస్తూ కూర్చున్నారో? అయనా, ఏం మొగుళ్ళోళ్ళలే, ఎక్కడికిపోతే అక్కణ్నే.

సుబ్బి: అడుగో, రామయ్యన్న వస్తుండాడు.

రామ: ఏందోవ్. మొగాళ్ళ నేందో ఆడిపోసుకుంటున్నావ్.

యెంకి: తొందరగా రమ్మని చెప్పి వస్తే, ఇంతసేపూ ఎక్కడికెళ్ళావ్. ఎవరూ లేకుండా చూచి మళ్ళీ, ఆ హుస్సేన్‌సాగర్ కట్టకిందికెళ్ళావా ఏంటి ఖర్మ?

రామ: రామ రామ, మన పెద్ద పాదాలముందు ఇంకెప్పుడూ తాగనని ఆ తిరపతి వెంకట రమణమూర్తి మీద వొట్టేసుకున్నాగదా. ఈ జన్మలో ఇంక దానికి తిరుగుంటుందీ? ఈ రామయ్యంటే ఆల్లాటప్పా అనుకున్నావా ఏందే? అయినా ఈ ఆడోళ్ళున్నారే ఆడోళ్లు! వీళ్ళొట్టి అనుమానం మనుషులు చెల్లెమ్మా.

సుబ్బి: ఆమాట నాతో అంటే ఏం లాభమన్నా, నేను ఆడదాన్నేగా?

యెంకి: ఇంతకూ ఇంతాలస్యం ఎందుకైందో, ఆసంగతి చెప్పవేం?

రామ: నువ్వు నిదరలేపి వెళ్ళావా. దుప్పటి ముసుగు తొలిగించే లోపల ఏదో బలే సంగీతం వినొచ్చింది. అదేందో చూస్తామని బజారు కేసి వెళ్ళాను. బజారు బజారంతా జనంతో కిటకిటలాడిపోతావుంది.

యెంకి: బలే సంబరమాలుందే? ఏం సంబరమది?

రామ: వాళ్ళంతా నగర సంకీర్తనమంట చేస్తున్నారు. అందరి చేతుల్లో మన మూడు వన్నెల జెండాలున్నాయి. బాండు వాయిద్యగాళ్లూ, సన్నాయి వాళ్ళూ, ముందు వాయిస్తున్నారు. అంతా కలిసి జాతీయ గీతాలంట, అవేవో పసందైన పాటలు, పాడుతున్నారు. అంతా బలే కులాసాగా ఆడుకుంటూ, పాడుకుంటూ, పోతున్నారు. ఆ వైబోగమంతా చూసి ఆనందించాల్సిందే కాని చెప్పశక్యం గాదు. కొట్టి కోలాహలంగా ఉందంటే నమ్మ్మ.

సుబ్బి: అయితే అన్నా. ఇయాళ వాళ్ళంతా ఈ నగర సంకీర్తన ఎందుకు

చేస్తున్నట్లు?

రామ: ఇయాళ రిపబ్లికు రోజాగదంట, చెల్లమ్మా. ఆసంగతి అందరికీ తెలుపుడు చెయ్యడానికి ప్రొద్దున్నే ఇట్లా వూరంట బయల్దేరారు.

సుబ్బి: రిపబ్లికు అంటే ఏందన్నా? ఇందాక యెంకమ్మొదిన అడిగినా చెప్పింది కాదు.

రామ: ఇది ఏ నెల చెల్లెమ్మా?

సుబ్బి: ఇది జనవరి నెల గదంటన్నా?

రామ: ఇయాళ ఎన్నో తారీఖు?

సుబ్బి: ఏమీ తెలవనట్లడుగుతుండావే? ఇయాళ ఇరవై యారో తారీఖు గదూ?

రామ: ఏటేటా జనవరి ఇరవై ఆరో తారీఖున మనం చేసుకునే పండుగనే రిపబ్లికు అంటారు.

యెంకి: అంతమాత్రం మాకూ తెలవదేంది? ఇంక నువు చెప్పిందేముంది?

రామ: ఏదో నలుగురూ రిపబ్లిక్కు అంటే నేనూ రిపబ్లికు అనడమే గాని దాని సంగతి నాకు మాత్రం ఏం తెలుసునే? చదూకున్నానా, ఏమన్నానా? కాయకష్టం చేసుకుని బతికేవాణ్ని, ఏమన్నా తెలిస్తే మన సుబ్బయ్యకూ, యాదగిరికీ తెలవాలి, కసింత చదువు ఎలగ బెట్టారు కాబట్టి.

యెంకి: అదుగొ మాటల్లోనో వస్తున్నారు. బావా మరిదీ.

యాదగిరి: రామయ్య బావా. ఎంత బాగుందనుకున్నావ్, చూడడానికి వెయ్యి కళ్ళైనా చాలవు.

రామ: ఏందిరా? ఏ పిల్లమీదన్నా కన్నేశావా ఏం, కొంపతీసి?

యెంకి: వాడు కన్నేసిన పిల్ల ఇక్కడే వుందిలే, ఆ భయం నీకేం అక్కర్లేదు.

రాము: ఏమిటే. ఇన్నాళ్ళూ చెప్పకనే పోతివిగదే ఒరే యాదకీరీ. నువ్వెంత అదృష్టవంతుడివిరా. మా చెల్లెమ్మ బంగారు తల్లి.

యెంకి: ఇంతకూ నువు చూసొచ్చిందేందిరా, తమ్ముడూ?

యాదగిరి: చూడక్కా. బావ నన్నూరికే ఆటపట్టిస్తాడు. నేను చెప్పనే చెప్పను.

రాము: ఓరి ! ఇంత మాత్రానికే వీడికి కోపమొచ్చిందే. ఇక వీడు చెప్పడు గానీ నువ్వన్నా చెప్పరా తమ్ముడూ.

సుబ్బయ్య: అక్కడ మైదానం లేదన్నా ! ఆమైదానంలో మన సైనిక దళాలన్నీ వచ్చి చేరాయి. ఆశ్వికులూ, పదాతులూ, టాంకులూ-ఒకటేమిటి అన్ని దళాలూ బారులు తీరాయి. పైన విమానాలు బంయ్ మని ఒకటే తిరుగుతున్నాయి. మన గవర్నరు జెండా ఎగరేసి సైనిక వందనం స్వీకరించారు. మిలటరీ బ్యాండు మన జాతీయ గీతాన్ని ఎంత చక్కగా పాడిందనుకున్నావ్ !

యెంకి: ఇదంతా ఎందుకు చేసినట్లు, మరిదీ?

సుబ్బ: రిపబ్లిక్కు లేదొదినా రిపబ్లిక్కు. ఇందుకేగా ఆ రిపబ్లికు రోజు! ఆపండక్కు ఈ సన్నాహాలన్నీ వుంటాయి.

రాము: రిపబ్లికు అంటే ఏందిరా సుబ్బన్నా? ఇందాక ఈళ్ళు అడిగితే చెప్పలేకపొయ్యాను. నువు కాస్త చదువుకున్నోడివిగా. నీకేమన్నా తెలుసా?

సుబ్బ: నేను చదువుకున్న రోజుల్లో రిపబ్లికు అనేది ఎక్కడిదన్నా. అప్పటికింకా తెల్లోళ్ళే పరిపాలిస్తుండిరిగా?

యాదగిరి: నేను చెప్తానుండు.

రాము: ఓరి వీడికి కోపం పోయిందిరా.

యెంకి: మళ్ళీ నువ్వేందంట మధ్య? చెప్పరా తమ్ముడూ.

యాదగిరి: తెల్లోళ్లు మనల్ని పరిపాలించినంత కాలం పరిపాలించి, మన ధాకకు తట్టుకోలేక, మన దేశాన్ని మనకు వదిలి వెళ్ళిపోయారు. అప్పటినుంచి మనం స్వతంత్రులమై, మనల్ని మనమే పరిపాలించుకుంటున్నాం. ఆసంతోషాన్ని తెలియ జెయ్యడానికి ఏటేటా పండగ చేసుకుంటున్నాం.

సుబ్బయ్య: పప్పులో కాలేశావురా యాదగిరీ.

యాద: ఏం చినబావా, నేను చెప్పింది తప్పంటావా?

సుబ్బ: తప్పుకాదు గాని, ఆపండగ వేరే పండగ. అది ఏటా ఆగష్టు పదిహేనవ తేదీన వస్తుంది. దానికీ ఇట్లాగే చేస్తార్లే.

యెంకి: అయితే ఇంతకీ ఈ రిపబ్లికు పండగ ఏందో తేలనే లేదే?

రాము: ఇక మన పెద్ద, రమణయ్య బాబు తేల్చాల్సిందే. పదండి పోదాం ఆయన దగ్గరికి.

అందరూ: భేషు. ఈ ఆలోచన బాగా వుంది. పదండి పోదాం.

- - - - - - - - - - - -

అందరూ: దండాలు రమణయ్యబాబూ దండాలు.

రమణయ్య: రండి, రండి, కూర్చోండి ఏం రామయ్యా, సకుటుంబ సపరివారంగా తర్లి వచ్చావ్? ఏమిటి కధా?

రామయ్య: ఏంలేదు బాబూ, యీ రోజు రిపబ్లిక్ రోజు కదా రిపబ్లికు అంటే ఏమిటో మీ వల్ల తెలుసుకుందామని వచ్చాం.

రమ: ఏటేటా రిపబ్లికు రోజు వస్తూనే ఉందిగదా. ఇదివరకు ఎన్నడూ నీకు యీ కుతూహలం కలగలేదే. ఇప్పుడు యీ ఆలోచన నీదై ఉండదు.

యెంకి: యీపిల్ల రిపబ్లికును గురించి తెలుసుకోలని చాలా ముచ్చట పడుతుంది, బాబూ.

రమ: ఈ అమ్మాయి కొత్తగా వచ్చి ఫాక్టరీలో చేరింది కదూ? పని శ్రద్ధగా చేస్తూ ఉండడం నేను చూసాను. ఈ పిల్ల నీకు ఏమవుతుంది, యెంకమ్మా?

యెంకి: ఏందో బాబూ. నా ఆన్నవాళ్లు లేక యీవూరొచ్చి మన ఫాక్టరీలో చేరింది. దీని గుణాలకు ముచ్చట పడి చేరదీసాను. భగవంతుడు మేలు చేస్తే దీన్ని మా యాదగిరికి ఇచ్చి..

రమ: సరి సరి మరదలు వరస కలిపావన్నమాట. శుభం అయితే సుబ్బమ్మా నీకు రిపబ్లికు గురించి తెలుసుకోవాలనుందా?

సుబ్బి: అవును, బాబూ.

రమ: చాలా సంతోషం. తెలియని విషయాలు తెలుసుకోవాలనే కుతూహలం, శ్రద్ధా, ప్రతి ఒక్కరికీ ఉండడం చాలా అవసరం. అట్లా తెలుసుకుంటూ ఉన్నప్పుడే మనం ముదుకు పోగలుగుతాం.

సుబ్బ: అందువల్లేగా బాబూ. తెల్లోళ్ళు యీ ప్రపంచంలో అంత గొప్పస్థితిలో ఉంది.

యాదగిరి: ఏడ్చారు ! ఒకనెత్తురు బొట్టున్నా చిందకుండా సత్యాగ్రహం చేసిన మన గాంధీ మహాత్ముడు వాళ్ళని వచ్చిన దారి పట్టించలా. వాళ్ళ గొప్పేమిటి గొప్ప!

రమ: ప్రపంచంలో ఒకడు ఒక విధంగా గొప్పయితే ఇంకొకడు ఇంకొక విధంగా గొప్పవుతాడు. ఎవరి గొప్ప వాళ్ళది. ఏ జాతికి చెందిన

వాడైనా. మానవులంతా సోదరులు అనే భావం ఇప్పుడు మనకు కావాలి. అంతేకాని, ఎక్కువ, తక్కువలు, ఎంచుకోవడం కాదు. మన మూడు వన్నెల పతాకాన్ని జాగ్రత్తగా చూచావా, యాదగిరీ?

యాద: చూశాను బాబూ.

రమ: ఆ మూడ రంగుల్లో మధ్య రంగేదో చెప్పు చూద్దాం?

యాద: మధ్య రంగు తెలుపు.

రమ: ఆ తెలుపు రంగుందే అది శాంతికి గుర్తు. గాంధీజీ బోధించినట్లుగా మన మంతా తోటిమానవులతో స్నేహంగా ఉండి ప్రపంచశాంతికి పాటుపడాలని ఆ రంగు మనకు తెలుపుతుంది. ఆతెల్లరంగు మీద జెండా మధ్యలో ఏముందో చెప్పు సుబ్బయ్యా.

సుబ్బ: అది చక్రం గదా, బాబూ.

రామ: విష్ణు చక్రమా ఏమటి, రమణయ్యబాబూ?

రమ: కాదు. అశోక చక్రము. అశోకుడి పేరు ఎప్పుడైనా విన్నరా?

యెంకి: ఎవరు బాబూ ఆయనా?

రమ: ఆయన మన దేశాన్ని పరిపాలించిన ఒక మహా రాజు.

సుబ్బి: ఎప్పుడు రాజ్యం చేశాడు బాబూ, ఆయనా?

రమ: ఇప్పటికి రెండువేలసంవత్సరాల క్రింద ఆయన రాజ్యానికి వచ్చిన కొత్తలో, కళింగదేశం మీదికి దండెత్తివెళ్ళాడు.

యాద: కళింగదేశమా? అదెక్కడిది బాబూ? ఆ పేరెప్పుడు వినలేదే?

సుబ్బు: ఏందిరా, యాదగీరీ? అంగ, వంగ, కళింగ, బంగాళ, నేపాళ - అని మన పూర్వులు చెప్పే చప్పన్న దేశాల్లో ఒకటి గదరా అదీ?

జంగం కథలు చెప్పేవాళ్ళకు కూడా తెలుసునే ఆ సంగతి? నీకు తెలియదంటావు ఏందిరా?

యాద: నువ్వు మహాతెలిసినవాడివిలే! ఆ కళింగ దేశాన్ని ఇప్పుడే మంటారో తెలిస్తే చెప్పు చూద్దాం?

సుబ్బు: అదెవరికి తెలుస్తది? మన రమణయ్యబాబు చెప్పాల్సిందే. పూర్వకాలపు కళింగమే - - - - - - మనసు విరిగిపోయింది.

రామ: అయిరక్తిలో రాజ్యం వదలివెయ్యలేదు గదా, ఆయన?

రమ: లేదు. కాని యుద్ధాలు మానేశాడు. ధర్మాన్ని చేపట్టి దాన్ని జనులందరికీ బోధించాడు. అం టే మారణ చక్రానికి బదులు ధర్మచక్రాన్ని చేపట్టాడు. ఆ ధర్మచక్రమే మనజెండా పైన ఉంది. ఇప్పుడు చెప్పండి దాని అర్థమేమిటో?

సుబ్బి: ఆ జెండాక్రింద ఉండేవాళ్ళంతా ధర్మంగా ఉండాలని, శాంతికోసం పాటుపడాలనీ, కద బాబూ. దానర్థం?

రమ: సెభాస్. బాగా చెప్పావ్ సుబ్బమ్మా. ఇప్పటికి పదమూడేండ్లక్రింద ఒక రోజున స్వాతంత్ర్యం సంపాదించుకుని ఆ జెండాను మనం ప్రతిష్ఠించుకో గలిగాం.

రామ: అదేనా బాబూ. రిపబ్లికు రాజ్యం?

రమ: కాదు రామయ్యా. అది స్వాతంత్ర్యదినం. 1947 ఆగస్టు 15వతేదీ మనకు స్వాతంత్ర్యం వచ్చింది. అప్పటినించి ఏటేటా అగస్టు 15వ తేదీ మనం స్వాతంత్ర్యోత్సవాలు చేసుకుంటున్నాం. రిపబ్లికు పుట్టింది 1950 జనవరి 26వతేది

రామ: రిపబ్లికు పుట్టడమేమిటి, బాబూ?

రమ: చెబుతా. వినండి. మనదేశంలో ఉండే ప్రజలంతా గాంధీజీ

నాయకత్వం క్రింద ఏకమై స్వాతంత్రాన్ని సాధించారు. ఆ స్వాతంత్ర్యంవల్ల కలిగే లాభాలు ప్రజలంతా పొందాలంటారా లేదా?

యెంకి: తప్పకుండా అందరూ అనుభవించాల్సిందే, బాబూ.

రమ: స్వాతంత్ర్యంగానే, పూర్వం లాగ ఒక మంచిమనిషిని రాజునుచేసి దేశపరిపాలన ఆయనకు అప్పగించామనుకోండి. ఆ ఒక్కడూ ఇంతమంది బాగోగులు సరిగ్గా చూస్తాడని ఏమి పూచీ ఉంది?

సుబ్బ: ఏం పూచి వుంటుంది. బాబూ? తన సుఖమేగాని, రాజుకు ప్రజల సుఖమేం పడుతుంది?

రాము: అయితే మరి పరిపాలన సాగేదెట్లా?

రమ: ప్రజలే పరిపాలన చెయ్యాలి. అప్పుడు వారికి సుఖంగా ఉంటుంది.

యాద: మనదేశంలో జనాభా కోట్లకొద్దీ ఉందిగదా, ఇంతమంది కలిసిపరిపాలన చెయ్యడమంటే అయ్యే పనేనా, బాబూ?

రమ: ప్రజలు ప్రతినిధులను ఎన్నుకుని శాసనసభలకు పంపుతారు. వాళ్ళలో కొంతమంది మంత్రులై పరిపాలన చేస్తారు. వాళ్ళంతా ప్రజాప్రతినిధులు కాబట్టి ప్రజలయోగక్షేమాలకు వ్యతిరేకంగా పోలేరు. అట్లాపోతే మళ్ళీవచ్చే ఎన్నికల్లో వాళ్ళకు పుట్టగతులుండవు. స్వాతంత్ర్యం వచ్చిం తరువాత మనం ఇలాంటి పరిపాలననే ఏర్పాటు చేసుకున్నాం.

సుబ్బ: బాబూ, అదేనా రిపబ్లికంటే?

రమ: బాగా కనుక్కున్నావ్, సుబ్బయ్యా, అసలు రిపబ్లికు అనేమాటకు రాజు లేని పరిపాలన అని అర్థం. మన పరిపాలనలో రాజు లేడు. పైగా మనది ప్రజాపరిపాలన. అంటే ప్రజాస్వామ్యం అన్నమాట

కొన్ని ప్రజాస్వామ్యాల్లో పేరుకు రాజంటూ ఒకడు ఉంటాడు. అవి ప్రజాస్వామ్యాలైనా వాటిని రిపబ్లికులు అనరు.

రామ: ఇప్పుడు బాగా తెలిసింది బాబూ. రిపబ్లికు పండగ ఏటేటా మనమంతా ఎందుకు చేసుకోవాలో ఇప్పుడు అర్థమయింది.

యెంకి: ఇంక పోయి సంబరం చూద్దాం. పదండి.

యాద: మీటింగులూ, గీటింగులూ అన్నీ అయిపోయుంటయ్. ఇంటికిపోయి గారెలు, పరమాన్నం చేసుకుతిని రాత్రికి ఏకంగా దీపాలు చూడ్డానికిపోదాం.

రమ: దీపాలంటే జ్ఞాపకం వచ్చింది. ఈయేడు మన జంటనగరాల్లో దీపాలంకరణ మహాజోరుగా ఉంటుంది. తప్పకుండా చూడాల్సిందే.

సుబ్బి: ఎందువల్ల, బాబూ?

రమ: తమ ఇండ్లను దీపాలతో ఎక్కువ అందంగా అలంకరించినవాడికి బహుమతులు ఇస్తామని మన గవర్నమెంటువారు ప్రకటించారు.

రామ: ఐతే ఇంకేమే ఎంకీ. నీతమ్ముడికీ, మా చెల్లెమ్మకూ ఇయ్యాలనే గుళ్ళోమూడు ముళ్ళూ ఏయిస్తే సరి, రాత్రికిగాస్‌లైట్ల ఖర్చులేకుండా ఊరేగింపు చేసుకోవచ్చు.

యెంకి: భలేవాడివిలే. (నవ్వు)

(ప్రసారం తేదీ. 23-1-60)

----- 0 -----

# మనమంతా ఒక్కటే

*పాత్రలు:*

సీతాపతి. 30 సం.లు
రామారావు. 30 సం.లు.
సూత్రధారులు, ఉపగుప్తుడు. 40 సం.లు
అశోకుడు. 30 సం.లు
అమాత్యుడు. 60 సం.లు.
(ఎ కారెక్టర్ హూ కెన్ సింగ్ పోయమ్స్.
30. సం.లు)

ఒక గొంతు: ( దూరంగా పోయేమనిషిని కేకవేసి పిలుస్తూ) ఓ రాముడూ. రామారావ్, ఓయ్, నిన్నే.

రెండవగొంతు: ఎవరూ? - ఓరీ నువ్వట్రా, సీతాపతీ, ఏదో కొంప మునిగిపోయినట్టుగా కేకలేస్తే హడిలిపోయాను.

సీతా పతి: ఆ వంతున పిలుస్తున్నా వినిపించుకోకుండా ఉరకలెత్తుతుంటివి మరి కేకలుపెట్టక తప్పుతుందా? పైపెచ్చు గావుకేకలేస్తున్నావని నన్నంటావ్. భలేవాడివే.

రామారావు: సరేలే, ఏమిటి విశేషాలు, ఇంటివద్ద మనవాళ్ళంతా కులాసాయే కదా? ఇక్కడి కెప్పుడు వచ్చావ్?

సీతా: పొద్దుటిబండికి దిగామురా. కాస్త పనిమీదే వచ్చాలే. తెలుసుగా మాయింటిమందడి గోడ సంగతి. మరీ మాపొరుగు ముదనష్టపు పొరుగైపోయిందిరా.

రామా: ఎవరూ, ఆ జానికిరామయ్య సంగతా, నువ్వు చెప్పేది?

సీతా: ఇంకెవరున్నార్రా, ఆ తగువులమారివాడే - మా ఇంటి ప్రహరీగోడ వాళ్ళస్థలంలోకి వెళ్ళిందిట. నా స్థలం తప్పించి వాడి స్థలంలో ఒక్క అంగుళమైనా నాకెందుకురా, అన్యాయపు సొమ్ము? చెప్తే వినిపించుకుంటాడా, ఏమన్నానా? పెద్దవ్యవహారం తెలిసినవా డిలా కాగితాలూ, కరామత్తులూ, చూపించవచ్చాడు-

రా:- చాలావరకు నడిసిందే గ్రంధం. - మరి నువ్వేం చేశావ్?

సీ: అంత రక్తం చచ్చిలేడులేరా, ఈ సీతాపతి? చెమటోడ్చి రాయి రాయి, చేరవేసి కట్టిన మందటిగోడని ఈ భ్రాష్టుడి మూలాన పడగొట్టుకుంటానా? వాడితాతలు దిగిరావలసిందే.

రా: ఐతే సీతాపతీ, నాకు తెలియక అడుగుతాగాని, అసలు పొరపాటెవరిది? వాడి స్థలంలోకే వెళ్ళిందా, నీ గోడ?

సీ: ఏమో, వెళ్ళిందో, లేదో, గోడ కట్టేటప్పుడు కుక్కినపేనులా నోరు మూసుకుని ఊరుకున్న వీడు ఇప్పుడు కాలుదువ్వుతాడా, నామీద? ఆనాడే అడ్డమొస్తే ఏమిచేసుండేవాడినో, ఇప్పుడు నాకు నష్టం కలిగించాలని చూస్తున్నాడు. వాణ్ణి ఊరికే వదులుతానా? ముప్పుతిప్పలు పెట్టి మూడుచెఱువుల నీళ్ళు తాగిస్తాను. ఈ విషయంలో ప్లీడర్ని చూడ్డానికే ఈ ఊరొచ్చాను.

రా: ప్చ్, ప్చ్, ఎందుకొచ్చిన గందరగోళంరా బాబూ, ఆ కోర్టుకయ్యే డబ్బు పెట్టుకుంటే నీవు లక్షణంగా ఆ గోడే ఇవతలికి జరుపుకోవచ్చుగా. ఆ జానకిరామయ్య ఏమన్నా పరాయివాడు గనుకనా, ఎంతకాలం నుంచో ఇరుగుపొరుగున ఉంటున్నారు. ప్రొద్దున్నలేస్తే మొహాలు, మొహాలు చూసుకునేవాళ్ళు.

సీ: మహా చెప్పొచ్చావు లేరా. నీకిలాటి అనుభవం అయితే అప్పుడు తెలిసివస్తుంది. తమదాకా రానంతవరకూ తీరిగ్గా కూర్చుని మనమంతా కావలసినవాళ్ళమే అని ఎన్నికబుర్లయినా చెప్పవచ్చు.

రా: పోనీలేరా, ఎందుకొచ్చిన సోది? భూమి మీద బ్రతికినన్నాళ్ళూ మనం మనం కలిసి మెలసి ఉంటే జీవితాలు సాఫీగా నడుస్తాయన్నానుగాని, పొద్దుగూకులూ మనుషులూ, మనుషులూ తలలు బద్దలుకొట్టుకునేటట్లుంటే ఈ ప్రపంచంలో రవ్వంతయినా సుఖమూ, ఆనందమూ ఉంటుందా?

సీ: అవుననుకో. ఎదటిమని,ఖి కూడా ఆ అభిప్రాయం తోటే ఉండాలిగదా? జానకిరామయ్య ఉన్నాడు చూశావూ. -

రా: పోనీరా, పొద. కాస్సేపు ఈ కబుర్లు కట్టిపెట్టి అవతలిబజారులో ఏదో నాటకం వేస్తున్నారట, పోయి చూద్దాంపద? సత్కాలక్షేపమన్నా అవుతుంది.

నాంది

భిన్న విభిన్న తత్వపరివేష్టిత సర్వవిభేదభావ సం
ఛన్న మహాంధకార పధశాసితమై చెరలాడు సృష్టిలో
అన్నిట నన్నియై మఱల నన్నిటనొక్కటియై వెలుంగు నం
షన్న మహాత్మ తత్వ గరిమమ్మున కంజలి సంఘటించెదన్.

సూత్రధారుడు: నటీ , వేషధారణ త్వరగా ముగించి ఒకసారి ఇలా వస్తావా?

నటి : (వచ్చి) నమస్కారం, ఆర్యపుత్రా, ఏమి శెలవు?

సూ. ఉత్తుంగ సగర తరంగ ఘోషాన్ని అనుకరించే ఈ సభాకోలాహలం వింటున్నావు కదా? ఇప్పుడు మనమేదయినా ఒక రమ్యమైన నాటకాన్ని ప్రదర్శించి సభ్యుల మనస్సులను రంజింపచెయ్యాలి.

నటి : ఏమి ప్రదర్శింపమని ఆర్యపుత్రుడి ఆజ్ఞ?

సూ: సర్వప్రపంచమూ క్షుబ్ధసాగరంలా కల్లోలపడే ఈ రోజుల్లో మనమంతా ఒకటేననీ. మనిషికి మనిషి తోడూ నీడే కాని శత్రువుకాడని చాటే నాటకం ప్రయోగించాలి, సరేనా!

నటి : అలాగే ఆర్యపుత్రా. అలనాడు వ్యధితహృదయుడైన అశోకచక్రవర్తి మనస్సును త్రిప్పిన ఉపగుప్తులవారి బోధలే మీరు చెయ్యండి. ఉపగుప్తాచార్యుల వేషం మీరు కడితే జనం ముగ్ధులై మీ మాటలు మనస్సులకు పట్టించుకుంటారు.

సూ: సరే. పద. అశోకుడు కళింగ యుద్ధంచేసి వచ్చేటప్పటికి నేను ఉపగుప్తుడి వేషం ధరించి సిద్ధంగా ఉంటాను. ముందు నువ్వు అశోకచక్రవర్తి సభకు అన్ని సన్నాహాలూ చెయ్యి.

<u>కైవారము.</u>

జయ, జయ. మౌర్యవంశ క్షీరపారావార రాకా సుధాకరమూర్తీ,
జయ, జయ, అమిత్రఘాత బిరుదాంకిత బిందుసార నృపాల
హృదయజలజహేళీ, జయ, జయ,సామంత వరౌళి
మణిమండన, నీరాజితదివ్యమూర్తీ, అశోకచక్రవర్తీ, జయ, జయ.

అశోకుడు : సభాసదులారా, సువిశాల-మైనమౌర్య సామ్రాజ్యానికి మూలస్తంభాల వంటి మీకు చెలియందేమీలేదు. మా రాజ్యానికి కాశ్మీర, నేపాళాలు ఎనలేనిభూషణాలు. వాయవ్య సరిహద్దుగా అమరిన హిందూకుశపర్వతశ్రేణి పెట్టనికోటగోడ. దక్షిణపు హద్దుగా భాసిల్లే పినాకినీనది త్రవ్వని అగడ్త. ఆయినా పినాకిని అవతలా, వాయవ్యపు సరిహద్దు అవతలా, కొందరు మనరాజ్యం మీద కన్నువేసి, అడపాదడపా ఉపద్రవాలు తెస్తూనే ఉన్నారు. వాళ్ళందర్నీ మించి తూర్పుతీరప్రదేశంలో రాజ్యంచేసే కాళింగులు మనకళ్ళల్లో నలుసులవలె బాధపెడ్తూనే ఉన్నారు. వీళ్ళని ఉపేక్షిస్తూ ఇలా ఎంతకాలం?

అమాత్యులు: ఒద్దు మహారాజా, ఉపేక్షించవద్దు. వాళ్ళని ఉపేక్షిస్తే మనకు ఉపద్రవం. మహారాజుల పరాక్రమవిజృంభణ ముందు వారెంత, ప్రభూ. వట్టి గడ్డిపోచలు! రాజాధిరాజులు మౌర్యకులాలంకారులు తమరు చేపడితే కొనసాగని తేదీలేదు. దిగ్విజయ-యాత్రాప్రారంభానికి సుసజ్జితాశ్వాలవలె తమ సేన లోని వీరభటులందరూ ఉరకలువేస్తున్నారు. వాళ్ళకు అనుజ్ఞ ఇవ్వండి. యీనాటి ప్రయత్నమాయిది? శత్రువీరరక్తాన్ని చవిచూచే తహతహలతో, మెరమెరలాడే పదును కత్తులు, ఏనాటినుంచో సన్నద్ధాలై పలవరిస్తున్నవి. దిగ్విజయ ప్రారంభానికి ఆజ్ఞ ఇవ్వండి. నాయనగారి అమిత్రఘాత బిరుదాన్ని మీ పరంగా కూడా సార్ధకం చేసుకోండి.

సభాసదులు: అవును చక్రవర్తీ, మౌర్య సామ్రాజ్య పాలనలో భూమి అవిభక్త కావాలి. సర్వసర్వంసహా ఒక్క మౌర్య వంశపు తెల్లగొడుగు క్రిందే చల్లదనాలనుభవిస్తూ ఉల్లసిల్లాలి. అవుననండి చక్రవర్తీ, అవుననండి, దిగ్వి జయశోభితులై వర్ధిల్లండి.

అశోకుడు: ఏమి ఉత్సాహం, దిక్కులను క్రక్కదలిస్తూ శత్రువుల గుండెలకు కంపాన్ని కలిగించే ఎంతటి ఉద్రేకపు పొంగు! మీ మాటకాదనే తాహతు నాకేదీ? ఈనాటి నుంచీ అశోకుడు దిగ్విజయ

కార్యావసర లగ్నమనస్కుడు! సమస్త శత్రుశిరఃకర్తన క్రీడార్పితబుద్ధి! అమాత్యా, యీ వర్షాకాలం వెళ్ళగానే దిగ్విజయ ప్రారంభమునకు తగిన సన్నాహాలు చేయించండి. వీరుడైన ప్రతివాడూ మనసేనలో చేరడానికి అవకాశాలు కల్పించండి.

అమా: మహారాజా, కళింగం అన్నిటికంటే మిన్నగా మనకు తొందరకలిగిస్తున్న దేశం. తీరప్రదేశం కావడంవల్ల కూడా అది రేవులను స్వాధీనం చేసుకొని వ్యాపారప్రయాణాల్లో మనకు అవరోధాన్ని కలిగిస్తున్నది. మన దిగ్విజయయాత్ర ముందుగా కళింగంమీదికే-

అశో: మీ ఇష్టం, అమాత్యా, మౌర్యసామ్రాజ్య శ్రేయోభిలాషులు మీరు. మీవాక్కు నాకు గురువాక్కు.

---- బరాబరులు - సభ లేచిన కలకలం----

---విరామసంగీతం.--

----- కొంతసేపు యుద్ధాన్ని, కలకలాన్నీ, బాధాసూచకస్వాలనూ, సూచించేధ్వని - విషాద సంగీతం. ---

వారుస్వేచ్ఛావాయువర్ధిత భీషణ లేలిహానములు కళింగజనులు,

వారు సామ్రాజ్య సంభార దర్పిత గరుత్మంతులు మౌర్య సామంత జనులు,
వారు వారును నొక్క బంగారుభూమి పండించిన పంటలే, డెందములను రోష పిశాచకానేషాట్టహాస వికారలాస్యమ్ములు క్రందుకొనగ,

కత్తులు ఖళేల్ ఖళేలని, కఱకుటంప
వానలు ఫెడేల్ ఫెడేలని భయదభంగి
పోరి, పీనుంగు పెంటలై పొలిసినారు,
వారు వారేమి బావుకొన్నారొగాని.

వేదఋషుల్ మథించిన పవిత్ర సనాతన ధర్మతత్వమున్
లేదనకుండ గా దనుమలీమసవృత్తి నీహంక్రియాతమ-
చ్ఛాదిత వక్రభావ హతజన్ములు మానవు, అందరున్ సమా
నాదరణీయులన్న పరమాద్భుతభావము కల్గుడెన్నడో.

ఒకనికొకండు హెచ్చని మరొక్కడు లొచ్చని పాటపాడి సాం
ఘికమగు నడ్డుకమ్ములు బిగించి స్వకీయులమధ్య, జాతి జా
తికి గిరిగీసి, అందరొకచేయనుభావము మాసిపోవదు
ర్వికసన బుద్ధులై పరిఢవింతురు మానవులమిమి చిత్రమో.

అమా: మహారాజా?

అశో: ఎవరు, అమాత్యులా?

అమా: అవును నేనే మహారాజా, కళింగయుద్ధంలో విజయలాభంకూడా సంతోషం తెప్పించని మీమనోవేదన కర్థం?

అశో: అడగకండి అమాత్యా, క్షత్రియవంశంలో పుట్టిన వాడికి కత్తి తీసివేయరాని భూషణం. నన్నీ ప్రశ్నలు అడిగి వేధించకండి.

అమా: అలా అంటే ఎలా? చక్రవర్తీ! జయకాంక్షి అయన రాజునకు జయంపొందడం కంటే ఉల్లాసం కలిగించేదేది? అలాంటి శుభం కూడా మీకు ఉల్లాసం కల్పించటంలేందే? ఏదో తీరని నేరం చేసినట్లు మీరెందుకిలా కుమిలిపోతున్నారు?

అశో: రాజ్యపాలకుడుగా ప్రజలచే శాసింపబడ్డ వాణ్ణి నేను, నాకోర్కెలను సందేహాలను చెప్పుకోవచ్చునా, అమాత్యా?

అమా: ఎంతమాట. సర్వవసుంధరను శాసించే ప్రభువులు మీకీ సందేహమేమిటి? మీ మనస్సులోని వేదన నాకు చెప్పండి. నేను మీ నాయనగారికాలంనుంచి అమాత్యపదవి నిర్వహిస్తున్నవాణ్ణి. మిమ్మల్ని యీ చేతులతో ఎత్తిపెంచినవాణ్ణి. విశ్వసనీయుణ్ణి

మహారాజా.-

అశో: వినండి. అమాత్యా, కాళింగులు ఎంత స్వేచ్ఛాప్రియులో, వాళ్ళుచేసిన నేరం మాత్రం ఏమిటి? ఒక సామ్రాజ్యపు పొరుగున, దానికిలొంగకుండా స్వతంత్రంగా బ్రతకాలనే కాంక్ష ఉండడం నేరమా? వాళ్ళస్వేచ్ఛను, హక్కులను హర్షించలేని మనం చేసినయుద్ధం, తలచుకుంటే గుండె జలదరిస్తుంది. అది యుద్ధమా, అమాత్యా? పైశాచికకృత్యం, కరాళ వికటాట్టహాస పూరిత భయంకర రాక్షసనృత్యం!

అమా: ఆవేశపడకండి, మహారాజా.

అశో: ఆవేశం తెచ్చుకునే అంతపని చేశాను. ప్రజలను కన్నబిడ్డల్లా పాలించి ధర్మమార్గానుసారుణ్ణి కావలసిన నేనే ఈ చేతులతో కళింగదేశపు రాజవీధుల్లో రక్తపుటేరులు పారించాను. ఒక్కొక్క వీరుడూ కొన ఊపిరి ఉన్నంతవరకు స్వేచ్ఛను వదలుకోడానికి ఇష్టంలేక పోరాడిన ఆదృశ్యం నేనెలా మరువగలను, మంత్రీ, వాళ్ళకు తిరిగి ఎంత మేలు చేస్తే నాకు నిష్కృతి లభిస్తుంది, చెప్పండి-చెప్పరేం?

అమా: తండ్రుల్ని పోగొట్టుకున్న బిడ్డలు, వీరులైన పుత్రుల్ని యుద్ధభూమికి అర్పించి కర్మను తిట్టుకునే ముసలి తల్లిదండ్రులు, ప్రియుని నుదుట మంగళతిలకం దిద్ది పంపి తిరిగిరాని అతనికోసం కళ్ళలో నీరు ఇగిరిపోయేవరకు విలపించే భార్యలు వీళ్ళందరి ఉసురు నేను పోసుకున్నట్లే కదా. ఏది నిష్కృతి మహామంత్రీ, నాకేది నిష్కృతి?

అమా: క్షత్రియ జన్మానికే విరుద్ధమైన యీ ఊహాలేమిటి, మీకు? మనస్సు నిబ్బరించుకోండి, మహారాజా, ప్రశాంతి అలవరచుకోండి.

అశో: ప్రశాంతి? - నాకెక్కడి ప్రశాంతి? ఇరుగుపొరుగు వచ్చి చూచీ

ఓర్చలేని పిశాచికి ప్రశాంతి ఎలా లభ్యమౌతుంది? ఎవరి బ్రతుకులు వాళ్ళు బ్రతుకుతున్నా అందరి అభివృద్ధినీ అభినందిస్తూ మనమంతా ఒకటే అనుకోలేని నాకు ప్రశాంతి కరువుకాదా, అమాత్యా? నా జీవిత ధనాన్నయినా వెలపోసి కొనుక్కుంటాను. ఆ ప్రశాంతి ఎలా లభ్యమౌతుందో చెప్పండి?

అమా: ఒక్కమాట మహారాజా, మన పట్టణ పరిసరాలకు ఎవరో బౌద్ధాచార్యులు విచ్చేశారు. జనం తీర్థ ప్రజలా వెళ్ళి ఆయన బోధనలు విని తరిస్తున్నారట. ఆయన ప్రశాంత గంబీర వదనం అశాంతిని దూరంగా తరిమివేసే వెలుగురేఖనీ. ఆయన స్వరం విశ్వాసాన్ని చేకూర్చే వరం అనీ, అందరూ అనుకుంటున్నారు. ఒక్కసారి ఆయన్ని ఇక్కడికి తీసుకురానా, మహారాజా.

అశో: అవశ్యం కాదుమంత్రీ, నేనే ఆయనవద్దకు వెళ్తాను. రాజ్య భోగాలకూ, సామ్రాజ్య పాలనావేశానికీ దూరమైన చిత్తవృత్తితో పాదచారినైపోయి ఆ తేజస్విని దర్శించి తరింపగలనేమో చూస్తాను. నా మనస్సు నా అధీనంలోకి రాగలిగితే అశోకచక్రవర్తి సామ్రాజ్యాభివృద్ధి కారకుడనే కీర్తికంటే శాంతి కాముకుడనే కీర్తిని పొందడానికి ప్రయత్నం చేస్తాను-పదండి, అమాత్యా, దారిచూపండి.

ఆది బుద్ధభగవానుడాత్మ సాక్షాత్కార
 విమలతేజోరాశి విశ్వహితము
మేలొల్ప తొలిసారి మృగదావమున ప్రవ
 ర్తన మొనర్చిన మహాధర్మచక్ర
మవిరళ ధర్మరాజ్య వ్యవస్థాపనా
 శయుడు మౌర్యాశోకచక్రవర్తి
విశ్వసౌభ్రాత్ర - మావేశించి సమతా మ
 హాధర్మచక్రలాభార్థియగుచు

క్రోధమోహమాత్సర్యసంకుచిత చిత్త
మమలినమైన శాంతి ధామముగ మలచి,
సద్బోధచంద్రికా విలసనమున
కువలయ హితైషియౌ నుపగుప్తు కడకు.

అశో: ఆచార్య ఉపగుప్తులకు నమస్కారం.

ఉపగుప్తుడు: శుభమస్తు, నాయనా, బుద్ధదేవుడి బోధలలో మంచికీ మన్ననలకూ మాత్రమే తావుంది. ఆ బోధలను విశ్వసింపగలిగితే నీకు కావలసిన ప్రశాంతి దానంతట అదే లభ్యమవుతుంది.

అశో: ఆజ్ఞాపించండి, స్వామీ, హృదయారాటంతో తపించిపోతున్న నాకు మీమాటలు వాన జల్లులవలె ఉన్నవి.

ఉప: నీ ఇరుగును, పొరుగును, ప్రేమించు తండ్రీ. ఇతరుల మేలుతోనే నీమేలు ఉందని తెలుసుకో, సర్వమానవ జాతీ ఒక్కటే . రంగు, రుచి, వాసన, మొదలైన భేదాలా, జాతి, మత, వర్గాల లాంటి అంతరాలూ, అంటని విధంగా నీ ఆంతర్యాన్ని మలుచుకో. నిన్ను నీవు ఎలా చూచుకుంటావో, ఇతరులనూ అలాగే చూడు. పరులను పీడించడంకంటే మించినపాపం లేదు. పరులకు ఉపకారం చెయ్యడం కంటే మించిన పుణ్యం లేదు. అహింసామార్గం పట్టి సర్వభూతాలనూ ప్రేమించు. వెళ్ళిరా నాయనా, నీకు శాంతి తప్పకుండా లభిస్తుంది.

అశో: ధన్యుణ్ణి ఆచార్యా, నా అంతరాంతరాల్లో ఏదో వెలుగు. యీ వెలుగును మలగిపోనివ్వకుండా ఇలాగే పోషిస్తాను. అనుగ్రహించండి.

ఉప: మానవులంతా ఒకటే, కక్షలకు కావేషాలకూ చోటివ్వకుండా శాంతిపథంలో ప్రయాణం చెయ్యి, అశోకచక్రవర్తి ధర్మపథవర్తి అనిపించుకో.

: భరతవాక్యం :

మనమంతా ఒకటేయంచుపనిషన్మంత్రార్థముల్ చాటి చె
ప్పిన లోకోత్తర సత్యవాసనలు పృధ్వీఖండమందెల్లన
ర్తనమాడన్ చిరధర్మవర్తన మహారంభుల్ జనుల్ సత్యవ
ర్థనులై యొక్కటికొక్క రై వెలయుదుర్గాక న్నలుందమ్ము లై.

- - - - - - - - - - - - -

రామా: అబ్బ, ఎంత బాగా ఉందిరా నాటకం. ఊపిరితిప్పుకోనియ్యక పోయెగదా, చూసినంతసేపు.

సీతా: ఏమశోకుడురా - అందరినీ ఒక్కలాతూచి దేశదేశాలకూ తనపేరు పాకించేశాడు. ఆ బౌద్ధసన్యాసి ఎంత చక్కగా చెప్పాడురా. మనమంతా ఒకరేనని! ఒరేయ్- మనమంతా ఒకటే - జానకిరామయ్యతో మందడిగోడ తగువు పరిష్కారం చేసుకుంటానురా,-

రామా: సెభాష్, అదీ గొప్ప బుద్ధంటే! అయితే నీవు నాటకం చూడడం వృధా పోలేదురా, సీతాపతీ.

సీతా: ఇందులో నేను చూపించే ఉదారం కూడా ఏమీలేదు. అసలా గోడ నేనే తొందరపడి వాళ్ళ మెల్లాలో కట్టానేమో. ఇవతలికి జరుపుకుంటానని చెప్పేస్తాను. వాడూ, నేనూ చిన్నప్పటినుంచీ ఇరుగుపొరుగున ఉంటున్న వాళ్ళం. ఈ గుద్దులాటలు ఇక కుదరవు. వాడి మంచినేనూ, నాపచ్ఛదనం వాడూ చూచి మెచ్చుకోవడం నేర్చుకుంటే సరిపోయె.

రామా: సెభాష్, సీతాపతీ, వెయ్యేళ్ళు బ్రతుకు. మనమంతా ఒకటే అనే గొప్పబుద్ధితో సుఖంగా జీవితం నడుపు. మనమంతా ఒకటేరా సీతాపతి, ఒక్కటే

(ప్రసారం తేది 13.8 1960)

# మహిషాసురమర్దని

*పాత్రలు:*

| | | |
|---|---|---|
| 1. | సుందరమ్మ | అమ్మమ్మ |
| 2. | అరుణ | మనుమరాలు |
| 3. | దేవి | మహిషాసుర మర్దని |
| 4. | మహిషాసురుడు | దానవుల రాజు |
| 5. | తామ్రుడు | దూత |

సుందరమ్మ: --గంటవాయిస్తూ ధ్యాన శ్లోకాలు చదువుతుంది.--

ఈషత్సహాస మమలం పరిపూర్ణచంద్ర
బింబానుకారి కనకోత్తమ కాంతి కాంతమ్.
అత్యద్భుతం ప్రహృత మాత్తరుషా తథాపి
వక్త్రం విలోక్య సహసా మహిషాసురేణ.

దృష్ట్వాతు దేవి కుపితం భ్రుకుటీ కరాళ
ముద్యచ్ఛశాంక సదృశచ్ఛవి యన్న సద్యః
ప్రాణాన్ముమోచ మహిషస్తదతీవ చిత్రం
కైర్జీవ్యతేహి కుపితాంతక దర్శనేన.

దేవీ ప్రసీద పరమా భవతీ భవాయ
సద్యో వినాశాయసి కోపవతీ కులాని
విజ్ఞాతమేతదధునైవ యదస్తమేత
న్నీతం బలం సువిపులం మహిషాసురస్య.

అరుణ: అమ్మమ్మా.

సుం: ఏం చిట్టితల్లీ

అ: మహిషాసురుడు ఎవరమ్మా.

సుం: వాడా, వాడా తల్లీ వాడొక దున్నపోతు.

అ: అదేమిటమ్మమ్మా దానవుణ్ణి పట్టుకొని దున్నపోతంటావ్.

సుం: అదంతా ఒక గాథలే తల్లీ! వాళ్ల నాయన రంభుడు, మహావీరుడైన కొడుకు కోసం తపస్సు చేశాడు. అగ్నిదేవుడు ప్రత్యక్షమై నీవు మొదటి ఎవర్ని కామిస్తావో అక్కడే నీ కోరిక సఫలమౌతుంది, పొమ్మన్నాడు. రంభుడు ఇంటికి పోతూ, దారిలో ఒక చక్కని బర్రెపడ్డను చూచి మోహించాడు, ఆ

మహిషికి ఈ మహిషాసురుడు పుట్టాడు.

అ: అదా సంగతి. బాగుంది. ఆ దున్నపోతును చంపడానికి దేనే దిగిరావలసి వచ్చిందా. తమాషాగా వుందే!

సుం: వాడు సామాన్యమైన దున్నపోతు కాడమ్మా. ఈ ఏడేడు పధ్నాలుగు లోకాల్లో వుండే మగాళ్ళెవ్వరూ తన్ను జయించరాకుండా బ్రహ్మదేవుఁడి వరం పొందాడు.

అ: అయితే ఆడవాళ్ళను మినహాయింపు చేశాడా. అమ్మమ్మా.

సుం: అవును తల్లీ! ఆడది అబల, నన్నేం చేస్తుందిలే, అని వాడి అహంకారం.

అ: ఈ మగాళ్ళంతా ఇంతేలే, అమ్మమ్మా. మన తాతయ్యే చూడరాదు---

సుం: ఏమన్నారమ్మా తాతయ్య.

అ: వంటా వార్పూ నేర్చుకోక ఈ చదువూ సంధ్యా నీకెందుకే నువ్వేం ఉద్యోగాలు చేస్తావా. వూళ్లేల్తావా. అన్నారమ్మా.

సుం: బాగానే వుంది వరస.

అ: అయితే అమ్మమ్మా. మళ్ళీ ఈ తాతయ్యే పెట్టె తాళం తీసుకోలేక నిన్ను పిలుస్తారెందుకమ్మమ్మా.

సుం: అయ్యో రాత. పెట్టె తాళం దాకా ఎందుకూ, మీ తాతయ్యకు చొక్కా గుండీలు పెట్టుకోవడం చాతౌ? ఈ మగవాళ్ళదంతా వట్టి మేకపోతు గాంభీర్యం లే, అరుణా. మళ్ళీ వీళ్ళకు ఆడది లేకపోతే ఒక్క క్షణం సాగదు.

అ: అంతేలే అమ్మమ్మా. అది సరే కాని వరగర్వంతో

మహిషాసురుడు ఏం చేశాడమ్మమ్మా?

సుం: ముల్లోకాలూ జయించాడు. ముక్కోటి దేవతల్నీ కొండలూ, కోనలూ పట్టించాడు. త్రిమూర్తులు కూడా వాడి ధాటికి తట్టుకోలేక పారిపోయారు తల్లీ.

అ: మరి దేవతలకు ఎవరు గతి అయినారమ్మమ్మా!

సు: చివరకు వాళ్ళకు ఆడదే గతయిందమ్మా. అంతా కలిసి ఆలోచించి ఒక విలక్షణమైన దేవీ మూర్తిని సృష్టించారు. ఆ పద్యం వింటావా అరుణా.

అ: చదువమ్మమ్మా. నువ్వు పద్యం చదివితే వినసొంపుగా వుంటుంది.

సుం: బ్రహ్మ విష్ణు మహేశ్వర త్రిగుణాత్మక
తేజముల్ కలసి మూర్తీభవించి
గోత్రారి మొదలు ముక్కోటి దివ్యుల మహ
స్సులు తత్తదవయవస్ఫూర్తి నొంది
సర్వదైవత దత్త శస్త్రాస్త్ర భూషితా
ష్టాదశ బాహు విస్తారమెనసి
ప్రకృతి పూరుష పరస్పర మహామాయావి
లాస లీలా సముల్లాస మొలసి,

సూర్య చంద్రాగ్ని మయ నేత్ర శోధనముల
సెగలు చలువలు పొగలుగా జగములెల్ల
దు ర్నిరీక్ష్య లావణ్య విధూవీనాంగి
సింహవాహనా రూఢయై చెలగె దేవి.

అ: అప్పుడు దేవతలేం చేశారమ్మమ్మా.

సుం: మహిషాసురుణ్ణి సంహరించి మమ్మల్ని రక్షించు దేవీ అని వేడుకున్నారు.

అ: అందుకు దేవి ఏమన్నది అమ్మమ్మా.

సుం: త్రిమూర్తులు కూడా వాణ్ని సంహరించలేకపోయినారా అని ఆమె అవహేళనగా ఒక అట్టహాసం చేసిందమ్మా. ఇక చూచుకో, అరుణా, ఆనవ్వు--

వలయములై దిగంతముల వ్రాలి, మహీ గగనాంతరస్థలిన్
విలయ కరాళ నాట్య పరివేషములై, జలజోద్భవాండముల్
కలగొని తేలియాడు లయ కంధి తరంగములై, మహా భయా
కులితమదాంధ దానవుల గుండెలు చీల్చెడు మృత్యుదంష్ట్రలై.

ఈ సమస్త విశ్వాన్నీ గజిబిజి చేసిపారేశాయమ్మా.

అరు: ఆ నవ్వులు మహిషాసురుడికి వినిపించలేదా అమ్మమ్మా.

సుం: వినిపించకేం తల్లీ., వాడి మంత్రి తామ్రుడు దేవి వద్దకు వచ్చి ఏమన్నాడంటే--

- - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - -

తామ్రుడు: దేవీ నేను మహిషాసుర మహారాజు మంత్రిని. నన్ను తామ్రుడు అంటారు. మా మహారాజు రాయబారం పంపితే దూతగా నీ వద్దకు వచ్చాను.

దేవి: అసలు నేనిక్కడ వున్నట్లు మీ రాజు కెట్లా తెలిసింది?

తా: నీ అట్టహాసమే చెప్పింది.

దేవి: --నవ్వు-- నా అట్టహాసానికి అదురుకుని పడిపోయిన మీ ప్రభువును మూర్ఛతేర్చి ఇలా వస్తున్నావా నీవు.

తా: అబలల అట్టహాసాలకు భయపడేవాడు కాడు, మా ప్రభువు. అబలవైన నీ అట్టహాసం అయన హృదయాన్ని ప్రణయపూరితం చేసింది.

దేవి: ఆ అలాగా! చాలా దూరం పోయిందే వ్యవహారం. ఇంతకూ నీ రేడు రాయబారం ఏమని పంపాడు?

తా: చెబుతాను, సావధానంగా విను. -నీవు త్రైలోక్య. మోహన సౌందర్య రాశివి. నేనూ మూడు లోకాలు జయించి ముక్కోటి దేవతల్ని పుట్టలూ గుట్టలూ పట్టించిన అనన్య సామాన్య పరాక్రమశాలిని. ఎందుకో నీవంటే నా హృదయం ప్రేమ స్నిగ్ధమైంది. మనకు ఈడూ జోడూ సరిపోయింది. నాకు పట్టమహిషివై నీ యౌవనాన్ని సార్థకం చేసుకో- ఇదీ మా ప్రభువు నీకు పంపిన రాయబారం.

దేవి: వహ వ్వా! నన్ను పట్టమహిషిని చేస్తాడా, ఆ మహిషాసురుడు. మహిష బుద్ధికి ఇంతకంటే ఏం తోస్తుంది?

తా: మా మహారాజు కోరికలో తప్పేముంది? యౌవనం కలకాలం వుంటుందా దేవీ! ఆయన్ను చెట్టబట్టి సర్వసౌఖ్యాలూ ఇప్పుడే అనుభవించు. తర్వాత విచారిస్తే లాభం వుండదు.

దేవి: ఓయీ. ఆ దున్నపోతుకు మంత్రివి గావు నువ్వు? నీకు మాత్రం పశుబుద్ధి లేకుండా ఎలా వుంటుంది. నే నిట్లా అన్నానని నీ రాజుతో చెప్పు. - పాతాళ లోకంలో వుండవలసిన నీవు అక్రమంగా స్వర్గ మర్త్యాలు ఆక్రమించావ్. నరుల్నీ, దేవతల్నీ నానా బాధలూ పెట్టావ్.. లెక్కలేనన్ని హింసా కార్యాలు చేశావు. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకుని నీ వాళ్ళతో పాతాళానికి తిరిగి పోతావా, సుఖంగా బ్రతుకుతావ్. మొండి కేసుకు కూర్చున్నావా, నా చేతిలో నీకు ఆయుస్సు మూడిందనుకో-- అని చెప్పు--

తా: ఏం మాటలివి దేవీ! యుద్ధరంగంలో మా మహారాజు ముందు

నిలబడగలవా, నీవు! చూస్తూ చూస్తూ వచ్చే మహా సౌఖ్యాన్ని ఎందుకు కాలతన్నుకుంటావ్.

దేవి: నోర్ముయ్. ఇక ఆట్టే వాగావా, నీతలకాయ పుచ్చకాయ దొర్లినట్టు దొర్లుతుంది. తక్షణం పో ఇక్కడ్నుంచి!

* * * *

మహిషాసురుడు: తామ్రా ఆసుందరి ఏమన్నది?

తా: ఆవిడ అన్నమాటలకు నాకు చెడ్డ తామసం వచ్చింది, ప్రభూ! మీరు రసభంగం చెయ్యవద్దన్నారు కాబట్టి సరిపోయింది గాని లేకపోతే నా తడాఖా చూపించి వుండేవాణ్ని.

మహి: ఇంతకూ ఏమన్నదావిడ? నన్ను చేపట్టడానికి అంగీకరించిందా?

తా: మహారాజా! దూతలు ప్రభువులకు అప్రియాలు చెప్పకూడదు. అలాగని ప్రియమైన అసత్యాలూ చెప్పకూడదు. ఆవిడ అన్నమాటలు తమ కేమని విన్నవించేది ప్రభూ!

మహి: ఆఁ! అంతదాకా వచ్చిందీ? ఏమా ఆడదాని కండకావరం! దాని అంతు కనుక్కోపోతే నా పేరు మహిషాసురుడు కాడు. ఓయ్ చిక్షురుడా, ఓయోయ్ అసిలోముడా, ఉదర్కా, భాష్కల, బిడాలుల్లారా. త్రినేత్రా, కాలబంధకా, లెండి! మీమీ చతురంగ సైన్యాలను సమాయత్తం చేయండి. మహిషుడిదే, యుద్ధానికి బయలు దేరుతున్నాడు.

(భేరీభాంకారాలు- సైన్య కోలాహలం- జయ జయ ధ్వానాలు)

మహి: మోహినీ, నా రాయబారం తిరస్కరించావనే కోపంతో నీ మీదికి యుద్ధానికి వచ్చాను కానీ నీ అతిలోక సౌందర్యం నన్ను మళ్ళీ ప్రణయముగ్ధుడ్ని చేస్తున్నది. నేను అన్ని విధాలా నీకు తగినవాణ్ని. నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిసాన్తు. ఇప్పటికైనా నా

మాట విను.

ఈ ముల్లోకములేలు దొడ్డ దొరనై యీ నే నొక్క సామాన్యుడన్
రామా, నీ యనురాగనిస్తుల మహారాజ్యమ్ము చేపట్టగా
లేమిన్, నిత్యవినూత్న యౌవన కళా లీలా విలాస ప్రభా
శ్రీమంతమ్ముగ, నన్ను నేలుకొనవే. శృంగార రమ్యాకృతీ.

దేవి: ఇక చాలించు, నీ కవిత్వం. నా ప్రాణనాధుడు వేరే వున్నాడు.

మహి: ఆఁ! నీకు ఇదివరకే పెండ్లయి పోయిందీ! ఎవడే నీభర్త? ఎక్కడున్నాడు వాడు?

దేవి: ఓరీ పశువా. తెలుసుకోగలవాళ్ళకు ఆ పరమ పురుషుడు ఎక్కడబడితే అక్కడే వుంటాడురా. తెలుసుకోలేనివాళ్ళకు ఎక్కడా కనబడడు. ఎదుట నిలిచిన నన్నే పోల్చుకోలేని తుచ్ఛ పశుబుద్ధివి. నా ప్రాణనాధుణ్ని నీవేం పోల్చుకోగలవురా.

మహి: ఏమీ నీ కండకావరం! ముల్లోకాలూ స్వాధీనం చేసుకుని, ముక్కోటి దేవతల్నీ మూడు చెరువుల నీళ్ళు తాగించిన వీరాధివీరుణ్ణి నేను, జాగ్రత్త!

దేవి: దేవతల బాధలు చూడలేక నిన్ను హతమార్చడానికి వచ్చిన నీ పాలిటి మిత్తినిరా, నేను! నా సింహానికి నిన్ను ఆహారంగా ఇస్తా.

మహి: నేను సర్వ మాయాయుద్ధ విశారదుణ్ణి. కామరూపిని. నిన్నూ నీ సింహాన్నీ ఏం చేస్తానో, చూచుకో!

దేవి: ప్రకృతిపురుషుల మహామాయా ప్రవాహంలో పడికొట్టుకుపోయే ఒక గడ్డిపోచవురా. నీవు! నీ మాయ నన్నేం చేస్తుంది. ఇదుగో ఈ సహస్రార చక్రం నీ ప్రాణాల్ని బలిగొనబోతున్నది. కాచుకో!

-- చక్రం విసిరిన చప్పుడు. దున్నపోతు బాధాసూచకమైన అరుపు-
దానవుల హాహాకారాలు----

అరుణ: అమ్మమ్మా. నా కేమో భయం భయంగా వుందమ్మా.

సుం: పిచ్చితల్లీ. భయమెందుకే? పరమవాత్సల్యంతో భక్తుల్ని కాపాడే చల్లని తల్లి సుమా. ఈ శ్రీమహాలక్ష్మి!

అ: మహిషాసురుడు హతమారిపోయిన తర్వాత ఏం జరిగిం దమ్మమ్మా.

సుం: తమ బాధలన్నీ విరగడైపోయాయన్న సంబరంతో దేవతలంతా వచ్చి దేవిని వేనోళ్ళ స్తుతించారు. ఇందాక నేను చదివానే, ఆశ్లోకాలు ఆ స్తోత్రంలోనివేనమ్మా. దేవి వాళ్లందర్నీ ఆశీర్వదించి అంతర్థానమైంది.

అ: అమ్మమ్మా, నాకు ప్రసాదం పెట్టవూ.

సుం: అమ్మ దొంగా. ప్రసాదం కోసమా, ఈ ఎత్తంతా. కొంచం ఆగమ్మా, పూజ అయిపోవచ్చింది. దేవికి జయహారతి ఇచ్చి ప్రసాదం పెడతా.

--- గంటవాయిస్తూ---

జయ, జయ, విశ్వ భూభువన శాసన దక్ష విలోల లోచనీ
జయ, జయ, భక్తలోకశుభ సంగత సౌఖ్య ఫల ప్రదాయినీ.
జయ జయ, సర్వ దైవత విశంకట సంకట శోకనాశనీ,
జయ, మహి షాసురాక్రమణ సత్వరశౌర్యధునీ, జయోస్తుతే.

(ప్రసారం తేదీ: 23-9-60)

---- 0 ----

# ప్రజాపరిషత్తు

*పాత్రలు:*

| | | |
|---|---|---|
| తండ్రి | తల్లి | కొడుకు |
| వేనుడు | సునోధ | భృగమహర్షి |
| దశరధుడు | కౌసల్య | సభాపతి |
| ధృతరాష్టుడు | గాంధారి | శంబువు |

కొడుకు. ఏమిటి నాన్నా. ఈ పుస్తకంలో ఇట్లా రాశాడు?

తండ్రి. ఏం రాశాడురా?

కొ. బ్రిటీష్‌వాళ్ళు వచ్చిం తర్వాతనే మనకు ప్రజాపరిపాలన అంటే ఏమిటో తెలిసిందట.

తం. వాడి మొగం లేరా. వాడికేం తెలుసు?

తల్లి. ఒరేయ్. అంతా మీ నాన్నకే తెలుసురా. ఇంకెవ్వరికీ ఏమీ తెలియదు.

తం. వచ్చావ్. వంటింట్లో నుంచి, వంతపలకడానికి?

తల్లి. అబ్బా, కొడుకుల సంభాషణ రక్తి కట్టద్దూ మరి?

కొ. నాన్నకేమీ తెలియదంటావా, అమ్మా?

తల్లి. ఆ మాట నేనన్నానటరా? మీ నాన్నకు సర్వజ్ఞుడు అనే బిరుదు ప్రసాదించమని ప్రభుత్వానికి అర్జీ పెడదామనుకుంటుంటేనూ?

తండ్రి. ఆ బిరుదు మీనాన్న నాకు ఏనాడో ఇచ్చాడు. లేకపోతే నా కాళ్ళు కడిగి నెత్తిన చల్లుకుని నిన్ను నాకు అంటగట్టేవాడేనా?

తల్లి. ఇక వూరుకోండి. ఎవరన్నా వింటే నవ్విపోతారు.

తండ్రి. నవ్వితే వాళ్ళ పళ్ళే బయటపడతై, మనకేం? చూశావా, భార్యాభర్తల సంభాషణ ఎంత సులభంగా రక్తి కడుతుందో!

తల్లి. చాల్లెండి, మీ సరసాలు. అబ్బాయికదేదో తెలిసేటట్టు వివరంగా చెప్పండి

కొ అయితే నాన్నా, ప్రజా పరిపాలన మనలో ఎప్పటినుంచి వుందంటావ్?

తండ్రి. మన గడ్డ మీద సృష్టి కలిగినప్పటినుంచి వుంది. ప్రజలతో బాటే ప్రజాపరిపాలన కూడా పుట్టింది. మన పురాణాలు శ్రద్ధగా చదివితే ఈ సంగతి తెలుస్తుంది.

తల్లి. పురాణం విప్పారా అంటే ఇక మీనాన్నను పట్టశక్యం కాదురా. నాయనా!

తండ్రి. నువ్వు నన్ను విడవకుండా పట్టే వున్నావుగా. ఇంకా నీ భయమెందుకే?

కొ. మన పురాణాల్లో రాజు విష్ణ్వంశ సంభూతుడని, అతన్ని ప్రజలంతా దేవుడులాగా కొలవాలనీ చెప్పివుందిగా, నాన్నా?

తండ్రి. అవును.

కొ. అయితే ఇక ప్రజాపరిపాలన ఎక్కడిది? అంతా రాజ పరిపాలనేగా?

తండ్రి. మన పురాణాల్లో ఇంకొక సంగతి కూడా చెప్పారు.

తల్లి. ఏమిటండోయ్, అది?

తండ్రి. చీమ, మొదలుకొని బ్రహ్మవరకూ అన్నిటిలోనూ పరమాత్ముడు వున్నా డన్నారు. అంటే ఏమిటో తెలుసా, నరులందరూ నారాయణ స్వరూపులన్నమాట, ప్రజల ఇష్టానిష్టాలను కనిపెట్టి జనరంజకంగా పరిపాలిస్తేనే రాజు రాజవుతాడు.

కొ. లేకపోతే.

తండ్రి. వాడొక తరాజు, ఆది యుగంలో-

తల్లి. ఆదియుగం అంటే ఏమిటండోయ్?

తండ్రి. ఆదియుగమంటే కృతయుగం లేవే! ఆ యుగంలో అంగుడు అనే

రాజుండేవాడు. అతని భార్య సునోధ. అమె మృత్యుదేవుడి కూతురు. వాళ్ళకు వేనుడు అనే కొడుకు పుట్టాడు. వాడు రాజై--

- - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - -

సునోధ. నాయనా, వేనా, ఏమిటీ ఆగడం? నీ దుండగాలు చూడలేక మీనాయన గారు ఎవ్వరికీ చెప్పకుండా ఎటో వెళ్ళిపోయారు. ప్రజలను ఇలా హింసించడం మంచిపనికాదురా.

వేనుడు. నేనేం కాని పని చేశానమ్మా? ఇతర దేవుళ్ళను ఎవ్వరినీ కొలవ వద్దన్నాను. నా ఆజ్ఞమీరిన వాళ్ళను చంపేస్తా నన్నాను.

సునోద. నీ యాజ్ఞయొక్క ఫలితం ఏమిటో చూచావా?

జపములు గాయత్రి సహితంబుగా మానె,
వేదంబు పేరును వినగలేద,
సోమపాన క్రియచొప్పులు రూపఱె,
హుతములు కర వయ్యె హుతవహునకు
సర్వదైవత సమర్చలు కట్టి పెట్టంగ
బడియె, పూర్తంబుల పనులు సమసె,
పరహితంబులు దానపరతలు కడతేరె,
సతత వ్రతోపవాసములు పొలిసె

నెలకు మూడు వర్షముల నియతి పోయి
అవని యంతయు దుర్భిక్షమావరించె
అఖిలధర్మ పరాఙ్ముఖమ్మైన నీదు
చేతకు జనమ్ములెల్ల గాసిలిరి పుత్ర.

ఇది కాని పని కాదటరా?

వేను. ఎందుకవుతుందమ్మా? నేను రాజును. దైవాంశసంభూతుణ్ని! నన్ను మించిన దైవం ప్రజలకు ఎవరున్నారమ్మా?

ను. ప్రజలు మాత్రం నారాయణాంశ కలవాళ్ళు కాదూ? వాళ్ళు చేసిన రాజువేగా నీవు? వాళ్ళకు అనుకూలంగా పరిపాలించవద్దటరా? మీ తండ్రి గుణాలు ఒక్కటైనా పట్టుపడలేదేమిరా, నీకు?

వే. నాకు మా అమ్మనాయన గుణాలు పట్టుబడ్డాయి, అవి నాకు చాలు. ఈ నరపురుగులు నా చెప్పుకింది తేళ్ళు. వీళ్ళను నేలబెట్టి కాలరాస్తాను. నా మార్గానికి అడ్డం రాకు, నీ దారిన నీవు పో !

ను. ఎవరి కర్మకు ఎవరు కర్తలు? పోతున్నారా, తండ్రీ. అంగమహారాజును వెదుక్కుంటూ నా దారిన నేను పోతున్నాను. (వెళ్ళిపోతుంది)

వే. శని విరగడైంది. నాతల్లి అని చెప్పుకోవడానికే నాకు సిగ్గుచేటుగా వుంది. ఈమెకు ఆతండ్రి గుణాలు ఒక్కటైనా అబ్బలేదగదా!

- - - - - - - - - - - - - - - - - - - - -

వే. ఎవరు నీవు? ఎందుకొచ్చావిక్కడికి?

భృగువు. నేను ప్రజా పరిషత్తు పంపిన ప్రతినిధి నన్ను భృగుమహర్షి అంటారు.

వే. ఓరీ, భృగుడా. బారెడు పొడుగున గడ్డం పెంచగానే నీవు మహర్షివై పోయావటరా? ఏమంటున్నారు, మీవాళ్ళు?

భృగు. వేనరాజు పాపం పండిందంటున్నారు.

వే. ఆఁ! మీకందరికీ చావు మూడింది. ఆఖరుసారిగా చెబుతున్నాను

జనులారా, నమునెవ్వరంచు మదిలో చర్చింత్రు, నన్నొక్కరు
డనుశాసింప ప్రభుండె, ధర్మమున కధ్యక్షుండ, వేనొల్లకుం

డిన సర్వోర్వియు ద్రొక్కితోయములతోడి ఒదింతు, ఎదనైన వ్ర త్తు, నశేషాండవు టమ్మగాల్తు, వలదీ దుర్వాక్యముల్ నాదెసన్,

భృగు. ఇక నీతో వాదించి లాభం లేదు. నీకు తగినశాస్తి కావలసిందే.

వే. చేతిలో వున్న ఆ దర్భపోచలతో నీవు నన్నేం చెయ్యగలవురా?

భృగు. మంత్రశక్తి వీటిని మారణాయుధాలుగా మార్చిందిరా. వీటితో నీపని ఆఖరు. కాచుకో !

వే. ఆ. ఆ. అమ్మా, అబ్బా. --- బాధను సూచించే మూలుగు.

- - - - - - - - - - - - - - - - - - - - -

తం. ప్రజాకంటకుడైన వేనుడు ఆ విధంగా హతమారిపోయాడు.

కొ. తర్వాత ప్రజలేం చేశారు, నాన్నా.

తం పృధుచక్రవర్తికి పట్టం కట్టారు. ప్రజారంజకమైన ఆయన చల్లని పరిపాలనలో అంతా సుఖించారు. ఇది కృతయుగంలో జరిగిన సంగతి. కృతయుగం తర్వాత ఏయుగంరా అబ్బాయి?

కొ. మా చదువుల్లో ఈ యుగాలసంగతేమీ వుండదు నాన్నా.

తం. భేష్, మంచి చదువులురా. మీ చదువులు. ఇందాక నన్ను సర్వజ్ఞుడని ఎగతాళి చేసిందిగా, మీ అమ్మనడుగు చెబుతుందేమో?

తల్లి. ఏదో తమాషాకంటే అదేపట్టుకు వూగులాడుతున్నారు గాని, నేనొకటడుగుతా చెప్పండి.

తం. అడుగు తెలిస్తే చెబుతాం.

తల్లి. సవాసేరు వంకాయల కూరలో ఉప్పెంత వెయ్యాలో చెప్పండి?

తం. ఒక చారెడు వేస్తే సరిపోదూ?

కొ. చారెడేం చాలుతుంది నాన్నా? ఒక దోసెడైనా వెయ్యాలేమో.

తల్లి. సెభాష్. తండ్రీకొడుకుల పాకకళావైదుష్యం అద్భుతంగా వుంది. కృతయుగం తర్వాత ఏయుగమో నేను చెబుతానుండండి. కృతయుగం తర్వాత త్రేతాయుగం కదూ?

తం. భలే. ఎట్లాగయితేనేం, సర్వజ్ఞుడి భార్యవనిపించుకున్నావు పో. ఆ త్రేతాయుగంలో అయోధ్య రాజధానిగా పాలించిన ఇక్ష్వాకు వంశంలో దశరథుడని ఒక మహారాజుండేవాడు. ఆయనకు ముగ్గురు భార్యలు.

కొ. కౌసల్య, కైకేయి, సుమిత్ర కదూ నాన్నా?

తం. అవును ఆయనకు రామలక్ష్మణభరత శత్రుఘ్నులని నలుగురు కొడుకులు.

తల్లి. ఈ వరసలో వున్న విశేషమేమిటో చెప్పుకోండి చూతాం?

తం. ఏముంది? రాముడి తర్వాత వయస్సును బట్టి భరతుడు రావాలి కాని లక్ష్మణుడొచ్చాడు.

కొ. ఏమిటో ఇదంతా తికమకగా వుంది నాన్నా! కాస్త విమర్శగా చెపుదురూ.

తం. ఆ పండితురాలినే అడగరా, చెబుతుంది.

తల్లి. ఏంలేదురా. కొడుకులకోసం దశరథ మహారాజు పుత్రకామేష్టి చేశాడు. అప్పుడు ప్రాజాపత్యపురుషుడు ప్రత్యక్షమై ఆయనకు పాయసపు గిన్నె ఇచ్చాడు. ఆ పాయసంలో సగం కౌసల్యకూ, తక్కిన సగం కైకకూ, దశరథుడిచ్చాడు. పాపం సుమిత్రకు పాయసం లేకుండా పోయింది. అప్పుడు కౌసల్య కైకేయీ

ఇద్దరూ తమతమ పాళ్ళలో సగం సగం సుమిత్రకిచ్చారు. కౌసల్యకు రాముడూ, కైకకు భరతుడూ పుట్టారు. సుమిత్రకు, కౌసల్య సగానికి లక్ష్మణుడూ, కైక సగానికి శత్రుఘ్నుడూ పుట్టారు. అందుకే రాముడికీ లక్ష్మణుడికి లంకె. భరతుడికీ శత్రుఘ్నుడికీ లంకె. ఇప్పుడు తెలిసిందా ఆ సమాసంలో వుండే సొగసు?

తం. నీవు రామాయణానికి సరికొత్త వ్యాఖ్యానం రాస్తే పసందుగా వుంటుందే.

-------- ఆ దశరథ మహారాజు ముసలివాడై---------

దశ. కౌసల్యా.

మిక్కిలి భోగములందితి,
నెక్కుడు సంపదలు గంటి , నెల్లగుణములన్
చక్కని కొడుకుల బడసితి ,
నిక్కంభిని పెద్దకాలమేలితి, తన్వీ

ఇక ఈ రాజ్యభారాన్ని నేను మొయ్యలేను.

కౌసల్య. అవును మహారాజా. మనం పెద్దవాళ్ళమైనాం, ఇక మనం వానప్రస్థులమైతేనే బాగుంటుంది.

దశ. మరి ఈ రాజ్యాన్ని ఎవరికి వప్పగించడం?

కౌ. అదేం, మహారాజా, అలా అంటారు? మీ పెద్దకొడుకు శ్రీరామచంద్రుడున్నాడుగా.

ద. నీ పక్షపాతబుద్ధి పోనిచ్చుకున్నావుగాదే, కౌసల్య.

కౌ. పెద్దవాడికి రాజ్యానికి హక్కుందనే ఉద్దేశంతో అన్నానుగాని, నాకు నలుగురు చిరంజీవులూ ఒకటే, మహారాజా.

ద. నీ సంగతి నాకు తెలియదా కౌసల్యా? తమాషాకు అలా

అన్నాను. భరతుడికే రాజ్యం కావాలంటుందేమో, కైకేయి?

కౌ. ఆ సంగతి ఆమెనే అడగండి. ఆమె సంగతి నాకేం తెలుస్తుంది?

ద. మీమీ కుమారులంటే మీకు అపేక్ష వుండడం సహజమే, నాకు నలుగురూ ఒకటే. ఆయినా శక్తి సామర్థ్యాలను బట్టి రాముడే రాజ్యానికి అర్హుడని నాకనిపిస్తుంది. కానీ-

కౌ. కాని ఏమిటి మహారాజా?

ద. ఈ విషయంలో మధ్యవర్తులై నిష్పక్షపాతంగా తీర్పు చెప్పవలసినవాళ్ళు వేరే వున్నారు.

కౌ. ఎవరువారు, మహారాజా?

ద. మన ప్రజలే, లోతుగా ఆలోచిస్తే ఈరాజ్యం వాళ్ళదేగాని మనది కాదు. మనం దీనికి ధర్మకర్తలం మాత్రమే. వాళ్ళ రాజ్యానికి వాళ్ళకిష్టుడైన రాజును ఎన్నుకునే అధికారం వాళ్ళకుంది, ఇక్ష్వాకు వంశస్థుడైన వాడెవ్వడూ ప్రజల ఈ హక్కును కాదనలేడు. కాబట్టి నా అనంతరం అయోధ్యా సింహాసనం ఎవరు ఎక్కాలో ప్రజలే నిర్ణయిస్తారు.

కౌ. అయితే ఇంకా ఆలస్యమెందుకు, మహారాజా? జనవాక్యం ఎలావుందో వెంటనే కనుక్కోండి?

ద. అందుకు ఏర్పాట్లన్నీ అప్పుడే జరిగాయి కౌసల్యా. మన పౌరులూ, జానపదులూ, పరిషత్తులో సమావేశమై ఈ విషయం చర్చిస్తున్నారు - అడుగో ప్రజాపరిషత్తు అధిపతి రానే వచ్చాడు.

సభాపతి. జయం, జయం, మహారాజా !

ద. ఎవరికి జయం సభాపతి?

సభాపతి. శ్రీరామచంద్రుని జననీ జనకులకు, మహారాజా!

ద. ప్రజాపరిషత్తులో ఏమి నిర్ణయించారు, సభాపతీ ?

స. పరిషత్సభ్యులంతా చిరంజీవుల యోగ్యతలన్నీ క్షుణ్ణంగా పరిశీలించి ఏకగ్రీవంగా ఒక నిర్ణయానికి వచ్చారు, మహాప్రభూ.

ద. ఏమిటా నిర్ణయం, సభాపతీ?

స. ధీరోదారుడు నిర్వికారుడు జగద్వీరుండు సౌజన్య వి
స్తారుండుత్తమశీలు డర్కకుల విస్తారుండు శూరుండు గం
భీరుం డిద్ధవిచారసారుడగుటం బెంపార విశ్వ ంభరా
భార ంబెల్ల భరింప నర్హుడు మహాభాగుండు శ్రీరాముడే.

అని తమకు విన్నవించమని నన్ను పంపారు.

ద. శుభం. నా ప్రజల ఔచిత్యానికి నేనెంతో గర్విస్తున్నాను, కౌసల్యా. రేపే శ్రీరామ పట్టాభిషేకం. ఈ శుభవార్త చిరంజీవికి చెప్పు.

కొడుకు. ఇంతకూ ఆ శ్రీరాముడి పట్టాభిషేకం అనుకున్న ప్రకారం జరగలేదుకదా?

తల్లి. అందుకు కైకమ్మ అడ్డు వచ్చిందిరా.

కొ. అయితే జనవాక్యం ఏమైనట్లు? వృధా అయినట్లేగా?

తం. దశరథుడు రాముడి పట్టాభిషేకాన్ని ఆపుజేస్తే జనవాక్యం వృధా అయినట్లే అనుకోవాలి. కాని అలా జరగలేదు.

కొ మరి ఏం జరిగింది, నాన్నా?

తం. పూర్వం తనకిస్తానన్న వరాలను కైక ఇప్పుడు కోరింది. ఆ దుఃఖంలో దశరథుడు కొయ్యబారి పోయాడు, ఇక ఆయన

నోటివెంట మాటేలేదు. ఆడవాళ్ళ అఘాయిత్యానికి అంతూ పొంతూ వుండదురా.

తల్లి. మన బంగారం మంచిదైతే కంసాలి ఏం చెయ్యగలడు? ఆడదాని మురిపానికి దాసుడై అడిగిందే చాలని ముందాలోచన లేకుండా వరాలు ఇవ్వడం, దశరధుడిదే తప్పు. కైకమ్మ తనకిచ్చిన వరాలనే ఇప్పుడు వుపయోగించుకుంది. రాముణ్ని అరణ్యవాసం పంపి, భరతుడికి పట్టం కట్టమని అడిగింది. ఇందులో తప్పేముంది?

తం. ఆ తప్పులూ ఒప్పులూ భగవంతుడికే తెలియాలి. మొత్తానికి ఇందువల్ల లోకానికి మంచి ఉపకారమే జరిగింది.

కొ. ప్రజలు తన్ను రాజుగా వరించిన సంగతి రాముడికి తెలియదా నాన్నా?

తం. ఎందుకు తెలియదురా? తల్లి చెప్పిందిగా! దశరధుడెంతకూ రాకపోయేటప్పటికి కైక యింటికి రాముడే వెళ్ళాడు. అక్కడ తండ్రి మూర్ఛపోయిఉన్నాడు. పినతల్లి తన వరాల విషయం రాముడికి చెప్పింది. తండ్రి మాట నిలపడానికి రాముడే స్వయంగా అరణ్యవాసానికి పోతానన్నాడు. పితృవాక్య పరిపాలనముందు అతడికి జనవాక్య పరిపాలన బలమైందిగా తోచలేదు.

తల్లి. ఇంతకూ జనవాక్యానికెవ్వరూ కావాలని అడ్డుపడలేదంటారు, అంతేగదూ?

తం. అక్షరాలా అంతే.

కొ. బాగుంది. ఇకతర్వాత యుగం ః నాన్నా.

తం. త్రేతాయుగం తర్వాత ద్వాప అయుగంలోనే భరతవంశస్థులైన కౌరవులూ, పాండవులూ వున్నారు. వాళ్ళు

రాజ్యం కోసం పోట్లాడుకున్నారు.

కొ. అదే కదూ, కురుక్షేత్రయుద్ధం?

తం. అవును, మనవాడు భారతం కొంచెం చూచినట్లున్నాడే.

తల్లి. కొడుక్కు అబ్బ చాలు వచ్చింది లెండి, మీకు భారతమంటే తగని యిష్టంగా.

తం. భారతమంటే ఇష్టంలేనివాడు భారతీయుడెలా అవుతాడే. ఆ యుద్ధంలో కౌరవులంతా దుంపనాశనమై పోయారు. ధృతరాష్ట్రుడి కొడుకుల్లో ఒక్కడూ మిగల్లేదు. పాపం, ఆ గుడ్డిరాజూ, ఆయనభార్య గాంధారీ, నిరాధారులై నిలబడ్డారు.

కొ. అ కష్టదశలో వాళ్ళను ఎవరు ఆదుకున్నారు నాన్నా?

తం. ధర్మరాజు వాళ్ళను ఎంతో ప్రేమతో చూచేవాడు. మీరంతా ప్రేమతో భక్తితో ధృతరాష్ట్రుడు చెప్పినట్లు చెయ్యాలి. ఆయన్ను మీరు కొలిస్తే నాకు ఆనందం. ఆయన్ను కష్టపెడితే నాకు ఎక్కడలేని దుఃఖం వస్తుంది. అని తమ్ముళ్ళకూ మంత్రులకూ సేవకులకూ అందరికీ ఖచ్చితంగా చెప్పేశాడు.

తల్లి. ధర్మరాజు ఎట్లాగైనా ధర్మరాజే.

తం. కాని గాంధారీ ధృతరాష్ట్రులకు ఒక్క లోటుమాత్రం వుండిపోయింది.

కొ. ఏమిటది నాన్నా?

తం. ధృతరాష్ట్రుడికీ, భీముడికీ క్షణం పడేదికాదు. భీముడు దగ్గరవున్నప్పుడు ధృతరాష్ట్రుడు కొడుకుల్ని తలుచుకుని ఏడ్చేవాడు. ఆయన కొడుకులు తమ్ము పెట్టినపాట్లు తలుచుకుని భీముడికి కోపం వచ్చేది.

కొ. అప్పుడు మన భీమన్న ఏం చేసేవాడో?

తం. ఏం చెయ్యడానికీ అన్న ఆజ్ఞ అడ్డువచ్చేది. కాని ధృతరాష్ట్రుడు ఒక్కడూ ఉన్నప్పుడు, గాంధారి కూడా వింటూ వుండగా, ఆయన్ను సూటీపోటి మాటలతో పొడుస్తూ వుండేవాడు.

కొ. ఏమనేవాడు నాన్నా, భీముడు?

తల్లి. నేను చెబుతా వినరా.

అంధుని కొడుకులయందు ఒక్కరుని తప్పిపోనీక త్రుంచితి, భూరిశక్తి దర్పితంబైన, మధ్బాహుపంజరము సొచ్చిన రిపురాజ్య సింహములకు వెడలంగవచ్చునే? వెంగులులైవారు కయ్యంబు సేసిరిగాక నన్ను ఎరిగిన తొడరుదురెట్టులు? దుర్యోధనాదుల తెగలార్చినట్టి,

నాదు దోర్దండముల , చందనంబలంది,
కుసుమ దామముల్ చుట్టి, వెక్కులు విభూషమ్ముల
నలంకరించియును, నిత్యము కొలుతు,
దైవమిట్లు నాకు ఉరకారదక్షమగునె, అనేవాడురా.

కొడుకు. మీరెన్నైనా చెప్పండి భీమన్న భీమన్నే.

తం. అతడి కండకావరం అతడిచేత అట్లా చేయించిందిలే. ఈ విధంగా పదిహేను సంవత్సరాలు గడిచాయి. అప్పుడు ధృతరాష్ట్రుడికి వనవాసం పోయి తపస్సు చేసుకోవాలని బుద్ధి పుట్టింది.

కొ. ధర్మరాజు అందుకు ఒప్పుకున్నాడూ?

తం. ఒక రాగాన ఒప్పుకోలేదు. నాయనా, రాజవంశంలో పుట్టినవాడు యుద్ధంలోనైనా మరణించాలి, లేకపోతే తపస్సు చేస్తూనైనా మరణించాలి. మనకులంలో ముఖ్యులంతా ఇలాగే చేశారు.

నన్ను అడవికి సాగనంపు - అన్నాడు.

కల్లి. అందుకు ధర్మరాజేమన్నాడు?

కం. మీరు అడవికి పోవాలని పట్టుబడితే నేనుకూడా మీతోవస్తానన్నాడు.

కొ. గట్టిచిక్కే వచ్చి పడ్డదే.

తం. చివరకు వేదవ్యాసుడు వచ్చి ధర్మరాజుకు నచ్చజెప్పి ధృతరాష్ట్రుడు అరణ్యానికి పోవడానికి అతడు ఒప్పుకునేటట్లు చేశాడు.

త. ఇంకేం. వెంటనే వనవాసానికి బయలుదేరారన్నమాట.

తం. అప్పుడేనా? వనవాసం పోవడానికి ప్రజలు అనుమతికూడా కావాలిగా?

కొ. ఏమిటీ? రాజు తపస్సుకు పోవడానికి కూడా ప్రజల ఒప్పుదలకావాలా? ఇది విచిత్రంగా వుందే.

తం. మరి ఆకాలంలో ప్రజాబలమంటే ఏమనుకున్నావురా?

గాంధారి. దేవా. మనం వనానికెప్పుడు వెళ్ళేది?

ధృత. గాంధారీ. మానాయన వేదవ్యాసులు అనుమతించారు. ఆయన ప్రోద్బలం వల్ల ధర్మరాజుకూడా ఒప్పుకున్నాడు. ఇక మిగిలిందెల్లా మనప్రజల సమ్మతే.

గాం. దానికింకా ఆలస్యమెందుకు?

ధృ. ఆలస్యమేమి లేదు, మన వాకిటి ముందే ప్రజాపరిషత్తును

సమావేశం చేయించమని ధర్మరాజుతో చెప్పాను. ఈ పాటికి అంతా వచ్చేఉంటారు.

శంబువు. (వస్తాడు) మహారాజా, నన్ను శంబువు అంటారు. మీతో మాట్లాడడానికి ప్రజలంతా వాళ్ళ తరఫున నన్ను నియమించారు. ప్రజాపరిషత్తు ఇదుగో ఇక్కడే సమావేశమై ఉంది. మీరు చెప్పదలుచుకున్న దేదో కాస్త ముందుకువచ్చి సెలవియ్యండి. వాళ్ళకు వినబడుతుంది.

ధృ. నా ప్రజలను నేను కన్నులారా చూచుకునే ప్రాప్తి ఈ జన్మానికి లేకుండా పోయింది. మహాజనులారా.

కౌరవకోటియు మీరు పెద్దయు కాల
మనగి పెనంగి యన్యోన్య సంభృ
తా ధికస్నేహులరై ప్రవర్తించితి,
రనఘవర్తనులార, వినుడు నాదు
పలుకు, వృద్ధునకు తపశ్చరణంబున
కై వనంబునకేగు టర్హకర్మ
ముచి తకృత్యంబుల యోజమీ యెరిగిన
యదియకా, మదిముదమార మీర

తెల్ల నాకనుజ్ఞ యిచ్చి పతివ్రతా
తిలకమైన యీ సతీమతల్లి
తోడునీడ యగుచు తోచి వెన్నంటిరా
అడవి కంపి పుచ్చుడయ్యా, నన్ను.

శం. (గద్గదికతతో) ఆపండి, మహారాజా, ఆపండి. మీ మాటలు హృదయవిదారకంగా ఉన్నై. వాటిని వినలేక ప్రజలంతా గుడ్ల నీళ్ళు కుక్కుకుంటూ ఎలుగు రాలుపడిపోయేటట్లు ఏడుస్తున్నారు.

ధృ. తండ్రులారా, ఒక్కమాట! కొడుకులందరినీ పోగొట్టుకుని ముసలితనంలో నిరాధారంగా నిలబడ్డ ఈ గాంధారిని చూడండి.

ఆమెను చూచైనా మాకు అడవికి పోవడానికి అనుజ్ఞ ఇవ్వండి. ఏం మాట్లాడరు? నాకుమారుడైన దుర్యోధనుడి మూలాన మీకు ఎన్నో ఇక్కట్లు కలిగి ఉండవచ్చు, కాని----

అరయ నెన్నం డైనను
మీరలు నా కెగ్గుగాగ మెలగుటలే,దో
పౌరపరులార, నన్నుం
గారవమున ననుపరయ్య, కాననమునకున్.

శం. రాజోత్తమా, ఈ మీ మాటలతో జనులంతా తమ దుఃఖాన్ని దిగ మ్రింగారు.

భరతవంశోత్తమ. పౌరజనంబులు
తమ మాటలుగ భగవత్సన్నిధాన
మున నన్నుపన్యాస మొనరింప పంచినయట్టి భా
షణము లేకాగ్రబుద్ధి
నవధరింపుడు, మీ మహాన్వయంబున
మహీవిభులయందొప్పమి వెదకినైయెన
కానము, మము మీరు కన్నట్టి ప్ర
జలనెట్టట్ల రక్షించితి తాదరమున,

వినుము దుర్యోధనుండు చేసిన యనర్థ
మొక్కటియులేదు, నిను త్రిలోకోత్తరుండు
సత్యవతి కొడుకేమని సమ్మతించి
వంచె దానిన చేయుము పరమనియతి.

అదలడిబడగా మమ్మును
విడిచితి, గురువైన శోకవేదనయే మిం
కుడుపుకొనునప్పటికి తో
డ్పడు నీదగు సద్గుణములు బంధులు వోలెన్.

ధాత్రి, శంతనుడు, విచిత్ర వీర్యుడు, పాండు
రాజు, నెట్టులట్ల రాజరాజు
ప్రజకు సంతసముగ పాలించె, నీయందు
నతనియందు గలదె, అధిప, యెగ్గు.

ధృ. దేవీ, గాంధారీ, విన్నావా? ప్రజల అనుమతి లభించింది, మనం కృతార్థులమైనాం.

గాం. ఇక వనవాసానికి బయలుదేరుదాం. పదండి.

తం. ఆయుగాల్లో ప్రజా పరిషత్తులంత శక్తిమంతంగా ఉండేవి, తెలిసిందా?

తల్లి. కలియుగమేం తక్కువ తిన్నదనుకున్నావా? ఈ యుగంలోకూడా ప్రజాపరిషత్తులు సక్రమంగా పని చేస్తుండేవి. కొన్ని కొన్ని రాజ్యాలలో అయితే రాజులనేవాళ్ళు లేకుండా ప్రజలే తమ నాయకుల ద్వారా పరిపాలన చేసేవాళ్ళు.

కొ. ఆ రాజ్యాలేమో కొన్ని చెప్పు, నాన్నా?

తం. చిన్నప్పుడెప్పుడో చదువుకున్న దేశచరిత్ర ఇంకా జ్ఞాపక ముంటుందటరా? ఆఁ. స్మృతికి తగిలింది. లిచ్ఛవీరాజ్యమని ఒకటుండేది. ఇంకా అలాంటివి చాలా వుండేవిలే. ఆలిచ్ఛవు లున్నారే వాళ్ళు రాజులేకుండా తామే పరిపాలన చేసేవాళ్ళు. అలాటి రాజ్యాలను ఏమనేవాళ్ళోతెలుసా?

కొ. మాకిప్పుడు సాంఘిక శాస్త్రం చెబుతారు గాని, దేశచరిత్ర ప్రత్యేకంగా చెప్పరు నాన్నా.

తం. మీ చదువు తగలడ్డట్టే వుంది. దేశచరిత్ర చెప్పని చదువెందుకురా? వాటిని గణరాజ్యాలనే వాళ్ళు.

తల్లి. ఈనాటి చదువులమీద మీ మహోపన్యాసం వినసొంపుగా వుంది గాని, తర్వాత ఏం జరిగిందో చెబుదురూ!

తం. తర్వాత దేశానికి ఒక అరిష్టం దాపురించింది.

కొ. ఏమిటా అరిష్టం, నాన్నా?

తం. రామరామ మనదేశానికి విదేశీయులతాకిడి ఎక్కువైంది. అనేక జాతులవాళ్ళు లెక్కలేనన్నిసార్లు మనదేశంమీద దండయాత్రలు సాగిస్తూ వచ్చారు. ఈ గందరగోళంలో నిరంకుశ పరిలాలన పైకి వచ్చి ప్రజాపరిషత్తులు అడుగున పడిపోయాయి.

తల్లి. పరిపాలకుల, చేతిలో ప్రజలు కీలుబొమ్మలయిపోయారన్నమాట.

తం. అంతే. కాని దేశానికి ఎన్ని ఒడిదొడుకులు వచ్చినా మనగ్రామాల్లో మాత్రం గ్రామపంచాయతీలు నిలకడగా ఉండేవి. బ్రిటీష్‌వాడు వచ్చిం తర్వాత అవికూడా నీరసించిపోయాయి.

తల్లి. ఇప్పుడు మనకు స్వరాజ్యం వచ్చింది కదా, వీటి పునరుద్ధరణకు మనవాళ్ళు పూనుకోలేదా?

తం. పూనుకోకేం? గ్రామరాజ్యమే స్వరాజ్యానికి గట్టిపునాది అని మన నాయకులేనాడో గుర్తించారు. గ్రామరాజ్యాన్ని శక్తిమంతంగా నెలకొల్పడానికి దేశవ్యాప్తంగా ప్రజల ప్రయత్నాలు జరుగుతున్నై. ఈ విషయంలో మనరాష్ట్రం ముందంజవేసినందుకు మనమంతా గర్వపడాలి. మనరాష్ట్రంలో ప్రజాపరిషత్తులు నెలకొల్పి వచ్చే నవంబరు ఒకటో తేదీకి సరిగ్గా సంవత్సరమవుతుంది.

కొ. గ్రామ రాజ్యాన్ని గురించి కూడా వివరంగా చెప్పు నాన్నా?

తం. ఇవ్వాళ ఇక చెప్పలేనురా. రేపు చెపుతాలే. ఆకలౌతుంది.

తల్లి. ఒరేయ్. మీనాన్నకు ఏపాటుతప్పినా, వేళకు సాపాటుమాత్రం

తప్పడానికి వీల్లేదురా. లేవండి వడ్డిస్తాను.

తం. రోజూ పెట్టే పచ్చడి మెతుకులేనా ఇవ్వాళ కూడా?

తల్లి. ఇవి పండగ రోజులని నాకు తెలియదటండీ? ఇవ్వాళ మీకు ఇష్టమైన మినపగారెలు చేశాను. రేపొక పిండివంటా, ఎల్లుండి ఒక పిండివంటా.

తం. అసలు ఉన్న పండగంతా అవతలెల్లుండేనే.

తల్లి. ఆనాడు తీపి తినిపిస్తాలెండి. ఇక లేవండి భోజనానికి. పాపం చాలా అలసిపోయారు.

(ప్రసారం తేది. 29.10.60)

----- 0 -----

# కుటుంబ గౌరవం

పాత్రలు :

1. సుబ్బారాయుడు - తండ్రి.
2. సుందరి - తల్లి
3. కృష్ణమూర్తి-కొడుకు-దుష్యంతుడు.
4. రాజ్యలక్ష్మి-కృష్ణమూర్తిప్రేయసి-శకుంతల
5. పరంధామయ్య - సుబ్బారాయుడి మిత్రుడు.
భాషాశాస్త్ర పరిశోధకుడు

సుబ్బారాయుడు : సుందరీ. ఓ సుందరీ. సుందరీ. ఎన్నిసార్లు పిలిచినా పలకవేమే?

సుందరి : (లోపలినుంచి) ఉండండి. వస్తున్నా. మీకు ఒకటే తొందర. పొయ్యి వూరికే పోతోంది.

సుబ్బా : ఊరికే పోవడానికి దానికెన్ని గుండెలు. అమ్మగారికి కావలసినవన్ని అమర్చిపెట్టే పోతుందిలే. ఒకసారి ఇలా వచ్చి పో!

సుం : (వచ్చి) వేళగాని వేళలో ఏమిటో ఆ రాచకార్యం! త్వరగా చెప్పండి పోవాలి.

సుబ్బా : మన పెళ్ళయి ఎన్నాళ్లైందే ?

సుం: బాగానే ఉంది. పనిలేని మంగలి ఏదో చేశాడని ఇందుకే అన్నది. పని లేకుండా ఊరికే తీరిగ్గా కూర్చుంటే ఏమి తోచడం లేదా? ఇప్పు డెందుకీ ప్రశ్న?

సుబ్బా: పనుండే అడుగుతున్నాలే చెప్పు.
సుం: వచ్చే పౌర్ణానికి సరిగ్గా పాతికేళ్ళు. రజతోత్సవం చేసుకోవాలనా మీ ఉద్దేశ్యం?

సుబ్బా: దానికే ం భాగ్యం. మన బాంకు బ్యాలెన్సు వేలల్లో ఉంది. రాజు తలచుకుంటే దెబ్బలకు కొదవేముంటుంది. అది సరే గాని, మన పెళ్ళి నాటికి నీకెన్నేళ్ళు! నా కెన్నేళ్ళు ?

సుం: ఏం, ముసలివాళ్ళమై పోతున్నామని బెంగపట్టుకుందా? రాజావారికి? మీకు ఇరవై ఒకటి, నాకు పందొమ్మిది.

సుబ్బా: భేష్. జరిగిపోయిన సంగతులు తిథులవారిగా లెక్కవేసి, తు.చ.తప్పకుండా చెప్పడంలో మీ ఆడవాళ్ళదే నేర్పు.

సుం: మేము జరిగిపోయిన వాటిని నెమరుకు తెచ్చుకుని తృప్తిపడుతుంటాం. మీరు రాబోయే వాటిని ఊహించుకుంటూ పగటి కలలు కంటుంటారు. అంతే మీకూ మాకు భేదం.

సుబ్బా: బాగా చెప్పావ్. అయితే మన వంశోద్ధారకుడికి ఇప్పుడు వయసెంతంటావ్?

సుం: అయ్యో రామ. కన్న కొడుకు వయస్సు కూడా జ్ఞాపకం లేనంత మతిమరుపైతే ఎట్లాగండీ?

సుబ్బా: కొడుకు మాటెత్తితే చాలు, కోటప్పకొండ ప్రభకు మల్లె ఊగిపోతావుగా. నీవు చెబితే విని సంతోషిద్దామనీ!

సుం: మొన్న బహుళ దశమికే కదటండీ మనబాబుకి ఇరవై వెళ్ళి ఇరవై ఒకటోయేడు ప్రవేశించిందీ?

సుబ్బా: ఓటింగ్ హక్కు రాబోతున్నదన్నమాట. బాగుంది. వీడు ప్రయోజకుడై మనల్ని ఉద్ధరించేదెప్పుడే?

సుం: వాడికేమండీ. బంగారు కొండ. ఎమ్మే ఫస్టుక్లాసులో ప్యాసయాడు. మన పరంధామయ్యగారి దగ్గరేగా రిసెర్చి చేస్తున్నాడు. రేపో మాపో డాక్టరేటు కూడా వస్తుందాయె.

సుబ్బా: ఆ వస్తుందిలే మహా డాక్టరేటు. వీడు సంపాదించి పెట్టడం లేదనే గా నాకిపుడు చింత.

సుం: వాడంటే ఎందుకండీ మీ కింత కోపం? వాణ్ని సరిగా

పలకరించనైనా పలకరించరు.

సుబ్బా : ఓసి, పిచ్చిదానా, ఇన్నేళ్ళు నాతో కాపరం చేసి ఇదా నీవు గ్రహించింది. వాడంటే నాకెంతప్రేమో నా హృదయాన్నడుగు చెబుతుంది. కొడుకుని వాడి యెదుటే మెచ్చుకుంటే వాడికి ఆయుక్షీణం కాదటే? ఇటువంటి పిచ్చి పిచ్చి అనుమానాలను దగ్గరికి రానివ్వకు.

సుం: మాటవరసకన్నా గాని మీ సంగతి నాకు తెలియదటండీ. ఇప్పుడు వాణ్ని గురించి మీ బెంగేమిటి?

సుబ్బా : వీడు పెళ్ళెప్పుడు చేసుకుంటాడే?

సుం: లోకంలో తలిదండ్రులు కూతుళ్ళ పెళ్ళిళ్ళు కాలేదే అని ఆరాటపడతారు. మీదంతా విడ్డూరమేనండీ. వాడికిప్పుడేం తొందరొచ్చింది అంట?

సుబ్బా: అదికాదే వాడొక్కగానొక్కడు. వాడు పెండ్లి చేసుకుని వంశం నిలబెట్టాలని తండ్రి అయిన వాడి కుండదూ? ఉన్న ఒక్కడూ పెళ్ళి చేసుకోకుండా సంసారం పట్టించుకోకుండా ఉంటే మన కుటుంబగౌరవం ఏం నిలబడుతుంది? పైగా బెండకాయ ముదీరినా బ్రహ్మచారి ముదిరినా- - - -

సుం. కళ్యాణమొచ్చినా కక్కొచ్చినా అగుతుందటండీ? వాడికేం మొగ మహారాజు. ఆవేళ, రావాలే గాని, మా పిల్లనిస్తామంటే మా పిల్లనిస్తామని లక్ష మంది రారటండీ? అయినా ఈకాలపు పిల్లలు వాళ్ళ పెళ్ళిళ్ళ వ్యవహారం తల్లితండ్రుల దాకా రానిస్తున్నారటండీ? యేమిటి? వాళ్ళ భార్యల్ని వాళ్ళే వెతుక్కుంటున్నారు.

సుబ్బా: మనవాడు కూడా అలాంటి పనేమన్నా చేశాడా యేం,

కొంపతీసి?

సుం: ఇందులో కొంప తియ్యటం ఏముంది లెండి. నాకొక అనుమానం ఉందండి. అది అనుమానం మాత్రమే సుమండీ.

సుబ్బా: అనాడు వాళ్ళ కాలేజీ ఉత్సవంలో మన అబ్బాయి దుష్యంతుడి పాత్రా ఒకమ్మాయి శకుంతల పాత్రా వేసి నాటకమాడారు. మనం కూడా వెళ్ళి చూశాం జ్ఞాపకముందీ?

సుబ్బా: అవును.

---- ఫ్లాష్ బాక్---

దుష్యంతుడు: నేను దుష్యంత మహారాజును. వేటమార్గం బయలుదేరి కణ్వమహామునీంద్రులకు నమస్కరించి పోదామని ఇటు వచ్చాను. వారెక్కడికి వెళ్ళారు?

శకుంతల: అనంత విలాస సంపదలో జయంతుడివలె వున్న మిమ్మల్ని చూడగానే దుష్యంతమహారాజులని గుర్తించాను. ఇదుగో ఆసనం. ఇదుగో అర్ఘ్యం. ఇదుగో పాద్యం. మీకు కుశలమే కదా. మహారాజా? కణ్వమహర్షులు ఇప్పుడే పండ్లకోసం అడవికి వెళ్ళారు. మీరు వచ్చిన సంగతి తెలిస్తే వెంటనే వచ్చేస్తారు. వారు వచ్చేదాకా ఒక ముహూర్తం ఇక్కడ విశ్రమించండి.

దు: నీ వినయానికీ, నీ మెత్తటి తియ్యటి మాటలకూ ఎంతో సంతోషంగా వుంది. జవ్వనీ. సర్వలక్షణ లక్షితములైన సకలావయువ సంపదతో మన్మథ రాజ్యలక్ష్మి వలె నున్న నిన్ను చూచి నా హృదయం సంచలించి పోయింది. నీవు ఎవరి కుమార్తెవు?

శ: నా దీన గాథ చాలావుంది, మహారాజా. ముక్తసరిగా

మూడుమాటల్లో చెబుతాను. నేను మేనకా విశ్వామిత్రులకు జన్మించాను. పుట్టగానే మా తల్లి నన్ను నిర్దయగా మాలినీ నది ఇసక దిబ్బ మీద పెట్టి దేవలోకానికి వెళ్ళిపోయింది. తండ్రి తపోవనానికి వెళ్ళిపోయారు. దిక్కులేని నన్ను క్రూరమృగాల పాలు కాకుండా శకుంతములు తమ రెక్కలతో కప్పి రక్షించాయి. అక్కడికి ఏదో పనిమీద వచ్చిన పరమ కరుణామూర్తులు కణ్వమహర్షులు నన్నిక్కడికి ఎత్తుకుని వచ్చి పెంచి పెద్ద చేశారు. శకుంతముల చేత రక్షింపబడ్డాను. కాబట్టి నాకు శకుంతల అను పేరు వచ్చింది.

దు: ఎంత చక్కని కథ! ఎంత చక్కని పేరు! లావణ్యవతీ! నిన్ను చూచిన క్షణంనుంచి నీయందు నేను బద్ధానురాగుడనైనాను. నీ మనస్సెలావుందో మరి?

శ: (సిగ్గుతో) నాకూ అలాగే వుంది మహారాజా!

దు: నీనోటి వెంట ఎంత మధురమైన మాట విన్నాను! కామినీ! నా జన్మ తరించింది. నాకు భార్యవై చంద్రకాంతమణి సౌధాలలో సమసి, రాజభోగాలూ అనుభవించవచ్చు.

శ: నాకంత పుణ్యమా, ప్రభూ.

దు: పుణ్యాల రాణివి! ప్రథమదర్శనంలోనే మన మనస్సులు ఒకటైనవి గదా. ఇక మిగిలింది పాణిగ్రహణమే. దానికింకా ఆలస్యమెందుకు? క్షత్రియులకు గాంధర్వవివాహం చాలా ప్రశస్తమైంది.

శకుం: (సిగ్గుతో) అంత తొందరెందుకు, ప్రభూ? నా జనకులు కణ్వమహర్షులు కరుణానిరతులు. ధర్మస్వరూపులు, వారు వచ్చే వేళయింది. వారు నన్ను మీకు ఇవ్వాలిగా మరి? అప్పుడు నా

పాణిగ్రహణం చేదురు గాని.

దు: ఓసి పిచ్చిపిల్లా! మునిపల్లెలో వున్నదానికి నీకు గాంధర్వ వివాహం సంగతి ఏం తెలుస్తుంది? ఈ వివాహంలో ఇతరుల ప్రమేయం ఏమీ లేదు. తనకు తానే చుట్టం. తనకు తనే గతి. తన నిచ్చే కర్త తానే. ఇదీ గాంధర్వ వివాహ స్వరూపం. ఇప్పుడేమంటావ్. శకుంతలా?

శ: అయితే మీ యిష్ట ప్రకారమే కానివ్వండి. ప్రభూ.

దు: ఇదుగో నా దక్షిణహస్తం. కుసుమ కోమలమైన నీ దక్షిణహస్తం ఇటు చాచి నా చేతిలో ఉంచు. ఆఁ. ఇప్పుడు మన పాణిగ్రహణం చూచి పంచభూతములాదిగా గల మహాపదార్థాలు సంతోషించి ఆశీస్సులు కురిపిస్తున్నాయి. ఈ క్షణంనుంచి మనం భార్యాభర్తలం , మన సంబంధం జన్మజన్మాలా విడతీయరానిది ప్రేయసీ!

- - - - - - - - - - - - - - - - - - - -

సుం: ఆనాటి నాటకం జ్ఞాపకం వుందా అండి.

సుబ్బా: అవునవును. ఆనాడు మన అబ్బాయి దుష్యంత పాత్ర అపూర్వంగా వుంది. ఆ అమ్మాయెవరో గాని మన్మధమొలకలా వుంది. చాలా చక్కగా నటించింది.

సుం: ఇంకా నెమ్మదిగా అంటారేమిటండీ, ఆరోజు ప్రేక్షకులంతా పరవశులైపోతేను? ఈడు జోడూ కుదిరిపోయిందనీ, రతీమన్మధుల్లా వున్నారనీ అంతా అనుకుంటే.

సుబ్బా: అయితే మనవాడు ఆ అమ్మాయిని ప్రేమించాడంటావ్.

సుం : అది నా అనుమానం మాత్రమే సుమండీ. అయినా తండ్రి చాలు ఎక్కడికి పోతుంది లెండి.

సుబ్బా: ఓస్. ఇప్పుడు ఏం మాట్లాడినా చెల్లి పోతుందనా, నీ వుద్దేశ్యం. అప్పుడు ఎవరికోసం ఎవరు అలమటించి పోయింది, ఆ పరంధాముడికి తెలుసు.

సుం: ఆ పరంధామయ్యగారికి తెలియందేముంది? ఆయన మీకు ఆబాల్యస్నేహితుడు, మీ అబ్బాయికి గురువు.

సుబ్బా: నేను భగవంతుణ్ణి ప్రస్తావిస్తే, నీవు మన పరంధాముడికి అన్వయించావే. వాడిలాంటి స్నేహితులు దొరకడం చాలా దుర్లభం సుందరీ. వాడే సమయానికి ఆనాడు సహాయం రాకపోతే మన జీవితాలు ఏమై ఉండేవో అనుకుంటాను. అయితే వాడికి మన అబ్బాయి వ్యవహారంలో కూడా ప్రమేయం వుందీ?

సుం: ఏమో, ఆ సంగతి నా కెలా తెలుస్తుంది?

సుబ్బా: అది సరే గాని, ఆ అమ్మాయి కులగోత్రాల సంగతేమిటి? ఏమన్నా కనుక్కున్నావా?

సుం: బాగానే వుంది. ఆలూ లేదు చూలూ లేదు కొడుకు పేరు సోమలింగం అన్నట్లుగా ఉంది మీ ధోరణి. ఇది నా అనుమానం మాత్రమేనని ఇప్పటికి రెండుసార్లు చెప్పాను. ఇది మూడోసారి -- అయినా మీ వెర్రిగాని ఈ ఇరవయ్యో శతాబ్దం ఉత్తరార్ధభాగంలో ఇంకా కులగోత్రాలేమిటండీ?

సుబ్బా: అనాదినుండీ ఉన్నవి ఇవ్వాళ మనం పొమ్మంటే పోతాయటే?

సుం: ఏమో ఆ సంగతి నాకేం తెలుస్తుంది? తెలిసినవాళ్ళు మాత్రం

ఇవి పోవాలనే అంటున్నారు.

సుబ్బా: ఎందుకంట?

సుం: ఎందుకో నాకేం తెలుసండీ? ఇవి జాతీయ భావానికి వేరుపురుగులై దేశ ఐకమత్యాన్ని దేశ గౌరవాన్నీ మంటగలుపుతున్నాయట.

సుబ్బా: అయితే మరి కుటుంబగౌరవం మాటేమిటి? ఈ కులాలూ గోత్రాలూ పోయిన నాడు కుటుంబగౌరవం మంట కలిసిపోదూ? తల్లీ కొడుకూ ఒకటై ఏదో ఎత్తు ఎత్తినట్లున్నారు చూస్తే! ఈ పప్పులు నా దగ్గర వుడకవ్. మనది దుర్వాసమహాముని గోత్రం, తెలుసా ?

సుం: ఆ సంగతి ఒకరు చెప్పాలటండీ? మీ ముక్కుమీది కోపమే అందుకు సాక్షి.

సుబ్బా: నాముక్కు మీది కోపం ఎవ్వర్నీ ఏమీ చెయ్యదులేవే. కాకపోతే ముక్కు దురదపెడుతుంది. గోక్కోగానే ఆకోపం కాస్తా ఎగిరి చక్కా గాలిలో కలిసి పోతుంది. మరి కొందరుంటారు చూడు వాళ్ళకు కోపం గొంతులో గురగుర మంటుంది. వాళ్ళవల్లనే ప్రపంచానికి ఎక్కువ ప్రమాదం.

సుం: నాకు అదీ వద్దు ఇదీ వద్దు. నాకాలమిట్లా గడిచి పోనివ్వండి.

సుబ్బా: ఇంతకూ ఆ అమ్మాయి సంగతి చెప్పకనే పోతివి గదా?

సుం: అయ్యో రామ. నాకు తెలియదంటుంటే నమ్మరేమిటండి? అదుగో, అబ్బాయి వస్తున్నాడు. వాణ్నే అడగండి.

(కృష్ణమూర్తి వస్తాడు )

సుబ్బా: ఏం రా, వంశోద్ధారకా. ఎవరీ అమ్మాయి, ఏమిటీ కథ?

కృష్ణమూర్తి: ఏ అమ్మాయి. నాన్నా?

సుబ్బా: ఆనాటి శకుంతలరా,

కృ: శకుంతల, మేనకా విశ్వామిత్రుల కూతురు. కణ్వమహర్షి పెంపుడు బిడ్డ. దుష్యంతుడి భార్య. ఇలీల మహారాజు కోడలు.

సుబ్బా: నీ మహాభారత జ్ఞానం అమోఘంగా వుంది రా అబ్బాయ్ ఆనాడు నీతో వేషం కట్టిన అమ్మాయిని గురించిరా నే నడిగింది?

కృ: ఆమె శకుంతలవంటి ఒక భారతీయ నారి, నాన్నా. మా గురువుగారి దగ్గర నాతో పాటు రిసెర్చి చేస్తూ వుంది.

సుబ్బా: ఓహో. దీనికంతకూ మూలకారణం ఆ పరంధాముడేనన్నమాట?

సుం: అన్నిటికీ మూలకారణం ఆ పరంధాముడే కదండీ?

సుబ్బా: ఇక కట్టి పెట్టు నీ వేదాంతం. ఒరేయ్, కిష్టాయ్. ఆ అమ్మాయి కులగోత్రాల సంగతి ఏమన్నా తెలుసుకున్నావా?

కృ: అవి తెలుసుకోవాలన్న వూహే నాకు కలగలేదు. నాన్నా.

సుబ్బా: కులగోత్రాలు తెలియని పిల్లను ప్రేమించి కుటుంబగౌరవం గంగలో కలపడం తెలుసూ నీకు? ఇటువంటి కులనాసకులు వుంటే ఏం, వూడితేయేం?

కృ: ఏమిటి నాన్నా. యీ అర్ధం లేని ఆవేశం?

సుం: మీ నాన్నకు ముక్కు మహా దురదగా వుందిలే, నాయనా.

సుబ్బా: (కోపంగా) ఉంటుంది. వుంటుంది. నీవూ నీ కొడుకూ కలిసి పన్నిన ఈ పన్నాగ మంతా అర్థమైందిలే. మన కుటుంబగౌరవానికి ఎంతహాని తలపెట్టారర్రా మీరు. అటు ఏడుతరాలవారూ, ఇటు ఏడు తరాలవారూ, మీ అఘాయిత్యానికి అంతరిక్షంలో అలో లక్ష్మణా అని ఎలా అఘోరిస్తున్నారో. అరు నూరైనా సరే నూరారైనా సరే ఇది జరగటానికి వీల్లేదు. ఎంతమాత్రం వీల్లేదు.

కృ: (బాధాసూచక స్వరంతో) నాన్నా !

సుం: రామా. పరంధామా. ఏమిటీ విపరీతం?

సుబ్బా: ఆ పరంధాముడి దగ్గరే తేలాలి ఈ విషయం. దీని అంతు తేలకుండా ఈ రాత్రికి నిద్రపోతే నాపేరు సుబ్బారాయుడు కాదు. నేనిపుడే వెడతాను. (దురుసుగా వెళ్ళిపోతాడు)

కృ: ఎందుకమ్మా. నాన్న అలా అగ్గిరాముడై పోయాడు?

సుం: ఆయన కోపం అంతేలే నాయనా. వట్టి తాటాకులమంట. ఆయన పరంధామయ్యగారి వద్దకు వెళ్ళడం అదీ మన మంచికేలే. ఆయనకంటే ముందుగానే మన మక్కడికి చేరుకోవాలి. పద. పోదాం.

... .. .. ..

పరంధామయ్య: (అర్థభేదాన్ని సూచించే ఉచ్చారణతో కొన్ని వాక్యాలు చదువుతుంటాడు)

వా డు పో లేదు.

వా డు పో లే దే!
వా డే పో లే దే?
వా డూ పో లే దే?

సుబ్బారాయుడు: హడావడిగా వస్తాడు. ఎవడ్రా. నీవు పొమ్మంటే పోకుండా మొండికెత్తిన ఆ అభాగ్యుడు? ఇంకా చూస్తావేం, మక్కెలు విరగదన్నకుండా?

సుబ్బా: వచ్చావా, సుబ్బారాయడూ? రా రా! నీ కోసమే ఎదురు చూస్తున్నా. మన మాటకు ఎదురు చెప్పేవాడెవడున్నాడులే?

సుబ్బా: అయితే ఈ పారాయణమేమిటి, పరంధాముడూ?

ప: ఇది భాషాశాస్త్ర పరిశోధనలే. మన దేశంలో ఇది ఇంకా బాల్యావస్థలోనే వుంది గాని, అమెరికా రష్యా మొదలైన దేశాల్లో ఇది చిలవలు పలవలై బహుముఖంగా వ్యాపిస్తూవుంది.

సు. మంచిపనేలే. ఇప్పుడు నేనెందుకు వచ్చానో తెలుసా? వీడి సంగతేమిటో తేల్చుకు పోదామని వచ్చాను.

ప. వీడంటే ఎవడు?

సు. ఇంకెవరున్నారు? అస్మత్ కుమార రత్నం. భవత్ శిష్యమాణిక్యం.

పరం. వాడికేం. నిక్షేపమంటివాడు. వాడు కన్నడరాజ్య రమారమణుడు. కాబోతుంటేను.

సుబ్బా: ఓయ్. పరంధామా. భాషా పరిశోధనలో నీ బుర్ర వేడెక్కి పోయినట్లుంది. రాజులే లేని ఈ ప్రజాస్వామిక యుగంలో ఇంకా రాజ్యాలేలడమేమిట్రా. నీ మొగం?

పరం: వాడు ఏల బోయేది ప్రేమరాజ్యమోయ్. ఆంధ్రుడైన శ్రీ కృష్ణ దేవరాయలు కన్నడరాజ్యలక్ష్మి కరగ్రహణం చెయ్యబోతున్నాడు. ఏమంటావ్, దీనికి?

సుబ్బా: ఆవిడ కన్నడులపిల్లా? పేరు రాజ్యలక్ష్మా? పేరు బాగానే వుంది. కాని ఎంత అన్యాయానికి ఒడిగడ్తావురా, పరంధాముడూ, ఈ పెండ్లి జరగడానికి వీల్లేదు.

పరం: ఏం, నాయనా. శుభమస్తు. నీ కొడుకు పెళ్ళిచేసుకో బోతుంటే మధ్య నీకేమొచ్చి పడింది?

సు. ఈ జాతి భేదపు పెండ్లికి ఒప్పుకోమంటావట్రా, నన్ను? ఇలా చేస్తే ఇంకేమన్నా వుందీ? నా కుటుంబ గౌరవం గుంటబెట్టి గంటవాయించినట్లేగదట్రా.

పరం: ఇందులో జాతిభేదమేముంది?

సు: ఒరేయ్, నీకు పూర్తిగా మతిపోయినట్లుంది. మనం ఆంధ్రులం, వాళ్ళు కన్నడులు, ఇది జాతిభేదం కాకపోతే మరేమిట్రా?

పరం: నాకు కాదు మతిపోయింది, నీకు! ఆంధ్రులూ కన్నడులూ అత్యంత సన్నిహితులని చరిత్ర ఉద్ఘోషిస్తున్నది. మొదట్లో ఇద్దరూ ఒకటే. తర్వాత వేరైనారు. అయినా ఇప్పుడు ఆలోచించవలసింది మనం ఆంధ్రులమనీ, వాళ్ళు కన్నడులనీ కాదు. మనమంతా భారతజాతి అనే భావం పెంపొందించుకోవాలి.

సు: ఈ పడికట్టు మాటలకేం లేవోయ్, ఎన్నైనా చెప్పొచ్చు. ఒక యింట్లోనే అయ్య ఆంధ్రం అమ్మ కన్నడం మాట్లాడుతుంటే ఇక ఆ సంసార సౌరభ్యం చెప్పక్కర్లేదు.

పరం: ఆ జాతిభేదమెలాంటిదో, ఈ భాషా భేదం కూడా అలాటిదే. ఆ నాడు శకుంతల వేషం వేసింది గదా ఆ అమ్మాయి, తెలుగు మాట్లాడడంలో యాస ఏమన్నా కనిపెట్టావా, నీవు?

సు: లేదు. తెలుగువాళ్ళు మాట్లాడినట్లు స్వచ్ఛంగా మాట్లాడింది.

పరం: తెలుగు కన్నడం అంత దగ్గరగా వుండే భాషలు. జాతి భేదాన్ని అధిగమించినట్లే మనం ఈ భాషా భేదాన్ని కూడా అధిగమించాలి. అసలు భాషలను బట్టే గదా, ఇన్ని రాష్ట్రాలనీ ఇన్ని జాతులనీ మన దేశంలో ఏర్పడ్డది. భారత దేశంలో ఇన్ని భాషలు ఉన్నా వారిలో ప్రతిఫలించే సంస్కృతి అంతా ఒకటే.

సు: అయితే ఆ అమ్మాయి కులగోత్రాల మాటేమిటి?

పరం. ఆ అమ్మాయి కులానికేం , నిక్షేపమైన కులం.

సు: ఇంతకూ ఆవిడది మన కులం అవునా, కాదా? ఆ సంగతి తేల్చి చెప్పవోయ్. నన్ను చంపక.

ప: ఒరే, పిచ్చివాడా. కృతయుగంలో కులాలెక్కడున్నాయిరా. తర్వాత యుగాల్లో వచ్చాయని మన శాస్త్రాలే చెబుతున్నాయి. కలియుగంలో వర్ణసంకరమై పోతుందని అవే ఘోషిస్తున్నాయి. కృతయుగం మళ్ళీ వస్తున్నదన్నమాట. కృతయుగం వస్తున్నదని సంతోషించక, కులాలు పోతున్నాయని ఏడవడ మెందుకూ?

సు: (కోపంతో) ఆ అమ్మాయిది మన కులం కూడా కాదన్నమాట. నన్ను సర్వనాశనం చేశావురా, పరంధాముడూ, నా కుటుంబ గౌరవం కాస్తా నట్టేటముంచావు. నీవు మిత్రరూపంలో వున్న శత్రువ్వెరా నాకు.

పరం: ఆగవోయ్, దుర్వాసమహాముని, ఆగు! ఎంత సేపటికి కుటుంబగౌరవమో కుటుంబగౌరవమో అని అఘోరిస్తావ్. కులాలను బట్టీ గోత్రాలను బట్టి వస్తుందా కుటుంబగౌరవం? కుటుంబంలో వుండే మనుష్యుల ప్రవర్తనను బట్టి వస్తుంది. ఆ అమ్మాయి సకల సద్గుణరాశి . నీ కుటుంబానికి ఎనలేని గౌరవం తెస్తుంది. నా మాట నమ్ము.

సు. పలకడు.

పరం: మాట్లావేం తమ్ముడూ. మనసులు కలిసినప్పుడు మరి ఇతర పట్టింపులతో పనేమని, ఈ కార్యానికి సాహసించాను. నీ మనస్సుకు నెప్పి కలిగించానని ఇప్పుడు తెలుసుకున్నాను. నీ యిష్టం వచ్చినట్లే కానియ్యి. మన స్నేహం ఈనాటిది కాదు. కావాలంటే నాహృదయం చీల్చి చూచుకో. అందులో ప్రతి రక్త బిందువు ఈ మన అమలిన స్నేహంతో నిండి వుంటుంది. ఏ పరిస్థితుల్లోనూ మన స్నేహానికి విఘాతం రానియ్యకు, తమ్ముడూ.

సుబ్బా: (ఆవేశంతో) అన్నా, పరంధామా.

పరం: (ఆర్ద్రభావంతో) తమ్ముడూ.

సుబ్బా: అన్నా! ఈ నా జీవితం నీవు పెట్టిన భిక్ష. కులాభిమాన గర్వంతో మూసుకుపోయిన నా కళ్ళు తెరిచావ్. నీ యిష్టం వచ్చినట్లే కానియ్యి. చిరంజీవులు ఇప్పుడిక్కడ వుంటే ఎంత బాగుండును.

పరం. తమ్ముడూ! నేను ధన్యుణ్ణి. గదిగుమ్మం వైపు తిరిగి. ఓ అభినవ శకుంతలాదుష్యంతులారా. ఇక రంగం మీదికి దయ చెయ్యండి. అమ్మా. సుందరమ్మా. నీవు కూడా రా అమ్మా.

(ముగ్గురూ గదిలో నుంచి వస్తారు).

సుబ్బా. ఆశ్చర్యంతో. వీళ్ళంతా ఇందాకటి నుంచీ ఇక్కడే వున్నారూ? ఎంత నాటక మాడావురా, పరంధాముడూ.

పరం. ఏం చేస్తాంరా, మరి నీ ఉగ్ర నరసింహావతారానికి హడిలిపోయి నీ భార్యా కొడుకూ ఇక్కడికి పరుగెత్తుకొచ్చారు. అప్పుడు రాజ్యలక్ష్మి ఇక్కడే వుండి. ఒరేయ్, కృష్ణమూర్తీ. ఇంకా సిగ్గు పడతావెందుకురా. ఆనాడు అభినవశకుంతలా కరగ్రహణం చేసినట్లు---

కృ. అది నాటకమండీ.

పరం. అది నాటకమైతే, ఇది జగన్నాటకం రా, శిష్య చూడామణీ! అమ్మాయ్, రాజ్యలక్ష్మి. శ్రీకృష్ణదేవరాయలు రాజ్యలక్ష్మి కరగ్రహణం చేస్తాడట, కుడిచెయ్యి చాచమ్మా.

రాజ్య. మామగారేమంటారోనని భయంగా వుంది.

పరం. వాడిది దుర్వాసమహాముని గోత్రంలే అమ్మా. అందుకని వుండుండి ముక్కు దురద పెడుతుంటుంది. అంతే. అంతేగాని మీ మామగారంత మంచి మనిషి వున్నాడటమ్మా, ఈ ప్రపంచంలో. వాడు వట్టి అల్పసంతోషి. వాడి ముక్కోపానికి మందు మీ అత్తయ్యకు బాగా తెలుసుననుకో. కొత్తకోడలివి నీవు కూ డా తెలుసుకోవడం మంచిది.

రా. ఏమిటండీ, అదీ?

పరం. మీ మామగారు తిండి దగ్గర వట్టి మొగమాటం మనిషి, రాజ్యలక్ష్మి! వేయించుకోవాలని మనసులో వున్నా, వెయ్యడానికి వచ్చినప్పుడు సాకు సాకని చెయ్యి అడ్డం పెడుతుంటాడు. నీవు మాత్రం వడ్డనకు వచ్చినప్పుడల్లా అదేమీ గమనించకుండా ఒక బేకు బేకి పోతూవుండు, దాంతో వాడి తిక్క కుదురుతుంది.

రా. ---సన్నగా నవ్వుతుంది-

సుం. ఎందుకన్నయ్యా, కోడలు నవ్వుతున్నది?

పరం. కన్నడ భాషలో సాకు అంటే చాలనీ, బేకు అంటే వెయ్యమనీ అర్థమమ్మా.

(అంతా పగలబడి నవ్వుతారు)

కృ ఇక నీ కుడిచెయ్యి ఇలా అందించు, లక్ష్మీ. ఆఁ. ఈ నిమిషం నుంచీ మనం దంపతులం. మన సంబంధం నిత్యమైంది.

సుం. ఎవరన్నా మంగళం పాడితే బాగుండునే.

పరం. ఒకరు పాడడ మెందుకూ? ఒరేయ్ కృష్ణమూర్తీ. ఇన్నాళ్ళూ మీరిద్దరూ డ్యుయెట్లు పాడి పాడి విసిగి వేసారి పోయారు. ఇక మీ జీవితమంతా కోరస్సులమయమే. ఒక కోరస్ అందుకోండి. కుటుంబగౌరవాన్ని గురించి పాడండి.

(ప్రసారం తేది 27-9-61)

----- 0 -----

# ఒకే మాట

*పాత్రలు:*

1. ఆంధ్రుడు
2. కర్ణాటకుడు.
3. తమిళుడు.
4. కేరళుడు.
5. భారతమాత.

ఆంధ్రుడు. మా ఆంధ్రజాతి వున్నదే, విన్నావా చాలా పురాతనమైన జాతి. వేదాల్లో కూడా మాపేరుంది.

తమిళుడు. వేదాలు పుట్టకముందు కూడా మా ద్రావిడ జాతి వుంది. ఇది విన్నావా?

కన్నడుడు. కావేరీనది ఎప్పుడుపుట్టిందో ఎవరు చెప్పగలరు? మా కన్నడ జాతి పుట్టుక కూడా అంతే. ఇది వినండి ముందు.

కేరళుడు. సముద్రం ఎప్పుడు పుట్టింది? కొండలెప్పుడు పుట్టాయ్? కొబ్బరిచెట్లెప్పుడు తలలెత్తాయి? మా కేరళజాతి ఆనాటిది. తెలుకోండిప్పటికైనా.

తమి. అసలీదేశంలో మొట్టమొదటవుంది ఒకే ఒక జాతి, అది ద్రావిడ జాతి. ఒకే ఒక భాష, అది ద్రావిడభాష. ఆ ద్రావిడజాతికి మేమే వారసులం.

కేర. ఆ వారసత్వపు హక్కు మాకూ వుం దిలేవయ్యా. నీమొగాన్నే పొద్దు పొడవలేదు.

తమి. మా అరవభాష స్వచ్ఛమైన ద్రావిడభాష.

ఆంధ్రు. అరవగోడు చింతగుగ్గెళ్ళు అని మాలో ఒక సామెత వుంది. మీ అరవం చెవికి అంత సొంపుగా వుంటుంది.

తమి. మీ తెలుగు సంగతే చెప్పు. దానికి స్వతంత్ర ప్రతిపత్తి ఎక్కడేడ్చింది? నూటికి తొంభైపాళ్ళు సంస్కృతమేగా అందులో?

కేర. సంస్కృత భాషను మేమూ స్వీకరించాం. మా మణిప్రవాళశైలి

అందుకు సాక్షి.

ఆంధ్ర. పెరుగూ వడ్లూ కలిపి పిసికినట్లే వుంటుంది మీమణి ప్రవాళశైలి. మేమలాకాదు. సంస్కృత పదాలను తత్సమాలుగా మార్చి తెలుగు మాటలతో అతికి పోయేటట్లుగా చేశాం. అందుకే మా తెలుగు అంత శ్రావ్యంగా వుంటుంది.

కన్న. మీ తెలుగెక్కడ నుంచి వచ్చింది? మా కన్నడంలోనుంచే వచ్చింది. మీ ఆదికవి నన్నయ్య మా వాడే.

ఆంధ్ర. నన్నయాది కవిత్రయం రచించిన మహాభారతం లాంటి గ్రంథం మీ భాషల్లో ఏది?

తమి. నన్నయ్య మీవాడని ఎంత మురిసి పోతున్నావయ్యా, తెలుగురాయుడా. నన్నయ్య మా అరవవాడు. మీదేశానికి వలస వచ్చాడు.

కన్న. ఇది మరీబాగుంది. నన్నయ్య అచ్చం కన్నడుడని ఆపేరే చెబుతుంటే, అరవవాడంటా వేమిటి?

ఆంధ్ర. ఎవరేమన్నా నన్నయ్య ఆంధ్రుడే. ఆయన భారతం వంటి గ్రంథం మీ భాషల్లోవుంటే చెబుదురూ, అప్పుడు తెలుస్తుంది మీ పస?

కన్న. మా పంపడు రాసిన భారతం చదువుకో, మీ నన్నయ్య పస బయటపడుతుంది.

తమి. పోనీ భారతం అందరూ రాశారుగా వాల్మీకి వ్రాసినంత పసందుగా రామాయణం ఎవరు రాశారో చెబుదురూ? ఆ ఖ్యాతి మాదే. మాతమిళంలో కంబరామాయణం అందుకు సాక్ష్యం.

ఆంధ్ర. మా వాళ్ళూ రాశారు లేవయ్యా, రామాయణాలు, మా ఎర్రాప్రగడ

రామాయణమే వుంటే మీ కంబరామాయణం సంగతి తెలిసి వచ్చేది.

తమి. మీ తెలుగు కవులు వట్టి భట్రాజులు. మా కవులు సర్వతంత్ర స్వతంత్రులు. మా నత్కీరుడువంటి స్వతంత్రుడు మీలో కంచుకాగడా వెట్టి వెతికినా కనపడడు.

కేర. ఏం వెలగ బెట్టాడయ్యా మీ నత్కీరుడు?

తమి. ఏమీ? పరమేశ్వరుడు చెప్పిన పద్యంలోనే తప్పు పట్టాడు.

కన్న. అంత దురహంకారి కవేమిటయ్యా?

ఆంధ్ర. అందుకే కుష్ఠురోగంతో తీసుకున్నాడు. మా పోతన్నను చూడండి, ఎంత స్వతంత్రుడో, అంత వినయ సంపన్నుడు. భక్తిలో ఆయనకు సాటి మీలో ఎవరున్నారు? చెప్పండి చూతాం.

తమి. ఎంతసేపటికి గతకాలపు గొప్పను త్రవ్వి పొయ్యడమే మీకు మిగిలింది. జాతికి ప్రతినిధిగా నిలువగల కవి ఈనాడు మీకు ఎవరున్నారు? మాకు మా సుబ్రహ్మణ్య భారతి వున్నాడు.

కేర. మాకు మా వల్లతోల్ మహాకవి వున్నాడు.

కన్న. మాకు మా బేంద్రే వున్నాడు.

ఆంధ్ర. ఒక్కడితో తృప్తిపడి సరిపెట్టుకోవలసిన కర్మ మాకేం పట్టింది? మాలో ఊరూరా వాడావాడా ఇంటింటా మహాకవులే. ఏ తెలుగువాణ్ణైనాసరే, కదలిస్తే కవి, మెదిలిస్తే మహాకవి.

కేర. బాగావుంది. ఆంధ్రానామనేకత్వం అనేమాట వృధా పోలేదంటావు.

దానికేంగాని, అద్వైతమత ప్రతిష్ఠాపనాచార్యుడు శంకరాచార్యులు మావాడు. దీనికేమంటారు?

తమి. ఆయన వాదాన్ని పరాస్తంచేసిన విశిష్టాద్వైతమత స్థాపనాచార్యుడు రామానుజాచార్యులు అరవవాడు.

కన్న. ఇద్దరి వాదాలనూ ఇంటి దారి పట్టించిన ద్వైతమత స్థాపనా చార్యుడు మధ్వాచార్యుడు మా కన్నడవాడు.

ఆంధ్ర. ఆటవెలది పాదమంజీరధ్వనిలో సర్వ వేదాంత సారమూ వెలయించిన మాయోగి వేమన్న ముందు వీళ్ళంతా ఎందుకు పనికివస్తారయ్యా.

కన్న. మతావేశంలో భక్త్యుత్సాహంలో మా బసవేశ్వరుణ్ణి మించిన వాళ్ళెవ రున్నారయ్యా అంటాను.

ఆంధ్ర. బసవేశ్వరుడు వట్టి హింసావాది. భక్తివిషయంలో మా భద్రాద్రి గోపన్న అద్వితీయుడు.

తమి. ఈ వీరశైవులకూ వీరవైష్ణవులకూ ఆదిమగురువులు మా నాయనారులూ, మా ఆళ్వారులున్నూ, ఆ సంగతి తెలుసా మీకు.

ఆంధ్ర. వ్యక్తులసంగతలా ఉంచండి. మా తిరుపతి వంటి దివ్య క్షేత్రం మీ కెవరికైనా వుందీ?

తమి. మా రామానుజాచార్యులు లేకపోతే ఆ తిరువెంగడం సంగతి తెలిసివచ్చేది. అది అసలు మాదే. దాన్ని మీరు కైంకర్యం చేసుకున్నారుగా, మహానుభావులు.

ఆంధ్ర. మీరు మాత్రం సామాన్యులా స్వామీ? మా తిరుత్తని నరసింహస్వామిని గుట్టుచప్పుడు కాకుండా తర్లించుకుపోలా? తిరుపతి సంగతి అలా వుంచండి. మా శ్రీశైలం మాటేమిటి?

మా మల్లికార్జునస్వామి వంటి దైవం నభూతోనభవిష్యతి అంటాను.

కన్న. అంటావంటావు. మాకన్నడింటి ఆడపడుచు మా భ్రమరాంబిక పుణ్యం కట్టుకోబట్టి ఆయనకా పేరు ఊరు దక్కాయి.

తమి. దేవతల సంగతెందుకయ్యా. మానవ ప్రతిభను చెప్పండి. సంగీతంలో మా అరవలం అందెవేసిన చేతులంటాను. కర్ణాటక సంగీతం మాసొమ్ము. కాదంటారా?

అంధ్ర. కాదనం, మహానుభావా. కాదనం. కాని ఆ సంగీతం మూర్తిగొన్న త్యాగయ్య ఎవరో చెప్పమంటాం. ఆ సంగీతసాధనకు తెలుగు కీర్తనలే మీ కెందుకు శరణ్యం కావాలి అని అడుగుతాం.

కన్న. మా కావేరీ జలాలు పెట్టిన భిక్ష గదటయ్యా మీ సంగీతం.

కన్న. మాస్వాతి తిరణాళ్ సంగీత కళలో నిధి అని తెలియదా మీకు.

తమి. మీరు సంగీతం ఒక్కటే చెప్పుకుంటున్నారు. భావరాగతాళ సమ్మిళితమయిన భరతనాట్యంలో మమ్మల్ని మించిన వాళ్ళు లేరు.

ఆంధ్ర. మీ అరవలా? ఎంత అఘాయిత్యమయ్యా సిద్ధేంద్రయోగి ప్రసాదించిన మా కూచిపూడి నాట్యం ముందు మీ భరతనాట్యం ఎందుకు పనికి వస్తుంది?

కేర. మా కథాకళీ ముందు ఇవన్నీ బలాదూర్.

ఆంధ్రు. మా తోలుబొమ్మలాట కంటే గొప్పదా మీ కథాకళీ? ఆ మాకళ జగద్విఖ్యాతమైంది. సుమిత్రా జావా మలయా--

తమి. ఆగవయ్యా ఆగు. తోలుబొమ్మల నాడిస్తూ మీరా దేశాలన్నీ తిరిగారు. మేము వాటిని జయించి అక్కడ మా రాజ్యాలు స్థాపించాం. తెలుసా?

కన్న. ఎవరయ్యా మీలో ఆ మొనగాడు?

తమి. మా రాజేంద్ర చోళమహారాజు. ఆయనకు గంగైకొండన్.. అనే బిరుదుంది.

ఆంధ్రు. మంచి బిరుదే సంపాదించాడు మీ రాజు. పోయి పోయి గంగనీటిని జయించాడూ? మంచి మొనగాడయ్యా మీ మహారాజు.

తమి. నీ శబ్దజ్ఞానం అఘోరించినట్లే వుంది. గంగ ఒడ్డున కూడిన సైన్యాలను చితకగొట్టాడు మా మహారాజు.

ఆంధ్రు. మీ రెంతసేపటికీ నిన్నమొన్నటి గొప్పలు చెప్పుకోవలసిందే. క్రీస్తుకు పూర్వమే మాశాతకర్ణి గంగ ఒడ్డున పాటలీపుత్రం కోటబురుజులమీద తెలుగు జెండా ఎగరేశాడు.

కన్న. ఏమిటేమిటి! శాతకర్ణి మీవాడా! ఎంత అఘాయిత్యానికి ఒడిగట్టావయ్యా! కర్ణి అనేమాటే చెబుతుంది. అతడు మా కర్ణాటకుడని, శాతవాహనులు మా కన్నడులు-బళ్ళారి మండలం వాళ్ళ జన్మభూమి.

ఆంధ్రు. సృష్ట్యాది నుంచి మాదైన బళ్లారి సీమను అన్యాయంగా దత్తం చేసుకుని ఇప్పుడీమాట అంటున్నావా? నీ నోటి కడ్డమేముందీ? తుంగభద్రకూడా మాదేనంటావా ?

కన్న. ఆహా అక్షరాలా. తుంగభద్ర మాదే.

ఆంధ్రు. పోనీలే. మా కృష్ణా గోదావరులే మాకు చాలు.

కేర. ఆ మాట బిగ్గరగా అనకు. మహారాష్ట్రులకు కోపం వస్తుంది.

ఆంధ్రు. ఎవరికి కోపం వస్తే మాత్రం మాకేం భయం? మా ఆంధ్రశౌర్యం యొక్క తీక్ష్ణత వాళ్ళు చవి చూస్తారు.

తమి. వహహ్హా. చెప్పుకోక చెప్పుకోక మీ శౌర్యమే చెప్పుకోవాలి. మీది ఆవకాయ శౌర్యం, గోంగూర ధైర్యం.

ఆంధ్ర. ఏం, మీ ఇడ్లీ సాంబార్ కంటె చెడిపోయిందా మా ఆవకాయ?

కన్న. ఆగండాగండి. మా బిసిబేళె హుళియన్న ముందు మీ ఆవకాయలూ, ఇడ్లీలు ఎందుకు పనికి వస్తై.

కేర. ఓరన్నా. ఈ హుళియన్నను ఎక్కడ పట్టావురా తండ్రీ. మా వాళ్ళకి ముందు ఇవన్నీ సోదిలోకి కూడా రావు పోండి.

ఆంధ్రు. ఒకప్పుడు మగధ సామ్రాజ్యాన్ని లోగొని మా శాతవాహనులు గంగాతీరం వరకూ తమ పరిపాలనను వెలయించారు. కాకతీయుల కాలంలో మా ఆంధ్ర తేజం దశదిశలూ వ్యాపించింది. విజయనగరాంధ్ర చక్రవర్తి శ్రీ కృష్ణదేవరాయలు కటకం నుంచి కన్యాకుమారి వరకు ఆంధ్రసంస్కృతిని వెదజల్లాడు. మా ఆంధ్ర పౌరుషం అనన్య సామాన్యం.

కన్న. ఆశ! చరిత్రనే తారుమారు చేస్తున్నావ్. విజయనగర సామ్రాజ్యం కన్నడ సామ్రాజ్యమయ్యా

---విచారవదనంతో భారతమాత ప్రత్యక్షమౌతుంది. నలుగురూ ఆమెను విస్తుపోయి చూస్తూ--

ఆంధ్రు. ఆహా, ఏమిటీ వింత. ఈ మహామూర్తి సకల మాతృమూర్తుల

సమ్మిళితతత విశ్వరూపమై వెలిగిపోతున్నది. ఎవరు తల్లి నీవు?

కన్న. తెలిసింది. తెలిసింది. ఈమె మన అమ్మలను కన్నమ్మ.

కేర. భారతమహాజనయిత్రి.

భారతమాత. (విచారవదనంతో) అవును, నాయనలారా నేను మీ అమ్మలనందరిని కన్న అమ్మను. భారతమాతను.

ఆంధ్ర. అమ్మా! భారతజననీ! తరతరాల నీ దుర్భర దాస్యాన్ని పటాపంచలు చేశాం. కష్టపడి అహింసా మార్గాన నీకు స్వాతంత్ర్యాన్ని చేకూర్చాం. స్వాతంత్ర్య శోభతో కళకళలాడుతూ వుండవలసిన నీకీ విచార మిప్పుడెందుకమ్మా?

తమి. నీ కీర్తి ఖండఖండాంతరాలలో వ్యాపింప చెయ్యడానికి శాయశక్తులా పాటుపడుతున్నాం. నీ న్యాయం, నీ ధర్మం, నీ శాంతికాముకత్వం ప్రపంచ ప్రశంసలు పొందేటట్లు చేస్తున్నాం. ఎందుకు తల్లీ నీకీ గద్గదస్వరం?

కన్న. నిన్ను సకలైశ్వర్య సుశోభితను చెయ్యడానికి అహర్నిశలూ శక్తివంచన లేకుండా పనిచేస్తున్నాం. ఈ దీనవదనం నీకెందుకమ్మా?

కేర. ఎవ్వరికీ ఏ కొరత లేకుండా నీ బిడ్డలందరూ సుఖించడానికి సమతామార్గంలో పురోగమిస్తున్నాం. ఎందుకు తల్లీ నీకీ కన్నీరు?

భారత. నాయనలారా. నిజంగా నాకిపుడే విచారానికి అవసరం లేదు. కాని మీరిందాక అనుకున్న మాటలన్నీ అదృశ్యమూర్తినై విన్నాను. అవి నన్ను కలవరపరిచినై. అందుకూ ఈ విచారం.

ఆంధ్రు. మా భాషనూ సంస్కృతిని మా శౌర్య సాహసాలనూ మేము గొప్పచేసి చెప్పుకోవడం తప్పా? -- తల్లీ?

భారత. అందులో తప్పేమిలేదు నాయనలారా. మీ మీ ప్రత్యేకభాషలూ సంస్కృతులూ అవిచ్ఛిన్నంగా అభివృద్ధి చెందడానికే మీకు భాషారాష్ట్రాలు ఏర్పడ్డై. కాని మీమధ్య వుండవలసిన ఐకమత్యం స్వార్థాతిశయాలతో ఎక్కడ దెబ్బ తింటుందోననే నాభయం.

కన్న. భారతమాతా---- అలా ఎన్నటికీ జరగ నివ్వమమ్మా.

భారతమాత. మీరిప్పుడిట్లాగే అంటారు. కాని చరిత్ర బోదించే సత్యాన్ని ఎవరు కాదనగలరు? సమయం వచ్చేటప్పటికి దేశాభిమానం అడుగున పడి, ప్రాంతీయ దురభిమానాలూ, స్వార్థప్రేరిత పరస్పర వైరాలూ పైకి వచ్చిన ఘట్టాలే మన చరిత్రలో జాస్తి. ఒక పురుషోత్తముడి కెదురుగా ఒక అంభి శత్రువుతో చేతులు కలిపాడు. ఒక పృధ్వీరాజును వెక్కిరిస్తూ ఒక జయచంద్రుడు వికటాట్టహాసం చేశాడు.

కేర. అయితే ఇప్పుడు మమ్మల్నేం చెయ్యమంటావుతల్లీ?

భారత. మీలో ఒకరికంటె ఇంకొకరు ఎక్కువనే దురభిప్రాయం వదులుకోండి. మీ మీ సంస్కృతులన్నిటికి మూలమైన భారతీయ సంస్కృతిని పోషించండి. మీరంతా భారతీయులనే మాట నిద్రావస్థలో కూడా మరచిపోకండి.

తమిళు. దక్షిణాదికి సంబంధించినంతవరకూ నీకోరిక అక్షరాలా నెరవేరుస్తామమ్మా. కాని ఆ ఉత్తరాది వాళ్ళ సంగతి ఎత్తకు. వాళ్ళంటే మాకొళ్ళుమంట.

భారత. వాళ్ళేం కానిపని చేశారు నాయనా? ఆర్యద్రావిడ సమ్మేళనం

విడదీయరానంతగా పెనవేసుకుని వేలయేండ్లు గడిచాయి. వాళ్ళు శ్రీరామచంద్రుణ్ణి మీరంతా ఆరాధిస్తున్నారు. మీ శివదేవుణ్ణి వాళ్ళు నెత్తిన పెట్టుకుని పూజిస్తున్నారు. ఆ కాశి ఎంత పుణ్య క్షేత్రమో ఈ రామేశ్వరం కూడా అంత పుణ్య క్షేత్రమే. అక్కడ కైలాసశిఖరం మీద మహానటమూర్తియైన పరమశివుని తాండవకేళి! ఇక్కడ కన్యాకుమారివద్ద జగజ్జననియైన పార్వతిదేవి తపోదీక్ష! ఔత్తరాహులని దాక్షిణాత్యులని భేదం ఎక్కడ వుంది? కైలాస శిఖరం నుంచి కన్యాకుమారి వరకూ అంతా ఒకటేదేశం, ఒకటే జాతి, ఒకటే సంస్కృతి.

ఆంధ్రు. తల్లీ, జ్ఞానోదయమైంది.

తమి. అమ్మా ప్రాంతీయ దురభిమానంతో మూసుకుపోతున్న మాకళ్ళు తెరిపించావు.

కన్న. జై, భారతమాతకూ జై.

కేరళు. తల్లీ. ఇక మా అందరిదీ ఒకేమాట-

అందరం మనమందరం
భరతాంబ కూరిమి బిడ్డలం
ఆంధ్రులం.. .. మరి అరవలం..

కర్ణాటులం మళయాళులం,
అందరం మనమందరం
భరతాంబ కూరిమి బిడ్డలం
అస్సామీలం బెంగాలీలం
కాశ్మీరీలం పంజాబీలం
గుజరాతీలం మహారాష్ట్రులం
ఉత్కళీయులం బీహారీలం

రాజపుత్రులం మహారాష్ట్రులం
ఆంధ్రులం మరి అరవలం
కర్ణాటులం మళయాళులం
అందరం మనమందరం
భరతాంబ కూరిమి బిడ్డలం!

(ప్రసారపు తేదీ 28-10-61)

----- 0 -----

# మధుర మీనాక్షి

*పాత్రలు:*

1. అక్క
2. పాండ్యరాజు
3. చెల్లి
4. రాణి
5. మీనాక్షి
6. సుందరేశ్వరుడు
7. కుండోదరుడు

## నదీ ప్రవాహ ధ్వని

అక్క: ఈ నదిమీద నుండి వచ్చే చల్లని పిల్లగాలుల వల్ల మార్గాయాసమంతా పోయింది. ఈ గాలికి ప్రాణాలు లేచి వచ్చినట్లున్నై చెల్లీ.

చెల్లి: అవునక్కా ఈ నది చిన్నదైనా ఎంత ఒరవడిగా ప్రవహిస్తూ వుందో చూచావా. ఇదేం నది అక్కా.

అక్క: ఈ నది ఒడ్డున ఉన్న ఈ పట్టణం మధురానగరం చెల్లీ.

చెల్లి: ఇది మధురా? బృందావనమా! చిన్ని కృష్ణుని చిలిపి చేష్టల కాకరమైన పుణ్యభూమేనా ఇది? అయితే ఇది యమునా నది అయి ఉండాలి. బాలకృష్ణుని మురళీగానం చేత పునీతమైన ఈ దివ్యనది దర్శనం లభించిందే! ఎంత భాగ్యం! ఏమి పుణ్యం!

అక్క: పిచ్చి పిల్లా! యమునానది ఇక్కడ ఎందుకు వుంటుందే? నిన్న గాక మొన్ననేగా మనం కన్యాకుమారి అగ్రం వదిలిపెట్టింది. ఇంకా మనం దక్షిణ దేశంలోనే ఉన్నాం. మధురానగరం ఉత్తరాన వుండె. ఆమధురా బృందావనం కాదు. ఇది ఇంకొక మధుర. అరవ దేశం లోది. దీనిని మన తమిళ సోదరులు మదురై అంటారు.

చెల్లి: అయితే ఇది యమునానది కాదూ? అవునులే, నా తెలివి తెల్లారినట్లే వుంది. యమున నీళ్ళు నల్లగా వుంటాయి కదూ? ఇవి చూడక్కా, కొబ్బరినీళ్ళవలె ఎంత తేటగా వున్నాయో. ఇంతకూ ఈ నది ఏమిటో చెప్పకనేపోతివి గదా!

అక్క: ఇది వైగై నది చెల్లీ.

చెల్లి: వైగై !చిత్రంగా వుందే ఈ పేరు.

అక్క: ఇది అరవ పేరులే చెల్లీ. వైగై అంటే తెలుగులో 'చెయ్యిపట్టు' అని

అర్థం.

చెల్లి: చెయ్యి పట్టు ఇది మరీ చిత్రంగా వుందే. నదేమిటి చెయ్యి పట్టటం ఏమిటక్కా.

అక్క: దానికంతా ఒక కథ వుందిలే చెల్లీ.

చెల్లి: ఉందీ కథ! బలే, బలే, ఆకథేమిటో చెప్పక్కా. విన్నదాకా ఇక నాకు నిదర పట్టదు.

అక్క: లేడికి లేచిందే ప్రయాణమని ఏమిటా తొందర చెల్లీ! ముందీ చల్లటి నీటిలో స్నానం చెయ్యనియ్. కథెక్కడికి పోతుంది, నేనెక్కడికి పోతాను.

చెల్లి: అలా వల్లగాదక్కా. కథ వెంటనే చెప్పితీరవలసిందే.

అక్క: అబ్బబ్బ, నువ్వా కాశీ మజిలీ కథల గొల్లపిల్లవాణ్ని చంపి పుట్టావే. ఏమైనా సరే ముందు స్నానం చేసి తీరవలసిందే. అప్పుడు గాని నామనస్సు ఉల్లాసంగా వుండదు. నా చిట్టి తల్లివి కదూ. రా అమ్మా ముందు స్నానం చేద్దాం. స్నానమైనాక నీకు కథ ఎంత పసందుగా చెబుతానో చూద్దువు గాని.

చెల్లి: అయిదే పదక్కా.

(ఇద్దరూ నదిలో స్నానం చేస్తున్న శబ్దం.)

అక్క: అమ్మయ్య, ఇప్పుడు ప్రయాణపు బడలిక అంతా పోయింది. మనస్సు చాలా ఉల్లాసంగా వుంది. ప్రవాహోదక స్నానం చాలా మంచిదని వూరికే అన్నారా పెద్దలు.

చెల్లి: ఈ నదిలో స్నానం చేస్తుంటే గంగానదిలో స్నానం చేసినంత హాయిగా వుందక్కా.

అక్క: ఈ వైగై నది గంగా నది సొంత చెల్లెలే నమ్మా.

చెల్లి: ఏమిటి? నీవు అడపాదడపా ఒక్కొక్క ముక్కే జారవిడుస్తూ నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తుతుంటావక్కా. ఇకనైనా ఆ కథ సాంతం చెబుదూ. నీకు పుణ్యముంటుంది.

అక్క: అయితే చెబుతా విను. ఈ ప్రాంతమంతా పూర్వం పాండ్య రాజ్యం. దాని కొక రాజు. ఆయనకొక రాణి.

చెల్లి: రాజన్న తర్వాత రాణి లేకుండా వుంటుందా, అక్కా జీవితమంటే ఆ కాలపు రాజులదీ రాణులదీ జీవితం. వాళ్ళకు సమస్త భోగాలూ వుండేవి. ఏ కొదవా వుండేది కాదు.

అక్క: కాని ఈ పాండ్య రాజదంపతులకు ఒక కొరత వుండేది చెల్లీ.

చెల్లి: ఏమిటిది, అక్కా.

అక్క: వాళ్ళకు సంతానం ఎంతకీ కలగలేదు. సంతుకోసం పరితపించి పోయారు. ఎన్నో యజ్ఞాలు యాగాలు చేశారు. దానధర్మాలు చేశారు. వ్రతాలు పట్టారు. నోములు నోచారు. చివరకు పార్వతీ దేవి అనుగ్రహం వల్ల వాళ్ళకొక చూడ చక్కని ఆడపిల్ల కలిగింది. ఆ పిల్లకు మీనాక్షి అని పేరు పెట్టారు.

చెల్లి: ఎంత చక్కని పేరక్కా. పేరే ఇంత అందంగా ఉందే ఇక ఆపిల్ల ఎంత అందంగా వుందో. ఆ పేరు ఎందుకు పెట్టారక్కా.

అక్క: దేవిని దర్శించినప్పుడు ఆసంగతి నీకు ఒకరు చెప్పకుండానే తెలుస్తుందిలే చెల్లీ. తలిదండ్రులు మీనాక్షిని అల్లారు ముద్దుగా పెంచారు. మీనాక్షికి పెండ్లీడు వచ్చింది.

చెల్లి: ఇంకే మక్కా. రాజు తలుచుకుంటే దెబ్బలకు కొదవా ఏ చూడ చక్కని మహా రాజకుమారుడికో ఆమెనిచ్చి పెండ్లిచేసి వుంటారు.

అక్క: వచ్చిన చిక్కంతా అక్కడే వుంది చెల్లీ. సాక్షాత్తు పరమేశ్వరుణ్ని గాని వివాహమాడనని మీనాక్షి పట్టు పట్టింది.

---- ---- ---- ----

రాణి: నాథా! గట్టి చిక్కే వచ్చి పడ్డదే మన చిరంజీవితో.

రాజు: దేవీ, ఏమిటి సంగతి పెండ్లి చేసుకోనంటూ వుందా.

రాణి: పెండ్లికి విముఖత ఏమాత్రం లేదు. కాని వరుడి విషయంలోనే వచ్చింది. చిక్కంతా.

రాజు: ఏం మనకు అహితుడైన ఏరాజకుమారునైనా వరించిందా అమ్మాయి.

రాణి: ఆమె మానవమాత్రుణ్ణి చేసుకోదట.

రాజు: అయితే మరెవర్ని చేసుకుంటుందట.

రాణి: ఆ పరమేశ్వరుణ్ణి తప్ప ఈంకెవర్నీ చేసుకోదట.

రాజు: బాగానే వుందే వరస, ఆయనతోపాటు తానూ ఒక భిక్షాపాత్ర పట్టుకు తిరగాలని కోరికగా వుందా అమ్మాయికి! లక్షణంగా ఏరాజకుమారుణ్ణో పెండ్లాడి సకలైశ్వర్యాలూ అనుభవించక ఈ అపరబుద్ధేమిటి! చిరంజీవిని ఒకసారి పిలిపించు.

రాణి: ఎవరక్కడ! భర్తృదారికను ఒకసారి వచ్చిపొమ్మన్నానని చెప్పు.

(నేపథ్యంలో చిత్తం దేవీ అన్న జవాబు అమ్మయిగారూ, మిమ్మల్ని అమ్మగారొకసారి రమ్మంటున్నారు అన్న పిలుపూ, వినబడతాయి.)

మీనాక్షి: ఎందుకమ్మా పిలిచావట.

రాణి: నేను కాదమ్మా, మీనాన్నగారు.

మీనా: ఎందుకు నాన్నా.

రాజు: రాజలోకంలో నీకు మంచి సంబధం తేవాలని నేను చూస్తుంటే, ఏమిటమ్మా ఈ విడ్డూరం! గోచీమొలతాడూ లేని ఆ ఆదిభిక్షుకుణ్ణా నీవు వరించేది?

రాణి: ఆయనకు ఇల్లూ వాకిలీ అంటూ లేదమ్మా. శ్మశానంలోనే మకాం.

రాజు: ఒళ్ళంతా వెలిబూడిద పులుముకుంటాడు.

రాణి : మెడనిండా ఎముకల దండలూ, పుర్రెలహారాలూ!

రాజు: ఆయన తల అదొక కీకర బాకర అడివి.

రాణి: అదెప్పుడూ నీరు కారుతూ ఉంటుంది.

రాజు: కంఠంలో కాలకూట విషం!

రాణి: ఒంటి మీదంతా కస్సుబుస్సు మనే పాముల సొమ్ములు.

రాజు: నొసల నిప్పుల కుంపటి!

రాణి: మొలకు ఏనుగు చర్మం!

రాజు: పులితోలు ఉత్తరీయం!

రాణి: ఎద్దునెక్కి వూరేగుతాడు.

రాజు: పరమ వికారులైన ప్రమథులే పరివారం.

రాణి: దయదలిచి కుబేరుడిస్తేనే అయ్యగారికి పూటగడిచేది.

రాజు: పొద్దునా సాయంత్రం గంగవెర్రులెత్తినట్లు చిందులు తొక్కుతూ ఉంటాడు.

రాణి: అలాటి వాణ్ణి చేసుకుని నీవేం సుఖపడతావు తల్లీ!

రాజు: అందమూ చందమూ లేని ఆ తిరిపాల రాయుడు నీకు తగడు, నా మాట వినమ్మా.

మీనా: పరమేశ్వరుడి బాహ్య స్వరూపాన్ని మీరు తమాషాగా వర్ణించారు. కాని ఆయన ఆత్మ సౌందర్యం మీకు అవగతమైనట్లు లేదు. నా మనోనాథుడు పరమ సౌందర్యమూర్తి. ఆయన సుందరేశ్వరుడు. ఆయన నా హృదయాకాశమంతా నిండి ఉన్నాడు. అక్కడ ఇంకొకరికి తావు లేదు.

రాణి: మీ నాన్నగారి మాటవినమ్మా. కావాలంటే ప్రపంచంలో వుండే రాజకుమారుల చిత్రపటాలు మీనాన్నగారు తెప్పిస్తారు. వాటన్నింటినీ పరికించి అందులో నీకు నచ్చిన రాజకుమారుణ్ని వరించు.

మీనా: నాన్నగారికి అంత శ్రమ ఎంత మాత్రం అవసరం లేదు. మాటి మాటికీ మీరు రాజకుమారులు, రాజకుమారులు, అని అంటారేమిటి. నేను వరించిన వాడు రాజశేఖరుడు. ఇదిగో చిత్రపటం. చూడండి. సుందరేశ్వరుడు ఎంత సౌందర్యవంతుడో మీకే తెలుస్తుంది. (చిత్రపటం ఇస్తుంది)

రాజు: ఎంత మనోమోహనంగా వుంది ఈ మూర్తి. మగవాడికి నాకే సొక్కు కలిగిస్తూ ఉంది. ఎక్కడిదమ్మా నీకీ పటం.

మీనా: ఆ జగజ్జనని పార్వతీ దేవి ప్రసాదమిది, నాన్నగారూ.

రాణి: నాథా, ఇక సంశయానికి ఎంత మాత్రం తావులేదు. ఆ ముల్లోక జననీ వరప్రసాదం మన ముద్దులబిడ్డ! చిట్టి తల్లికి ఆమె

ప్రసాదించిన వరుడీ సుందరేశ్వరుడు. ఇతడు ఏ మహారాజకుమారుడో అయివుంటాడు. తప్పదు.

రాజు: అలాగే దేవీ. కన్న తల్లి ఇష్ట ప్రకారమే కానిద్దాం. కాని ఈ రాజకుమారుడు ఏదేశంవాడో ఎక్కడ వుంటాడో మనకేమి తెలియదుగదా! వివాహలగ్నానికి ఈయన ఇక్కడికి వచ్చేదెలా?

రాణి: నాథా ఇది పెద్ద చిక్కే. ఏ మమ్మా, మీనాక్షీ, ఈ సుందరేశ్వరుడు వుండేదెక్కడ. ఈ వివాహం సంగతి ఆయనకు ఎలా తెలుస్తుంది.

మీనా: (కొంచం నవ్వి) ఆయన లేని చోటంటూ ఒకటి వుందటమ్మా మీ పిచ్చి గాని. ఆయనకు సమస్తమూ తెలుసు మీరు పెండ్లి కార్యాలు చేయించండి. ముహూర్తం పెట్టించండి. ఆ పార్వతీ దేవే ఆ వేళకు ఆయన్ని ఇక్కడికి ఆకర్షిస్తుంది.

రాజు: అయితే సరే. నా చిట్టి తల్లి వివాహం, ఎన్నడూ ఎక్కడా ఎవ్వరూ కనీ వినీ ఎరుగనంతటి వైభవంగా జరిపిస్తాను. ఎవరక్కడ.

(నేపథ్యంలోచిత్తం మహారాజా. ఏమి సెలవు. అని జవాబు.)

రాజు: మంత్రిగారిని వెంటనే రమ్మంటున్నానని చెప్పు.

(నేపథ్యంలో చిత్తం అని జవాబు.)

----- ----- ----- -----

అక్క: అవిధంగా మీనాక్షి సుందరేశ్వరుల వివాహం నిశ్చయమైంది, చెల్లీ పెండ్లికి పాండ్యరాజు చాలా పెద్దయెత్తున ప్రయత్నాలు చేశాడు. నానా దేశాల రాజులకూ ఆహ్వానాలు పంపించాడు. ఆకాశమంత పందిరీ, భూదేవంత అరుగూ, వేయించాడు. సువారంలో తయారు చేయించిన పదార్థాలకు మితి అంటూ లేదు. అన్నపు కొండలు, ఆజ్యపునదులు, పప్పుల తిప్పలు, అనంతంగా

వెలిశాయంటే అందులో అతిశయోక్తిలేదు, చెల్లీ ఇక పిండివంటలు.

చెల్లి: ఆ పిండి వంటల గురించి చెప్పక్కా.

అక్క: ఓహో నీకు పిండి వంటలంటే యిష్టంకదూ. కాని ఇవి విని ఆనందించదగ్గవే కాని తిని ఆనందించదగ్గవి కాదమ్మా. బూరెలు, గారెలు, సున్నుండలు, మణుగుబువ్వులు, లడ్లు, పేణీలు, కాజాలు, అరిసెలు, బొబ్బట్లు-

చెల్లి: ఇక చాల్లే అక్కా. విన్న కొద్దీ నోరు ఒకటే వూరుతున్నది.

అక్క: అన్నీ రాసులు రాసులు పోయించాడు. చూస్తూ ఉండగానే వివాహ లగ్నం ఆసన్నమయింది. ఆ వేళకు కొంచం ముందుగానే మగ పెండ్లి వారు తర్లి వచ్చారు.

చెల్లి: అబ్బో, ఎన్ని రథాలమీద, ఎన్ని ఏనుగులమీద, ఎన్ని గుర్రాలమీద, ఎంత మంది వచ్చారో.

అక్క: అదేమీ లేదమ్మా ఇద్దరంటే ఇద్దరే, మళ్ళీ మాట్లాడితే ఒక పెద్దవాడూ, ఒక కుర్రవాడూ, వెరసి ఒకటిన్నర మనుష్యులు, కాలినడకన చక్కా వచ్చారు.

చెల్లి: వాళ్ళని చూచి పాండ్య రాజు ఉత్సాహమంతా చప్పబడివుండాల్నే. ఇదేమిటక్కా ఈ అన్యాయం.

----- ----- ----- -----

రాజు: దేవీ ఏమిటీ అన్యాయం? నా మనస్సు క్రుంగిపోయింది. నడుము విరిగినట్లయింది. ఇంత దిక్కూ దివాణం లేని వాళ్ళా ఈ మగ పెళ్ళివారు.

రాణి: నాథా నాకిదంతా ఏమిటో అయోమయంగా వుంది. అయినా వెనక ఇంకా వస్తున్నారేమో. ఆ పెద్దాయన్ను కనుక్కోండి. సంగతి

సందర్భాలు తెలియవచ్చు.

రాజు: దేవీ ఆయన్ను పరకాయించి చూచావా. ముమ్మూర్తులా మన అమ్మాయి చూపించిన చిత్రపటం, పోలికే, అయినా అడిగి చూస్తాను. - ఏమయ్యా ఒకటిన్నర మనుషులా వచ్చింది. మీ పరివారమంతా ఏదీ. వెనక వస్తూ వుందా.?

సుందరేశ్వరుడు: రాజా రావసిన వారంతా వచ్చేశారు. ఇక రావలసిన వాళ్ళెవరూ లేరు. నేను పెండ్లికొడుకుని! ఈ కుర్రాడు--

కుండోదరుడు: నేను తోటి పెండ్లికొడుకుని.

సుంద: వీడి పేరు కుండోదరుడు.

రాజు: వంట కుండ వంటి ఆ కడుపు చూస్తేనే తెలుస్తూ వుంది ఆసంగతి. అయితే నీ కెవ్వరూ లేరా నాయనా.

సుంద: రాజా నేనెల్లప్పుడూ ఒంటరి వాణ్ణే. నాకు ఎవ్వరూ లేరు. కాని నేనందరికీ వున్నాను. నేనొక్కణ్ని వస్తే చరాచరమైన ప్రపంచమంతా నాతో కదలి వచ్చినట్లేనయ్యా.

రాజు: అబ్బో, మెట్టవేదాంతం చాలా నేర్చావే. నీ రాజ్యం ఎక్కడ నాయనా.

సుంద: నా రాజ్యం ఇదుగో ఇక్కడ వున్నదని ఎలా చెప్పను? నేనెక్కడ వుంటే అదే నా రాజ్యం.

రాజు: చూచావా దేవీ పెండ్లి ఇంకా కానన్నా కాలేదు. అల్లుడుగారు మన రాజ్యాని కప్పుడే ఎత్తువేశారు.

రాణి: మనకున్నది ఒక్కతే ఒక్క కూతురు. ఆమేమో ఈయన్ను వరించింది. మన రాజ్యం ఈయంది కాకుండా ఎలా పోతుంది.

సుంద: అత్తగారు చాలా సమంజసంగా చెప్పారు.

రాజు: అత్తకు అల్లుడి ఆశ అని వూరికే అన్నారా? కానీ నాయనా సుందరేశ్వరా. ఒకసారి నలువైపులా కలయచూడు, ఈ వివాహానికి నేనెంత ప్రయత్నం చేశానో. ఈ సంభారాలన్నీ ఏమి కావాలయ్యా. పెండ్లికని వచ్చిన ఈ రాజలోకం ముందు నన్నిలా నవ్వులపాలు చేస్తావా. నా మర్యాద కాస్తా ఇలా మంటకలుపుతావా. నేనేమి అపకారం చేశానయ్యా. ఇక నేను నలుగురిలో తలయెత్తుకు తిరగగలనా.

సుంద: (నవ్వి) మామగారూ మీరు చేయించిన పదార్థాలకు ఎలాటి సేగీ ఉండదు. అన్నీ సలక్షణంగా వినియోగమవుతాయి. విచారించకండి.--

కుం: (సుందరేశ్వరుడితో) ఆకలి ఆకలి, పట్టలేనంత ఆకలి. ఈ ఆకలికి తట్టుకోలేకుండా ఉన్నాను.

సుంద: పాపం, వీడు నాతో చాలా దురం నడిచాడు. వీడి కడుపు నకనకలాడుతూ వుంది. మామగారూ. తక్కిన సంగతులు తర్వాత చూచుకోవచ్చు, ముందు వీడికింత అన్నం పెట్టించండి.

రాణి: దానికేం భాగ్యం, నాయనా, అలాగే పెట్టిస్తాను. ఒసే, మాధవీ, మాలతీ, మదనికా, మకరందికా, ఎక్కడున్నారు. ఈ అబ్బాయికి వెంటనే వడ్డన చేయండి. (కుండోదరుడు పెట్టిన వన్నీ తినేస్తూ ఇంకా, ఇంకా అని మాటిమాటికీ అరుస్తూ ఉంటాడు. కొంత సేపయింతర్వాత అయ్యో అన్నపు రాసులన్నీ చెల్లుకున్నాయి. నేతి నదులన్నీ వట్టిపోయాయి. పరమాన్నపు గంగాళాలన్నీ ఖాళీ, పిండి వంటలన్నీ ఆఖరు అని వివిధ కంఠాలతో విన వస్తూ ఉంది. చివరకు అమ్మా సువారమంతా శూన్యమై పోయింది. ఒక అన్నపు మెతుకు కూడా మిగల్లేదు. అని వినవస్తుంది.)

రాజు: ఏమి ఏమిటీ విపరీతం? వీడు మానవుడా దానవుడా.

కుం: రాజా నీవు పెట్టిన అన్నం నాకొక్కడికే పంటికిందికి రాలేదు. ఏమి పెళ్ళి భోజనమయ్యా ఇది.

సుంద: మామగారూ! వీడి కడుపు వంట కుండలాగా ఉందని ఎగతాళి - చేశారే అది వంట కుండ కాదు నిప్పుల గుండం. ఆకలి మంటలు అందులో వేయి ముఖాలుగా లేచాయి.

రాణి: ఇదంతా అల్లుడిగారి నాటకం లాగుందండీ. చూస్తేను.

రాజు: అయితే కావచ్చు. అబ్బాయీ. ఒక్క క్షణం ఓపిక పట్టు.

కుం: రాజా వేళాపాళా లేకుండా పెట్టినప్పుడల్లా తినేవాణ్ణి కాదు. ఈరోజు కిక ఇంతే. (సుందరేశ్వరుడితో) తండ్రీ దాహం దాహం, నాలుక పిడచ కట్టింది.

సుంద: మామగారూ, ఒకటిన్నర మనుషులం వచ్చామని ఈసడించారు. చేసిన పదార్థాలన్నీ ఏమై పోవాలని నిందించారు. నా పరివారమంతా వస్తే ఏం చేసి వుండేవారో, ఈ కుర్రవాడి కొక్కడికే కడుపు నిండా తిండి పెట్టలేక పోయారు. వీడి దాహమన్నా తీర్చండిప్పుడు.

రాజు: అదేమంత భాగ్యం నాయనా! ఒరే వీరసేనా, వీరబాహూ, వీరవర్మా, వీరకేసరీ, ఈ కుండోదరుడికి మంచి తీర్థం తీసుకు రండి.

( కుండోదరుడు నీరు ఒకటే తాగుతూ మధ్య మధ్య ఇంకా, ఇంకా అని అరుస్తూ ఉంటాడు. తరవాత, మహా ప్రభూ, నీటి గంగాళాలన్నీ ఖాళీ, పట్నంలోని బావులు, చెరువులు, దొనలు, సొనలు అన్నీ అడుగంటాయి. ఇంత మహా పట్నంలో త్రాగడానికి ఒక్క నీటి బొట్టు కూడా మిగలలేదు. అని పలువురి గొంతులు వినవస్తాయి.)

కుం: అయ్యో, ఈ రాజు నాదాహం కూడా తీర్చ లేకుండా వున్నాడు.

(సుందరేశ్వరుడితో) తండ్రీ ఇక నీవే నాకు దిక్కు.

సుంద: కుండోదరా భయంలేదు. నీ దాహం నిముషంలో తీరుస్తాను. ఇదిగో నా జటా జూటంలోని గంగలో ఒక పాయ, పట్టు! చెయ్యి పట్టు!

(పైనుంచి నీరు ధారగా పడుతున్న శబ్దం)

కుం: తండ్రీ ఇక చాలు! నీవు ప్రసాదించిన ఈ అమృతంతో కడుపు క్షణంలో నిండిపోయింది. దాహం తీరింది.

సుంద: రాజా ఎందుకలా దిగాలు పడి చూస్తావ్. నీనగరంలో నీటి చుక్క కూడా లేకుండా పోయెనని బెంగపెట్టుకున్నావా? దిగులు పడకు. ఈ కుండోదరుడు చెయ్యిపట్టగా అవతరించిన గంగ, వైగై నదియై ప్రవహిస్తూ ఉన్నది. చూడు.

( నది ప్రవహిస్తున్న శబ్దం )

రాజు: మహాదేవా లోకేశ్వరా, జగద్రక్షకా, అజ్ఞానుణ్ని నాతప్పు మన్నించు.

సుంద: తప్పు చేసింది మీరు కాదు. మీ కుమార్తె మీనాక్షి. ఆమెకేశిక్ష. ఏదీ మీనాక్షి ?

( మీనాక్షి వస్తుంది )

సుంద: ప్రియతమా పార్వతీ! నన్ను ఒంటరిగా వదలివచ్చి ఇక్కడ ఈ మీనాక్షీ రూపంలో దాక్కున్నావు. ఈ తప్పు చాలదూ. నీ విరహంతో పరితపించి పరితపించి నేను సుందరేశ్వరుణ్ణై చక్కా వచ్చాను. నీకోసం.

మీనా: అవునవును, దేవరవారు సపత్నీ సమేతంగా వచ్చిన సంగతి తెలుస్తూనే వుంది.

సుంద: అప్పుడే ఈర్ష్య పడతావెందుకు, పార్వతీ. ఆది దంపతులమైన మన ప్రేమ అవిచ్ఛిన్నమైంది. జగత్కల్యాణం కోసం మనమిక్కడ మీనాక్షీ సుందరేశ్వరులుగా వెలయబోతున్నాం. గంగకూడా లోక కళ్యాణార్థమే ఇక్కడ వైగైనదిగా వెలిసింది. మీనా. ఈ చేయి పట్టుకో--- మీనాక్షీ సుందరేశ్వరుల చేతులు కలుస్తాయి.

(అయం ముహూర్తస్సుముహూర్తోస్తు. అని వినబడుతుంది.)

రాజు: ధన్యోస్మి. ధన్యోస్మి.

రాణి: నా జన్మ తరించింది.

----- ----- -----

అక్క: ఇదమ్మా మీనాక్షీ సుందరేశ్వరుల కళ్యాణ గాథ.

చెల్లి: ఎంత బాగుందక్కా, ఈకథ. అయితే పార్వతీ దేవే మీనాక్షిగా పాండ్యరాజుకు పుట్టిందన్నమాట. ఆ కుండోదరుడెవరక్కా.

అక్క: వాడొక రాక్షసుడు చెల్లీ పరమేశ్వరుడు ఆడిన నాటకంలో ప్రముఖ పాత్ర వహించాడు.

చెల్లి: పరమేశ్వరుని నిరంతర విలాసలీలలయిన ఈ జగన్నాటకంలో మనమంతా పాత్రలమే గదక్కా. ఇక వెళ్లి మీనాక్షీ దేవి దర్శనం చేసుకుందాం. ఆలయం ఎక్కడుందో.

అక్క: మీనాక్షీసుందరేశ్వరుల ఆలయం మదురై నగరం మధ్యలో ఉంది. దాని నుండి నాలుగు రాజమార్గాలు నాలుగు దిక్కులకూ తీర్చి దిద్దబడి వున్నాయి. అందుకని ఏ మార్గాన వెళ్ళినా ఆలయం చేరతాం పద, పోదాం.

(కొంచం విరామం.)

చెల్లి: అక్కా అక్కా ఏమి ఈ ఆలయం సౌందర్యం. ఇది మహా మేరువంత ఎత్తుగాను, కుబేర భవనమంత వైభవంగానూ వుంది. దీనికి ఎన్ని గోపురాలక్కా?

అక్క: దీనికి తొమ్మిది గోపురాలు చెల్లీ. అందులో పెద్దది 150 అడుగుల ఎత్తు. ఆ గోపురాలన్నీ అద్భుత శిల్పకళతో ఎంత అందంగా వున్నాయో చూడు!

చెల్లి: వీటిని ఎంత చూచినా తనివితీరడం లేదక్కా.

అక్క: ప్రాకారం లోపల ఇంకా అందంగా వుంటుంది. లోపలికి పోదాం.

చెల్లి: ఈ మండపం చూడక్కా. ఇదేమిది. దీనికి లెక్కలేనన్ని స్తంభాలున్నట్టున్నాయి.

అక్క: అవును చెల్లీ. ఇది సహస్రస్తంభమండపం. ఒక్కొక్క స్తంభం ఒక్కొక్క రాతితో మలిచారు. ఈ స్తంభాలమీద బొమ్మలు చూచావా. ఎంత రమణీయంగా ఉన్నయో.

చెల్లి: ఈ ఆలయమంతా ఏదో పెద్ద వివాహ మండపం లాగా కనబడుతున్నదేమక్కా.

అక్క: మీనాక్షీసుందరేశ్వరుల వివాహం ఇక్కడే కదే జరిగింది. అందుకు ఈ దేవాలయం కళ్యాణమండపం తీరుగా నిర్మించబడింది.

చెల్లి: ఈ దేవాలయం ఎవరు నిర్మించారక్కా.

అక్క: ఆదిలో ఎవరు కట్టించారో స్పష్టంగా తెలియదు. కాని 16వ శతాబ్దిలో మధురలో నాయక రాజ్యం ఏర్పడింది. దాని స్థాపకుడు విశ్వనాథనాయకుని మంత్రి ఆర్యనాయకముదలి, సహస్రస్తంభమండపం కట్టించాడు. విశ్వనాథనాయకుని తర్వాత రాజ్యానికి వచ్చిన తిరుమల నాయకుడు ఇప్పుడుండే ఆలయంలో ఎక్కువ భాగం నిర్మించాడు.

చెల్లి: ఇక లోపలికి పోయి దేవీ దర్శనం చేసుకుందాంమక్కా.

అక్క: సరే పద.

(ఆలయ ఘంటానాదాలు, అర్చకుల మంత్రోచ్చారణ)

చెల్లి: అక్కా. అక్కా. దేనికి మీనాక్షి అని ఎందుకు పేరు పెట్టారో ఇప్పుడు తెలిసింది. ఆమె కండ్లు చూడక్కా. బేడిస మీలతళుకు బెళుకులన్నీ ఆ కండ్లలో దోబూచులాడుతున్నాయి.

అక్క: మీనాక్షీ దేవి దర్శనం వల్ల మన జన్మలు పావనమైనాయి చెల్లీ. నా మనసు ఏదో దివ్యలోకంలో విహరిస్తున్నట్లుంది.

(పావన మధురా నిలయే, పాండ్యరాజతనయే.. అనే కీర్తన ఎత్తుకుంటుంది. చెల్లి గొంతు కలుపుతుంది. కీర్తన ముగిసిన తర్వాత ఆలయ ఘంటా నినాదాల మధ్య)

అక్క,చెల్లి: జగజ్జననీ మీనాక్షీ దేవీ మమ్మల్ని అనుగ్రహించు తల్లీ.

(ప్రసారం తేది 7-3-62)

------ 0 ------

# కన్యాకుమారి

పాత్రలు:

1. అక్క
2. చెల్లెలు
3. భూదేవి.
4. బ్రహ్మ.
5. విష్ణువు.
6. పరమశివుడు
7. కన్యాకుమారి
8. వాణాసురుడు

(సముద్రతరంగాలు ఒడ్డును తాకి విరిగే శబ్దం)

అక్క. అమ్మయ్యా. ఎలాగైతేనేం చివరకు మన గమ్యస్థానమైన ఈ కన్యాకుమారి అగ్రం చేరుకున్నాం. ఇక్కడ ప్రకృతి ఎంత శోభాయమానంగా ఉందో చూచావా, చెల్లీ?

చెల్లి. ఇక్కడ వీచే ఈ చల్లని గాలి మార్గాయాసాన్ని పోగొట్టి మనస్సుకు ఉల్లాసం కలిగిస్తున్నదక్కా. కాని ఇవేమిటి ఈ అలలు ఇంత యెత్తున లేచి ఒడ్డుమీద విరుచుకు పడుతున్నాయి. ఇవి మనమీద విరుచుకు పడవుగదా. వీటిని చూస్తుంటే నాకేమో భయంగా వుందక్కా.

అక్క. భయమెందుకే పిచ్చిపిల్లా అవి అంత యెత్తున లేచినా మనల్నేమీ చెయ్యవు. ఈ కన్యాకుమారి అగ్రం మనదేశానికి దక్షిణపు కొనగదూ. మనదేశానికి తూర్పున ఉండే బంగాళాఖాతమూ, పశ్చిమాన ఉండే అరేబియా సముద్రము, దక్షిణాన ఉండే హిందూ మహాసముద్రమూ ఈ మూడు మహాజల నిధులూ ఇక్కడ కలిసి పోతున్నాయి. అందువల్లనే ఇక్కడ అలలు దాదాపు నూరడుగుల యెత్తున లేచి పడుతుంటాయి.

చెల్లి. ఈ అలలు విరగడంలో పుట్టిన తెల్లటి నురుగు సూర్యకాంతిలో మిలామిలా మెరుస్తూ ఎంత అందంగా వుందో చూచావా అక్కా?

అక్క. రాత్రిళ్ళు చంద్రకాంతిలో అది ఇంకా అందంగా వుంటుంది చెల్లీ.

చెల్లి. ఇక్కడ సూర్యోదయం, సూర్యాస్తమయం చూడముచ్చటగా వుంటాయంటారు కదక్కా?

అక్క. అవును చెల్లీ. ఈ ప్రకృతి శోభ మరెక్కడా మనం చూడం. ఇంకొక విశేషం కూడా ఉందిక్కడ.

చెల్లి. ఏమిటక్కా, అది?

అక్క. చైత్ర పూర్ణిమనాడు పడమట అరేబియా సముద్రంలో సూర్యాస్తమయం తూర్పున బంగాళాఖాతంలో పూర్ణ చంద్రోదయం, రెండూ ఇక్కడ ఒకేసారి కన్నుల పండువుగా చూడవచ్చు. ఆ మనోహరదృశ్యం ప్రపంచంలో మరెక్కడా కానరాదు.

చెల్లి. బాగుంది. ఇక్కడ ఈ ఇసక చూచావా అక్కా. తెల్లగా బియ్యపుగింజల్లా మెరిసిపోతున్నాయేమిటి, ఈ ఇసకరేణువులు?

అక్క. మంచిసంగతి జ్ఞప్తికి తెచ్చావు చెల్లీ, ఇక్కడ వెలసిన ఈ పరాశక్తి కన్యాకుమారి, చరిత్రంతా ఈ ఇసకరేణువుల వెనుక దాక్కొని ఉందమ్మా.

చెల్లి. చెప్పక్కా ఆకథేమిటో చెప్పు. వినాలని చాలా కుతూహలంగా వుంది.

అక్క. అయితే చెబుతావిను. శోణితపురంలో వాణాసురుడు అనే రాక్షసుడు రాజ్యం చేస్తున్నాడు.

చెల్లి. శోణితపురమా? వాణాసురుడా? ఆ బాణాసురుడుకి ఏమౌతాడో ఈ వాణాసురుడు?

అక్క. ఈ రాక్షసులంతా ఒకటే కోవకు చెందిన వాళ్ళులే, చెల్లీ. వాడు కఠిన తపస్సుచేత బ్రహ్మను మెప్పించి అమరత్వం సిద్ధింపచేసుకున్నాడు. వరగర్వంచేత వాడి ఆగడాలకు అంతంటూ లేకుండాపోయింది. దేవతలను మునులను నరులను నానాహింసలూ పెట్టడం మొదలెట్టాడు. కనపడ్డ స్త్రీలనెల్లా చెరబట్టేవాడు. భూమిలో ధర్మం అడుగంటి అధర్మం బలిసిపోయింది. తన బిడ్డల బాధలు చూడలేక భూదేవి క్రుంగి కృశించి దీనికంతా కారకుడైన ఆ బ్రహ్మ వద్దకు పరిగెత్తింది.

(ఒక పెద్ద పదార్థం గాలిలో విసురుగా దూసుకుపోయిన చప్పుడు.)

(వీణ)

బ్రహ్మ. అమ్మా భూదేవి. ఏమమ్మా ఇలా హడావిడిగా పరిగెత్తుకుంటూ వచ్చావ్.

భూదేవి. నాయనా. బ్రహ్మదేవా నీ నిర్వాహకానికి నిన్ను అభినందించి పోదామని వచ్చానయ్యా!

బ్రహ్మ. నా జనకుడైన శ్రీమన్నారాయణుని వలపుల దీవివి. నాకు తల్లివి. నీవు అనావచ్చు, నేను పడావచ్చు. కాని-నేనేం కానిపని చేశానమ్మా?

భూదేవి. ఇంతకంటే ఇంకా ఏంచెయ్యాలయ్యా. ఆరాక్షసులు నిన్ను గూర్చి కఠోరతపస్సు చేస్తారు. దానికి ఉబ్బితబ్బిబ్బై వాళ్ళకు అసాధ్యములైన వరాలు ప్రసాదిస్తావు. అది మాకు ప్రాణకంటకమై కూర్చుంటుంది.

బ్రహ్మ. వాళ్ళ తపోదీక్ష అలాటిదమ్మా. దానికి ఏ దేవుడైనా తల ఒగ్గి తీరవలసిందే. అయితే ఇప్పుడు ఏ రాక్షసుడి వల్ల లోకాలకు బాధాకరంగా వుందంటావ్?

భూదే. వాడు లేడూ, ఆ వాణాసురుడు! వాడికేమో నీవు అమరత్వం సిద్ధింపజేస్తివి. ఆ వరగర్వంతో వాడికి కన్నూ మిన్నూ కనపడటంలేదు. ముల్లోకాలనూ గగ్గోలు పరుస్తున్నాడు. వాడి బాధలకు తట్టుకోలేక నా బిడ్డలు అలమటించి పోతున్నారు. ఈ శోకంతో నాశక్తి అంతా ఉడిగిపోయింది. చూడు, నేనెలా ఉన్నానో.

బ్రహ్మ. అమ్మా నావల్ల మహాపచారమే జరిగింది. వాడికి నేనిచ్చిన వరం అసాధ్యమైందే. ఈ చరాచర ప్రపంచంలో వాడికి మిత్తి కాగల శక్తి నా మనో దృష్టికి ఎక్కడా తగలడంలేదు.

భూదే. అయితే ఇక నాగతి నిర్గతేనంటావా, నాయనా?

బ్రహ్మ. నా కొక్కటే మార్గం కనబడుతున్నదమ్మా.

భూదేవి. ఏమిటది, తండ్రీ?

బ్రహ్మ. జగద్రక్షకుడైన ఆ శ్రీమన్నారాయణమూర్తే ఇక నీకూ నాకూ దిక్కు. ఈ ఆపదనుంచి మనల్ని తప్పించ గలిగింది ఆ. వైకుంఠధాముడొక్కడే.

భూదేవి. బాగా చెప్పావ్ కొడుకులు చేసే తప్పుల్ని తండ్రులేగా సరిదిద్దాల్సింది. ఆ వైకుంఠానికే పోదాంపద. నా నాథుని దివ్యమంగళ విగ్రహం మళ్ళీ ఇంకొకసారి తనివిదీరా చూచి కృతార్థురాలినవుతాను.

(విమాన ప్రయాణధ్వని)

--- వీణ ---

బ్రహ్మ. తండ్రీ నమస్కారం.

భూదేవి. నాథా నమస్కారం.

విష్ణువు. చిరంజీవ సుఖీభవ నాయనా నీ సృష్టికార్యం నిరంతరాయంగా సాగుతున్నదికదా! ఏం ప్రేయసీ అలా చిక్కిపోయావ్?

భూదేవి. ప్రాణనాథులు నన్ను మరిచిపోయినట్లున్నారు?

విష్ణువు: ఎంత మాట నిన్ను మేము మరిచిపోవడమే. అలనాడు ఆదివరాహమూర్తినై నిన్ను కొమ్మున ఎత్తినప్పుడు నీ స్పర్శ సుఖంవల్ల నా దేహాన పుట్టిన పులకలు ఇవిగో ఇంకా అలాగే వున్నాయ్, చూచావా.

భూదేవి: ధన్యురాల్ని

విష్ణువు: అయితే నీ కిప్పుడేమిటి బాధ. నీవిలా ఎందుకు చిక్కి సగమై పోయావ్?

భూ: దేవరవారి ముందు నా కష్టాలు చెప్పుకోవడానికి నోరు రావడం లేదు. మీ కుమారరత్నాన్నే అడగండి సవిస్తరంగా చెబుతాడు.

వి: ఏమిటి బ్రహ్మదేవా.

బ్రహ్మ: దేవర దివ్య చిత్తానికి ఆకళింపుకు రాని విషాయాలేముంటాయ్. ఇదంతా నా అపరాధమే అంటుంది భూదేవి.

వి: అయినా అడిగిన వెంటనే వరాలివ్వడంలో నీకంత మైమరుపు పనికిరాదు, నాయనా, అందరు రాక్షసులకూ వరాలిచ్చినట్లే ఆ వాణాసురుడికీ వరమిచ్చావ్ అంతేనా.

బ్రహ్మ: అంతే తండ్రీ.

వి: మంచిపని చేసావ్. నీ విచ్చిన ఆ అమరత్వంలో ఇదివరకటిలాగా ఏమైనా సందు ఉంచావా లేదా.

బ్రహ్మ: అక్కడే ఈ సారి పొరపాటు జరిగినట్లుంది. ఎంత ఆలోచించినా నేనిచ్చిన వరంలో సూది మొనంత సందు కూడా వున్నట్లు తోచడం లేదు.

వి: ఊర్ధ్వలోకాల్లోనూ, అధోలోకాల్లోనూ, వుండేవాళ్ళందరి చేతా చావు లేకుండా వుండాలని వాడు తప్పకుండా కోరుకునే వుంటాడు. కాని ఈ రాక్షసులకు నరులంటే ఎందుకూ పనికి రాని వాళ్ళనే అభిప్రాయం సాధారణంగా వుంటుంది.

బ్రహ్మ: అదేం లాభం లేదు తండ్రీ. తనవరంలో వాడు నరులను వదిలి పెట్టలేదు.

వి: నారీ వర్గాన్ని కూడా వదిలిపెట్టలేదా.

బ్రహ్మ: లేదు. ప్రపంచంలో ఏ సతి వల్ల కూడా తనకు చావు లేకుండా వుండాలని కోరుకున్నాడు.

వి: సతి! ఆఁ దొరికింది సందు! మహా శక్తిమంతురాలైన ఒక కన్యను చూడండి. ఆమె చేతిలో వీడు తప్పకుండా మరణిస్తాడు.

భూదేవి: కన్యాన్వేషణలో నాథులది అందెవేసిన చెయ్యిగదా ఆ పుణ్యం కూడా మీరే కట్టుకోండి.

వి: ఇంత విచారంలోనూ నీ చమత్కారం పోనిచ్చావు కాదు గదా దేవీ. అయితే చెబుతాను వినండి. ముక్కోటి దేవతలూ కలిసి తమతమ శక్తులను హోమకుండంలో ఆహుతి చేస్తూ పరాశక్తిని గురించి ఒక మహాయాగం చెయ్యాలి. అప్పుడు ఆ చిదగ్నికుండం నుంచి పరాశక్తి పదహారేండ్ల కన్యగా ఉద్భవిస్తుంది. ఆ కన్యాకుమారే వాణాసురుణ్ణి సంహరించాలి. వింటున్నావా బ్రహ్మదేవా.

బ్రహ్మ: చిత్తం. ఇక మాకు సెలవిప్పించండి: నేను పోయి ఇంద్రాది దేవతలను యాగానికి సన్నద్ధులను చేస్తాను.

భూదేవి: నాథుని ఆఖరు వాక్యంలోని భావం నీవు పూర్తిగా గ్రహించినట్లు లేదు, నాయనా! వాణాసుర సంహారం జరగాలంటే ఆమె కన్యాత్వానికి ఎంత మాత్రం భంగం జరగ కూడదంటున్నారు నాథులు.

బ్రహ్మ: ఆమె కన్యాత్వానికి విఘాతం కలిగితే ఒక్క పరమశివుడివల్లనే కలగాలి. ఇది గట్టి చిక్కేనే. తండ్రీ ఆ పరమశివుణ్ణి వారించడం ఎవరికి సాధ్యమౌతుంది.

వి: ఉపాయశాలికి అసాధ్యమంటూ వుంటుందటోయ్. అవసరమైతే ఇందుకు నీ కుమారుణ్ని వినియోగించుకో. ఆ త్రిలోకసంచారి,

కలహభోజనుడు, నారదుడు, ఇందుకు బాగా పనికివస్తాడు. మీ కార్యం సానుకూలమైనట్లే, ఇక వెళ్ళిరండి.

---- వీణ ----

అక్క: అలా అవతరించింది కన్యాకుమారి.

చెల్లి: అప్పుడామె ఎలా వుందక్కా ?

అక్క: అప్పటి ఆమె శోభను ఎలా వర్ణించను చెల్లీ? ముక్కోటిదేవతల శక్తులనూ కూడగట్టుకుని పుట్టిందిగదా ఆమె. ఆమె వదనం బాలార్కమండలంవలె భాసించింది. ఆమె ప్రతి అవయవంలోనూ యౌవనారంభశోభలు వెల్లివిరిశాయి. ఆ జ్యోతిస్వరూపిణి ధగద్ధగాయమానంగా వెలిగిపోయింది.

చెల్లి: ఎంత అద్భుతమైన దృశ్యమక్కా అది? అప్పుడామె ఏమి చేసింది?

అక్క: సరాసరి మనదేశం యొక్క ఈ దక్షిణపుకొనకు వచ్చింది. వచ్చి ఇక్కడ తపస్సుకు పూనుకున్నది.

చెల్లి: ఆ సర్వశక్తిమంతురాలికి ఇంకా తపస్సెందుకక్కా ?

అక్క: వాణాసురుణ్ణి సంహరించడం సామాన్యమనుకున్నావా చెల్లీ. ఆ మహాకార్యంకోసం సర్వశక్తులనూ సమీకరించి దృఢతరం చేసుకోడానికే ఆ తపస్సు.

చెల్లి: ఆ పరాశక్తీ ఆ పరమేశ్వరుడూ ఆది దంపతులు గదా, కల్పకల్పాల నుంచీ జంట బాయకుండా ఏకశరీరంగా వున్నారు గదా, ఇప్పుడీ వైపరీత్యానికి ఆ పరమశివుడు ఎంత క్రుంగిపోయాడో.

అక్క: క్రుంగిపోవడమేమిటి. ఆయనకు పిచ్చిపట్టినట్లయింది. పరాశక్తి

జంటలేనికాలం నిమిషమొక యుగంగా వున్నట్లుందాయనకు. ఇక వంటరిగా కైలాసంలో వుండలేక పోయాడు. అమ్మవారిని వెదుక్కుంటూ బయలుదేరాడు.

చెల్లి: అనుకున్నంతా అయిందీ? అయితే మరి దేవకార్యానికి విఘాతం వచ్చిందన్నమాటే.

అక్క: అంతసులభంగానా? అక్కడ శ్రీమన్నారాయణమూర్తి సంకల్ప బలం, ఇక్కడ కన్యాకుమారి అచంచలదీక్షా, వృధా అవుతా యనుకున్నావా, చెల్లీ? పరమేశ్వరుడలా బయలుదేరిన వార్త వింటూనే నారదుడు ఇలా అమ్మవారి దగ్గరికి పరిగెత్తుకుంటూ వచ్చాడు.

చెల్లి: వచ్చి ఏం చేశాడక్కా?

అక్క: ఈ బెడదనుంచి తప్పించుకోడానికి అమ్మవారికి ఒక ఉపాయం చెప్పాడు.

చెల్లి: ఏమిటక్కా, అది?

అక్క: తినబోతూ రుచులడగడ మెందుకు చెల్లీ? అదేమిటో అమ్మవారి నోటనే విందువుగాని, అడుగో పరమశివుడు, అమ్మవారి వద్దకు చేరుకున్నాడు.

--- వీణ ---

పరమశివుడు: అమ్మదొంగా, నన్ను నిష్కారణంగా వదిలేసి వచ్చి చిన్నపిల్లవై ఇక్కడ కూర్చున్నావా దేవీ! నీకోసం నేను ఎంత తపించిపోయాననుకున్నావ్!

కన్యాకుమారి: నేను వూరికే వుబుసుపోకకు ఇలా రాలేదు, స్వామీ, ఒక మహాకార్యనిర్వహణార్థమై కన్యగా అవతరించి ఇక్కడ తపోదీక్షలో

వున్నాను.

పరమ: ఈ కన్యావేషం ఎంత మహామోహనంగా వుంది, దేవీ, అనంత కల్పాంతరాలనుంచీ అవిచ్ఛిన్నంగా సాగివస్తున్న మన దివ్య దాంపత్య జీవితంలో ఇలాటి ముగ్ధమోహన సౌందర్యమూర్తిని నేనెన్నడూ దర్శించలేదు. పదహారేండ్ల కుసుమకోమలిని నిన్ను చూస్తుంటే నా ప్రణయం కట్టలు తెంచుకుని ప్రవహిస్తున్నది.

కన్యా: అంతమాట సెలవీయవద్దు స్వామీ, నా కార్యదీక్షనుంచి నన్ను మరల్చడానికి ప్రయత్నించకండి, మీకు పుణ్యం వుంటుంది.

పరమ: ఏమిటామహాకార్యం?

కన్యా: సర్వజ్ఞులు, మీ దివ్యదృష్టికి అదిగోచరం కాకుండా వుందా?

పరమ: ఓహో! వాణాసురసంహారమా? అబలవు, నీ కంతశ్రమ యెందుకు దేవీ? నేనున్నాగా వాడి సంగతి తర్వాత చూడవచ్చునుగాని ముందు ఇప్పుడు నన్ను వెంటనే వివాహమాడు. అలనాడు సతీదేవిగా, తరువాత పార్వతీదేవిగా, ఇంకా ఈ అనంతకాలంలో నీతోనైన వివాహాలన్నిటికంటే ఈ మనవివాహం పరమ రమణీయమై భాసిస్తుంది. ఏమంటావ్?

కన్యా: పూర్వ మధురస్మృతులన్నీ జ్ఞాపకానికి తెచ్చి నా మనస్సును విచలితం చెయ్యడానికి చూస్తున్నారా, స్వామీ? అదేమీ కుదరదు. ఈ అవతారంలో మీరు మీరే, నేను నేనే. మన సంయోగం సాధ్యం కాదు. నన్నిలా వదిలెయ్యండి.

పరమ: సృష్టి స్థితిలయాలకు కారణభూతమై అనంతంగా సాగివస్తున్న ఈ ప్రకృతి పురుషుల లీలా విలాసాన్ని ఒక్క క్షణమైనా కాదనడానికి నీ కేమధికారముంది? నిన్ను విడిచి నేను ఒక్క నిమిషం కూడా వుండలేను. మన వివాహం ఇప్పుడు జరిగి తీరవలసిందే. వివాహానికి అన్నీ సిద్ధం చేసుకునే వచ్చాను.

కన్యా: అయితే, నా యీ కన్యావ్రత భంగం ఇప్పుడు తప్పదంటారా?

పరమ: తప్పదు. నీవు నన్ను వివాహమాడి తీరవలసిందే. ఇది నా ఆజ్ఞ.

కన్యా: సరే. మీ యిష్టప్రకారమే కానివ్వండి. కాని నాదొకషరతు. దానికి మీరు అంగీకరించాలి.

పరమ: అలాగే. ఏమిటా షరతు?

కన్యా: కన్నులేని టెంకాయ, గణుపులేని చెరుకుగడ, ఈనెలేని తములపాకు, ఈ మూడూ తీసుకుని తెల్లవారుజామున కోడికూసే వేళకు ముందే మీరు తిరిగి రావాలి. అప్పుడు మన వివాహం జరుగుతుంది. ఈ మూటిలో ఏది లేకపోయినా, కోడికూసిన తర్వాత వచ్చినా, మన వివాహం జరగదు. ఇదీ షరతు.

పరమ: చాలా కఠినమైన షరతు పెట్టావే దేవీ. అయినా ఫరవాలేదు నేను తిరిగివచ్చేసరికి నీవు సిద్ధంగా వుండు.

కన్యా: నా మనస్సులో వున్న మీకోసం నేనెప్పుడూ సిద్ధమే, స్వామీ.

--- వీణ ---

చెల్లి: నారదుడు బలే వుపాయమే చెప్పాడక్కా, పరమశివుడైతే మాత్రం, ఆవస్తువులు ఎక్కడనుంచి తేగలడు?

అక్క: పరమేశ్వరుడికి సాధ్యం కానిదేముంటుది చెల్లీ? ఆయన ఆ మూడు వస్తువులూ సంపాదించాడు.

చెల్లి: ఆ! అయితే దేవకార్యం భంగమైనట్లేనా?

అక్క: నారదుడు ఉండగా అంతపని జరుగుతుందా? పరమేశ్వరుడు ఆ మూడు వస్తువులతో ఇక్కడికి 9 మైళ్ళదూరంలో వున్న శుచీంద్రం అనే చోటికి వచ్చేసరికి, కార్యం మించివచ్చిందని నారదుడికి

తొందర పుట్టింది. ఆ వంతున అతడు కోడ్లైకూశాడు. కోడికూత విన్న పరమేస్వరుడి గుండెలో బండపడ్డట్లయింది. ఇక వివాహం జరగదన్న నిర్వేదంతో ఆయన అలాగే స్తంభించి అక్కడే స్థాణుమూర్తి అయినాడు ఇక్కడ తలంబ్రాలకని తెచ్చిన బియ్యపుగింజలన్నీ చిందరవందరై ఇసక రేణువులుగా మారిపోయాయి. ఇదీ ఈ ఇసకపలుకుల వెనుక దాగివున్న కథ.

చెల్లి: అక్కా కథ పూర్తికా చెప్పకుండా తప్పించుకుందామనా, నీ యెత్తు? అదేమీ కుదరదు. తర్వాత వాణాసురుణ్ణి దేవి ఎలా సంహరించిందో అది కూడా చెప్పిందాకా నిన్ను వదలను.

అక్క: చెప్పేలోగానే ఏమిటా తొందర, చెల్లీ? వాణాసురుడి గూఢ చారులు ముల్లోకాలూ తిరుగుతుంటారు. వాళ్ళల్లో కొందరు ఇక్కడికి వచ్చి తపస్సులో వున్న కన్యాకుమారిని చూచారు. చూచి పోయి భువనమోహనమైన సౌందర్యాన్ని చిలవలు పలవలుగా వాణాసురుడికి వర్ణించి చెప్పారు. అది విన్న వాణాసురుడు కామాతురుడై ఉన్నవాడున్నట్లుగా లేచి దేవి వద్దకు దౌడు తీశాడు.

చెల్లి: ఎందుకో?

అక్క: ఇంకెందుకు చెల్లీ, కన్యాకుమారిని వివాహమాడేటందుకు.

చెల్లి: ఇంతలోనే మళ్లీ ఇంకొక వివాహ ప్రస్తావనా? ఈ మగవాళ్ళకు ఈ ప్రసక్తి తప్పితే ఇక రెండోపని లేనట్లుందే, కన్యలను వారిమానాన వాళ్ళను వుండనిచ్చేటట్లు లేదే వీళ్ళు.

అక్క: ఇదంతా ప్రకృతి పురుషుల లీలా విలాసమని ఆ పరమేస్వరుడే సెలవిచ్చాడుగా చెల్లీ! అయినా ఇది జరుగుతుందని ఏమి నమ్మకం? మంట మీదికి ఎగిరివచ్చే శలభమనుకో వాణాసురుడు।

---- వీణ ----

వాణాసురుడు: కన్యామణీ! నేను నీ కోసం వచ్చాను.

కన్యాకుమారి: ఎవరు నీవు? నాతో నీకేం పని?

వాణా: నేనెవరినో ఎరుగవా నీవు? ఈ ఏడేడు పధ్నాలుగు లోకాల్లో నన్నెరగని వాళ్ళేలేరే! నేను రాక్షసరాజును. ముల్లోకాలనూ గడ గడలాడించిన సాటిలేని పరాక్రమశాలిని. బ్రహ్మదేవుని వరంవల్ల తపస్సిద్ధి పొందిన అజేయుణ్ణి. నన్ను వాణాసురుడు అంటారు.

కన్యా: నీవు రాక్షసుడివని నీ మొగమే చెబుతున్నది. అజేయుణ్ణని విర్రవీగకు. తాడిని తన్నేవాడి తలదన్నేవాడుంటాడనే సంగతి గుర్తుంచుకో. ఏంకావాలి నీకు?

వాణా: అబ్బో! పిట్టకొంచెమైనా కూత ఘనంగనే వుందే! నాకు నీవే కావాలి.

కన్యా: బాగుంది వరస. నన్ను భరించగలవా నీవు?

వాణా: నీవు నా పిడికిటిలోనికి చాలవు, నాకొకలెక్కా నీవు? ప్రౌఢ నిర్భరవయఃపరిపాకంలో వున్న సుందరాంగుల్ని ఎంతమందినో చూచాను. కాని నీ ముగ్ధమోహన సౌందర్యం ముందు వాళ్ళంతా దిగదుడుపే. నిన్ను చూచినప్పటి నుంచీ కామదేవుడు వేయి బాణాలతో నన్ను వేధిస్తున్నాడు. నన్ను కరుణించు. నిన్ను పట్టపురాణిని చేస్తాను.

కన్యా: అహ్హాహ్హా! నన్ను వివాహం చేసుకుంటావా? అతిలోకవీరులైన వాళ్ళే అందుకు అర్హులు.

వాణా: నా కంటే వీరాధివీరుడు ఈ ప్రపంచంలో ఎవరున్నారు?

కన్యా: అయితే నాతో యుద్ధం చెయ్యి. గెలిస్తే అలాగే నన్ను వివాహమాడుదువుగాని.

వాణా: ఒక ఆడదానితో నన్ను యుద్ధం చెయ్యమంటావా?

కన్యా: సతులచేత గూడా చావులేకుండా బ్రహ్మచేత వరం పొందిన పరాక్రమశాలివి, ఈకన్యతో యుద్ధం చెయ్యలేవా?

వాణా: నీవాచాలత్వానికి హద్దులేకుండా వుందే. అయితేరా! యుద్ధంలో నిన్ను ఓడించే నీ కరగ్రహణం చేస్తాను.

(కత్తియుద్ధం జరిగిన ధ్వని - కొంచెంసేపు)

కన్యా: ఖడ్గయుద్ధం తెలిసిన వాడివేనే, ఏమోననుకున్నా! ఇదుగో కాచుకో, ఈ చక్రం నీ ప్రాణాలు బలిగొంటుంది.

(చక్రం విసిరిన చప్పుడు - వాణాసురుడు పడిపోయినచప్పుడు)

వాణా: (బాధతో మూలుగుతూ) అబ్బ! నా ప్రాణాలు ఎగిరిపోతున్నాయ్ మరణం ఆసన్నమైంది - ఈమె మరెవ్వరో కాదు, ఆ పరాశక్తి కన్యారూపంలో నన్ను నిర్జించింది. అమ్మా జగద్రక్షకీ నాకళ్ళు తెరుచుకున్నాయి నా అపచారాలన్నీ మన్నించి నాకు సద్గతి కలుగజెయ్. ఇదే నా అంతిమ ప్రార్దన.

కన్యా: నిన్ను మన్నించాను. నీకు అక్షయ పుణ్యలోక ప్రాప్తి కలుగుతుంది. ఇంతేకాదు, నీవు మరణించిన ఈ తీరప్రదేశంలో వాణాతీర్థమని ఒక తీర్థం వెలుస్తుంది. ఆషాఢ బహుళ అమావాస్యనాడు ఆ తీర్థంలో స్నానంచేసిన వాళ్ళకు గంగాస్నానఫలం లభిస్తుంది.

వాణా: ధన్యుణ్ణి తల్లీ, ధన్యుణ్ణి (మరణిస్తాడు)

---- వీణ ----

అక్క: ఆ విధంగా వాణాసుర సంహారం చేసి పరాశక్తి కన్యాకుమారిగా ఇక్కడే వెలిసింది. అందువల్లనే ఈ అగ్రానికి కన్యాకుమారి అగ్రమని పేరు వచ్చింది.

చెల్లి: ఈ కథ ఎంత బాగుందక్కా ఇక ఆలయం లోకి పోయి అమ్మవారి దర్శనం చేసుకుందామా?

అక్క: పద, పోదాం.

(ఆలయ ఘంటానినాదాల మధ్య ఈ శ్లోకం తాపీగా వినిపిస్తుం టుంది)

బాలార్క మండలాభాసాం
యౌవనారంభ శోభితాం
చిదగ్నికుండసంభూతాం
భావయే హృదిమందిరే.

చెల్లి: అమ్మవారి మూర్తి ఎంత దేదీప్యమానంగా వెలిగిపోతున్నదక్కా! కండ్లు మిరుమిట్లు గొలుపుతున్నాయ్.

అక్క: అది అమ్మవారి ఒంటిమీద ఉన్న నాగమణికాంతి చెల్లీ. అది లైట్‌హౌస్‌లోని దీపంవలె ప్రకాశిస్తుంటుంది. అందుకనే చూచావా, దాని కాంతికి నావికులు దిగ్భ్రాంతులు కాకుండా, తూర్పు దక్షిణ పడమటి ద్వారాలను ఉత్సవదినాల్లో తప్ప ఎప్పుడూ మూసేవుంచుతారు. ఈ ఆలయంలోకి మామూలుగా ఉత్తర ద్వారం గుండానే ప్రవేశం.

చెల్లి: దేవి తూర్పు ముఖమై నిల్చుని, పదహారేండ్ల బాలికవలె కనపడుతూ వుంది. ఈమె మూర్తి ఎంత సౌమ్యంగా వుందక్కా పరాశక్తి భయంకర స్వరూపిణి అంటారుగా?

అక్క: ఆమె దుష్టులకు అలాటిదే కాని భక్తులకు మాత్రం సుప్రసన్నాకృతి.

చెల్లి: భక్తి పారవశ్యంతో నా కళ్ళు మూతలు పడుతున్నాయక్కా.

(పాట - చెల్లి మొదలుపెడుతుంది - పాటముగిసిన తరువాత)

అక్క: జగద్రక్షకీ. చిదగ్నికుండసంభూతా కన్యాకుమారీ మమ్మల్ని కరుణించు తల్లీ.

(ఆలయఘంటానినాదాల మధ్య పై శ్లోకం మొదలై రెండవ పాదంతో ముగుస్తుంది.)

(ప్రసారం తేది 5-2-62.)

----- 0 -----

# కంచి కామాక్షి

*పాత్రలు:*

1. అక్క,
2. చెల్లి,
3. ఉమ,
4. మహేశ్వరుడు.

అక్క: ప్రొద్దున్నే ఎక్కడికి వెళ్ళావ్, చెల్లీ, ఈ కొత్త వూళ్ళో ఎక్కడ మారుపడిపోయావో అని నాకు దిగులేసింది.

చెల్లి: మారుపడిపోవడానికి నేనేం నల్లపూసనా, అక్కా. నీవేమో ప్రయాణపు బడలిక వల్ల ఇంకా నిద్రపోతూనే వుంటివి. ఊరికే వుండి ఏం చేస్తామని అలా బస్సుమీద వూరంతా ఒక చక్కర్ కొట్టి వచ్చానక్కా.

అక్క: కాశీమజిలీ కథల్లో గొల్లపిల్లవాడు చేసినట్లు చేశావన్నమాట. వింతలేమన్నా మూటగట్టుకొచ్చావా లేదా.

చెల్లి: వింతలకేం భాగ్యమక్కా. కావలసినన్ని పోగుచేసుకువచ్చా.

అక్క: అయితే ఇంకేం మూట విప్పి ఒక్కొక్కటీ బయట పెట్టు.

చెల్లి: మొదటి వింత కాఫీ హోటల్లో కనపడ్డది.

అక్క: ఓసి నీ కడుపుడక అప్పుడే ఆత్మారాముడికి నివేదన కూడా కానిచ్చావ్. ఏమిటిది.

చెల్లి: అలా వెళ్ళి బల్ల వద్ద బైఠాయించామో లేదో సర్వరు ప్లేటులో తెచ్చి ముందు పెట్టాడక్కా.

అక్క: ఏమిటే.

చెల్లి: పాలసముద్రం మీది నురుగులా తెల్లగా శుభ్రంగా వున్న ఇడ్లీ అక్కా. అవి నోట్లో వేసుకుంటే అమృతం రుచి చూచినట్లుందనుకో. తింటే ఈ కంచి ఇడ్లీయే తినాలక్కా.

అక్క: అవునవును. కంచి ఇడ్లీకి జగత్ప్రసిద్ధి కదూ. ఇంతకూ నాకేమన్నా తెచ్చావా లేదా.

చెల్లి: చల్లారి పోయిన ఇడ్లీ ఏం బాగుంటుందక్కా. మళ్ళీ వెళదాంలే-

ఇక రెండో వింత.

అక్క: ఏమిటది చెల్లీ.

చెల్లి: మేకలక్కా, మేకలు.

అక్క: నీ తెలివి తెల్లారి నట్లే వుంది. చదవేస్తే వున్న మతి కూడా పోయిందట! మేకలేమిటే?

చెల్లి: ఈ కంచిలో మేకలక్కా గేదెలంతేసి వున్నాయి. వాటి పొదుగులు ఎంత పెద్దవిగా వున్నాయనుకున్నావ్. ఇలాటి మేకల్ని నేను ఎక్కడా చూడలేదు.

అక్క: అవునవును మరిచేపోయాను. కంచిమేకలకు కూడా జగత్ప్రసిద్ధమే. అవి ఎక్కువగా పాలిస్తాయి.

చెల్లి: ఇక మూడో వింతక్కా, అది వింతల్లో వింత, ఏం చెప్పమంటావ్.

అక్క: చెబుదూ నన్ను ఒకటే వూరించక.

చెల్లి: ఈ పట్నంలో నక్కా, సగం మేర ఎక్కడ చూచినా, ఎవరి మొగాలు చూచినా, అన్నీ పంగనామాలే నక్కా. తక్కిన సగం విభూతి పెండెకట్ల మయం. ఏమిటక్కా ఈ చోద్యం?

అక్క: ఓసి నీ యిల్లు బంగారుం గానూ ఎంత గమ్మత్తుగా వర్ణించావే ఈ కంచిని.

చెల్లి: నా యిల్లంతా బంగారం అయితే అందులో సగం నీదేలే, అక్కా.

అక్క: ఈ స్వర్ణపురి దర్శన భాగ్యం కలిగింతర్వాత మన ఇళ్ళూ వొళ్ళూ అన్నీ బంగారం కాక ఏమౌతాయ్, చెల్లీ ?

చెల్లి: ఏమటీ, ఈ కంచికి స్వర్ణపురి అనే పేరుందీ. ఆ పేరెలా

వచ్చిందక్కా?

అక్క: ఈ మహా స్థలంలో ఆది కాలాన ఒక సరస్సు వుండేది. అక్కడ తపస్సు చేసుకునే ఋషులు ఒకనాడు దాని గట్టు మీద ఒక చెట్టును చూచారు.

చెల్లి: మనం రోజూ ఎన్ని చెట్లను చూడడం లేదక్కా. అదేమంత గొప్ప?

అక్క: అలా కాదు చెల్లీ. అది సామాన్యమైన చెట్టు కాదు. దాని కొమ్మలన్నీ బంగారపు కొమ్మలు, ఆకులన్నీ మరకతపు ఆకులు, దాని పండ్లన్నీ నవరత్నాలు. ఆ చెట్టు పేరు స్వర్ణకంచి. దాన్ని బట్టే ఈ పట్నానికి స్వర్ణపురి అనీ, కంచి అనీ పేర్లు వచ్చాయి.

చెల్లి: మరైతే, ఈ పంగనామాలు, ఈ విభూతి పెండెకట్లూ ఏమిటక్కా.

అక్క: ఈ పట్నం నిజంగా రెండు పట్నాలు, చెల్లీ. ఒకటి విష్ణుకంచీ, ఇంకొకటి శివకంచీ. విష్ణుకంచిలో అన్నీ విష్ణ్వాలయాలు. అక్కడ వైష్ణవులు ఎక్కువగా ఉంటారు. శివకంచిలో అన్నీ శివాలయాలు. అక్కడ శైవులు ఎక్కువగా ఉంటారు. ఈ రెండు పట్టణాల మధ్య వుండే ఎడములో విశేషంగా కొబ్బరి తోటలూ ఆశ్రమాలూ వున్నై, నీవు చూచే వుంటావ్.

చెల్లి: అవునక్కా, చూచాను. త్రిమూర్తులలో ఇద్దరు- విష్ణువూ, శివుడూ- ఇక్కడ కుదురుకున్నారు, బాగానే వుంది. మరి మూడో ఆయన బ్రహ్మదేవుడి మాటేమిటక్కా.

అక్క: ఆయనకీ భూలోకంలో ఆలయ ప్రాప్తిలేదమ్మా. కాని బ్రహ్మకు కూడా ఇక్కడ వున్నట్లే లెక్క. సృష్టి స్థితి లయ కారకులైన బ్రహ్మ, విష్ణు మహేశ్వర్లు ముగ్గురూ ఇక్కడ భాసించారు. ఆ భాసించడంలో ఎక్కడా లేని విశేషం ఈ కంచిలో ఉంది.

చెల్లి: ఏమిటక్కా, అ విశేషం.

అక్క: బ్రహ్మకూ శివుడికీ కాలం తీరినప్పుడు ఈ కంచిలో విష్ణు కాయంలో కలిసిపోతారట. దీన్నే కాయారోపణం అంటారు.

చెల్లి: ఇదేం విడ్డూరమక్కా. త్రిమూర్తులకు కాలం తీరడమేమిటి. వాళ్లు కాలాతీతులు కదా.

అక్క: కారు.

చెల్లి: అయితే మరి శాశ్వతంగా వుండి, ఈ చరాచర ప్రపంచాన్ని నిరంతరంగా నడిపే దెవరక్కా.

అక్క: త్రిమూర్తుల వునికికి కారణభుతురాలైన ఆ జగజ్జనని, పరాశక్తి చెల్లీ.

చెల్లి: ఆమె కూడా ఈ కంచిలో ఉందా అక్కా.

అక్క: సరి సరి. వుండ కెక్కడికి పోతుంది, చెల్లీ. మన భారత దేశంలోని సుప్రసిద్ధ శక్తిపీఠాల్లో కంచి ఒకటి. ఇక్కడ వెలసిన శక్తి, కంచి కామాక్షి. ఆమె దర్శనం చేసుకుని తరించడానికేగా మనం ఈ వూరొచ్చింది.

చెల్లి: కామాక్షి. ఎంత చక్కని పేరక్కా. సకల కామాలూ ఆమె కళ్ళలో గూడు కట్టుకుని వున్నాయి కాబోలు.

అక్క: ఆ జగన్మాతకు కోరికలేమిటే నీపిచ్చి గాని.

చెల్లి: అయితే అక్కా, ఆమె ఈ జగజ్జనుల కోరికలన్నీ తీరుస్తుందన్న మాట.

అక్క: ఆమె వాత్సల్యం వల్ల భక్తులకు ఇక్కడ భుక్తి ముక్తులు అవలీలగా లభిస్తాయి. అందుకే దీనికి కామపీఠమని కూడా పేరు. కాని కామాక్షి అనే మాటకు విశేషార్థం వేరే వుంది.

చెల్లి: ఏమిటక్కా అది.

అక్క: కామ అనే మాటలో క, అ, మ అనే మూడక్షరాలున్నాయి. క అంటే బ్రహ్మ, అ అంటే విష్ణువు, మ అంటే రుద్రుడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గుర్నీ మూడు నేత్రాలలో పొదువుకుంది కాబట్టి ఆమె కామాక్షి.

చెల్లి: ఎంత బ్రహ్మాండంగా వుందక్కా, ఈ అర్థం. కామాక్షి కంచిలోనే ఎందుకు వెలిసిందో.

అక్క: దానికొక చక్కని కథ వుంది, చెల్లీ.

చెల్లి: వుందీ కథ! అదేమిటో చెప్పక్కా. విన్నదాకా నాకు మరేమీ తోచదు.

అక్క: కథ కైలాసంలో మొదలు. అరుగో కైలాసంలో ఉమా మహేశ్వరులు.

* * * *

మహేశ్వరుడు: దేవీ ఉమా ఏమిటలా వున్నావ్.

ఉమ: దేవా మహేశ్వరా నాకు చాలా విసుగ్గా వుంది.

మహే: విసుగెందుకు?

ఉమ: ఎందుకా ప్రతిరోజూ రెండు పూటలూ మీ సాంధ్య తాండవం విడవకుండా చూడడం వల్ల విసుగు పుడుతున్నది.

మహే: లోకాలన్నిటినీ లయబద్ధంగా నడిపే నా తాండవం నీకు విసుగు కొలుపుతున్నదీ? నేనిది మానేస్తే లోకాలన్నీ ఏమైపోను. ఈ విషయమేమైనా ఆలోచించావా, జగజ్జననీ.

ఉమ: మిమ్మల్ని సాంధ్యతాండవం మానెయ్యమనడం లేదు. ఈ

విసుగుకు విరుగుడాగా కాసేపు ఇంకేదైనా ఆట ఆడుకోవాలని వుందంతే.

మహే: దానికేం భాగ్యం దేవీ. మన కుమారస్వామినీ, ఢుంఠినీ, కాలభైరవుణ్ని, నందికేశ్వరుణ్ని, పిలుస్తానుండు. వాళ్ళతో కాసేపు కులాసాగా ఆడుకుందువుగాని.

ఉమ: ఆటలో మీరు కూడా వుండాలి.

మహే: చంపావు పో. నేను వుంటే ఆట రక్తి కట్టదు. నన్ను వదిలెయ్. మీరు ఆడుతూ వుంటే చూచి సంతోషిస్తాను.

ఉమ: అమ్మ బాబోయ్. మిమ్మల్ని వదిలెయ్యడమే! ఏడేడు పధ్నాలుగు లోకాల్లో ఎక్కడైనా సరే మిమ్మల్ని వదిలేది లేదు. మీరు ఆటలో వుండి తీరాల్సిందే. అప్పుడ ఆట, ఇక్కడ కాకపోయినా ఇంకొక చోటైనా రక్తి కట్టి తీరుతుంది. మీరు సై అనండి చాలు.

మహే: నీ పట్టే నీది కదా, ఉమా! సరే కానియ్. ఇంతకూ ఏ ఆట ఆడాలని వుంది నీకు?

ఉమ: దాగిలిమూతలు ఆడాలని వుంది, స్వామీ.

మహే: దాగిలి మూతలే! అది నావల్ల కాదు. నిరంతరం సాంధ్య తాండవభ్రమణంలో గిరికీలు కొట్టడానికి అలవాటైన ఈ కాళ్ళు అట్టే దూరం పరుగెత్తలేవు.

ఉమ: అదేం మాట స్వామీ నా కను సన్న వెంట మీరు ఎంత దూరమైనా సరే అవలీలగా పరుగెత్తుక వస్తారని నాకు తెలియదూ. ఇది నా సంకల్పం. దీనికి తిరుగులేదు.

మహే: నీ సంకల్పబలం మనల్ని చాలా దురం తీసుకుపోయేటట్లే వుంది చూస్తే. అయితే ఈ ఆటలో ఎవరెవరికి ఏయే పాత్రలు

నిర్ణయించావ్, దేవీ.

ఉమ: మన చిరంజీవులు ఎలుకలు. మీరు పిల్లి. నేను తల్లిని.

మహే: జగన్మాతవు నీవు తల్లి కావడం సముచితంగానే వుంది. నేను పిల్లినా? అంటే నీవు నా కండ్లు మూస్తావన్నమాట. ఎంత పనికి ఒడికడుతున్నావ్, ఉమా.

ఉమ: ఒక్క క్షణం మీ కండ్లు మూసినంత మాత్రాన వచ్చే ప్రమాదం ఏముంటుంది, స్వామీ.

మహే: అయితే మామూలు కండ్లు రెండూ మాత్రం ముయ్యి. నొసటన వున్న మూడో కంటి జోలికి పోవద్దు జాగ్రత్త.

ఉమ: అమ్మ దొంగా ఆ కంటితో ఎలుకలు పోయి దాక్కునే చోటు చూడడానికా అదేమీ కుదరదు. ఇదుగో మీ మూడో కన్నుకూడా ..

మహే: (ఆత్రంగా) వద్దు, ఉమా, వద్దు.

ఉమ: మూసేశాను పొండి

(వెంటనే భూలోకం నుండి - అయ్యో అయ్యో ప్రపంచ మంతా చిమ్మ చీకటి, కన్ను పొడుచుకున్నా కానరావడం లేదు. మా పనులన్నీ బందయ్యాయి. ఏమిటీ వైపరీత్యం మహా ప్రళయం ముంచుకొస్తుందా యేమిటి. అనే హాహాకారాలు వినిపిస్తై.)

మహే: చూచావా ఉమా! ఒక్క నిముషంలో భూలోకానికి ఎంత ప్రమాదం సంభవించిందో! వద్దు వద్దన్న కొద్దీ ఈ పని చేశావ్.

ఉమ; (పశ్చాత్తాపంతో) నాయీ అవినయానికి నిష్కృతి యేమిటి, స్వామీ.

మహే: ఇది నీ అవినయం ఎంత మాత్రం కాదు. ఇది నీ సంకల్పం. ఇతర

చోట్ల కన్నా ధర్మమూ తపస్సూ కోటి రెట్లుగా ఫలించే 'జగత్సారము' మీదికి నీ బుద్ధి పోయింది.

ఉమ: స్వామీ. మీ ఆజ్ఞప్రకారం భూలోకంలోనికి జగత్సారానికి వెళతాను. వెళ్ళి తపస్సు చేత ఈ పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను. కాని మీకు దూరమై పోతున్నానే! ఈ వియోగం ఎలా భరించగలను, స్వామీ.

మహే: పిచ్చిదానా! నీ ఒక కంటి పాపను గాదా నేను. నీవు నాకు దూరమైపోవడమేమిటి ముందు తపస్సు చేసి చేసిన తప్పు సవరించుకో. తర్వాత అంతా చక్కబడుతుంది.

ఉమ: స్వామీ సెలవు.

మహే: త్వరలోనే అభీప్సితం నెరవేరుతుంది. వెళ్ళిరా దేవీ.

* * * *

అక్క: ఆ విధంగా ఉమాదేవి కంచికి వచ్చింది చెల్లీ.

చెల్లి: అదేమిటక్కా, పరమేశ్వరుడు జగత్సారమంటే నీవు కంచి అంటావేమిటి.

అక్క: కంచికి వుండే అనేక నామాలలో జగత్సారం ఒకటి, చెల్లీ.

చెల్లి: అలాగా ! కంచికి వచ్చి అమ్మవారు ఏం చేసిందక్కా.

అక్క: అక్కడ ఒక మామిడి చెట్టు కింద కూర్చుంది. ఇసకతో శివలింగం చేసి అయ్యవార్ని ఆరాధించడం మొదలెట్టింది. అయ్యగారు మాత్రం అమ్మగార్ని వొదిలి వంటరిగాఎంత కాలమని వుంటాడు. ఆయన ఆ మామిడి చెట్టు కింది సైకత లింగంలో ఆవిర్భవించి అమ్మవారిని అనుగ్రహించి ఏకామ్రనాధుడై వెలిశాడు. అమ్మవారు

కంచి కామాక్షియై వెలిసింది. కైలాసంలో మొదలైన కథ కంచిలో ఎలా ముగిసిందో, చూచావా చెల్లీ.

చెల్లీ: అక్కా నీవీ మాటంటే జ్ఞాపకం వచ్చింది. మన బామ్మ కథ చెప్పినప్పుడల్లా కథ కంచికి పోయింది. మనమింటికి వచ్చాం. అని అంటుండేది గదా. ఏమిటక్కా, దాని తాత్పర్యం?

అక్క: భేషైన ప్రశ్న అడిగావు చెల్లీ. పూర్వం కంచిలో చాలా మంది కథకులు వుండే వాళ్లు. కథలు చెప్పడంలో వాళ్ళు ఆరితేరిన వాళ్ళు. ఎక్కడ పుట్టిన కథైనా సరే, వాళ్ళు మెచ్చుకుంటేనే గాని కథ అనిపించుకునేదికాదు. అందుచేత చెప్పిన కథెల్లా బాగోగుల నిర్ణయానికి కంచికి రవాణా అయ్యేదన్నమాట.

చెల్లి: బాగుందక్కా ఇక్కడ మనకథ కూడా ముగిసినట్లేగా! దాన్ని కంచికి వదిలేసి ఇక మనం ఇంటికి పోదామా?

అక్క: అపరాధం అపరాధం. అమ్మవారి దర్శనం చేసుకోకుండానే.

చెల్లి: అయ్యో నామతి మండిపోను. ఈ కథలకామాటంలో పడి అసలు వచ్చిన పనే మరిచిపోయానే. పదక్కా. పద, అమ్మవారి దర్శనం చేసుకుందాం. దారిలో నీవు కంచి ఇడ్లీ కూడా రుచి చూద్దువు గాని.

చెల్లి: ఈ ఆలయ గోపురం చూచావా. అక్కా ఎంతఎత్తుగా వుందో ఇదే మాలయ మక్కా.

అక్క: ఇప్పుడు మనం విష్ణు కంచిలో వున్నాం చెల్లీ. ఇది వరదరాజ స్వామి ఆలయం. ఇందులో నూరు స్తంభాల మండపం వుంది. ఆస్తంభాల మీద చెక్కబడిన గుఱ్ఱపు రౌతుల బొమ్మలు ఎంత అందంగా వుంటాయనుకున్నావ్. ఈ స్వామికి కోట్ల కొద్దీ ఖరీదు చేసే మంచి మంచి ఆభరణాలు ఎన్నో వున్నాయ్. ఈ రోజుల్లోనే ఇక్కడ గరుడోత్సవం అతి వైభవంగా జరుగుతుంది.

చెల్లి: బలే బలే మంచి సమయానకే వచ్చాం. ఈ వుత్సవం కూడా చూచి పోదామా అక్కా.

అక్క: అదేం లాభం లేదమ్మా. ఆజన సమ్మర్దంలో మనకు దైవదర్శనం కావడం వట్టిమాట. కంచి గరుడ సేవ అనే మాట విన లేదా నీవు.

చెల్లి: అంటే ఏమిటక్కా.

అక్క: శుష్క దండగ అని అర్థం. ఇక పద. అదుగో శివ కంచిలో ప్రవేశించాం.

చెల్లి: ఇదే మాలయ మక్కా, దీని గోపురం కూడా చాలా ఎత్తుగా వుంది.

అక్క: ఏకామ్రనాథాలయం ఇదేనమ్మా. ఇందులో వున్నది పృథ్వీ లింగం.

చెల్లి: అదేమిటక్కా.

అక్క: పంచమహాభూతాలని ఎప్పుడన్నా విన్నావా నీవు.

చెల్లి: ఇప్పుడు భూతాల సంగతి ఎందుకక్కా. అవంటే నాకు తగని భయం అందులో మహాభూతాలంటుంటివి.

అక్క: ఇవేవీ దయ్యాలు కావే పిచ్చిపిల్లా. నేల, నీరు, నిప్పు, గాలి, నింగి- ఇవీ పంచమహాభూతాలు. వీటి పేరిట దక్షిణ దేశంలో పంచలింగాలు వున్నాయి. వాటిలో కంచిలోని ఈ లింగం పృథ్వీలింగం.

చెల్లి: తక్కినవి ఎక్కడెక్కడ వున్నాయక్కా.

అక్క: జంబుకేశ్వరంలో ఆపోలింగం, తిరువణ్ణామలైలో జ్యోతిర్లింగం, కాళహస్తిలో వాయులింగం, చిదంబరంలో ఆకాశలింగం, వున్నాయి. ఇదుగో ఈ కనబడే ఆలయం చూచావా. ఇదే మన నోముల పంట కంచి కామాక్షి ఆలయం. పద లోపలికి పోయి దేవి

దర్శనం చేసుకుందాం.

(ఆలయ ఘంటా ధ్వనులు, అర్చకుల మంత్రపఠనం, జనుల కోలాహలం)

చెల్లి: అక్కా ఇక్కడ వున్న ఆడవాళ్ళందర్నీ ఒకసారి పరికించు. అంతా మంచి మ ంచి పట్టు చీరలే కట్టుకుని వున్నారక్కా.

అక్క: చిత్తం శివుడి మీదా భక్తి పాదరక్షల మీద అన్నట్లుగా వుందే నీ వ్యవహారం. కంచి చేనేత పరిశ్రమకు పేరు పొందింది. ముఖ్యంగా ఇక్కడ నేసే పట్టు చీరలు యావద్దేశంలోనూ విశేష ప్రజాదరణ పొందుతున్నాయి. ఇక నీ పట్టు చీరల పర్యవేక్షణ చాలించి అటు చూడు చెల్లీ.

చెల్లి: అక్కా ఎంత నేత్ర పర్వంగా వుందక్కా దేవి! జగన్మోహన రూపం! భక్తితో నా మనసు పరవశమైపోతున్నది.

అక్క: దేవీ కామాక్షీ మమ్మల్ని అనుగ్రహించు, తల్లీ.

(ప్రసారం- 16.5.62)

# కవిబ్రహ్మ

*పాత్రలు:*

1. మారన, (తిక్కన శిష్యుడు),
2. గురునాథుడు (తిక్కన శిష్యుడు),
3. కేతన (తిక్కనకు కృతియిచ్చిన కవి),
4. తిక్కన (కవిబ్రహ్మ)
5. గణపతి దేవుడు (కాకతీయ చక్రవర్తి),
6. శివదేవయ్య (గణపతి దేవుని మంత్రి),
7. మనుమసిద్ధి (నెల్లూరి రాజు).
8. వంది.

నెల్లూరి పెన్నానదీ తీరం ఒక సాయంకాలం.

మారన: గురునాథా ఈ సాయంకాలపు నీరెండలో ఈ పెన్నమ్మ ఎంత శోభాయమానంగా వుందో చూచావా!

గురునాథుడు: మారన్నా. ఈ దృశ్యం మనం రోజూ చూచేదే. అయనా ఏ రోజు కారోజు ఏదో కొత్తదనం సంతరించుకుంటూనే వుందయ్యా మన పెన్నమ్మ. ఈమె ఎంత వన్నెలాడని.

ప్రన్నని తేటనీటి మురిపమ్ముల రాజతవర్ణ సైకత
చ్ఛన్నదుకూలకూలపరిసర్పితసుందరతానిరూఢి తా
పన్నిన సర్వమేరము సువర్ణముతా బండ్లకెత్తు, నీ
పెన్నకు సాటియే పృథు గభీర తరంగిణు లెన్నియేనియున్.

మా: వహ్వా. నీ పద్యంలో మన గురువుగారి కవితా సువర్ణశోభ ఎంత గంభీరంగా ధ్వనింపజేశావయ్యా. నీ వొక కావ్యం వ్రాయగూడదూ.

గు: మారన్నా. నా కంత సాహసం లేదు. అందుకు నీవే తగినవాడివి. అయినా సొంత పద్యాలు గిలకడానికి నాకు తీరికేదీ? గురువుగారి అనర్గళ కవితా స్రవంతిని తాటాకులలో బంధించి నిలిపేసరికే తలప్రాణం తోకకు వస్తూ వుంది.

మా: గురునాథా. ఆనాటి వేదవ్యాసులకు విఘ్నేశ్వరుడు లభించినట్లు నీవు మన గురువుగారికి దొరికావు. ఎంత పుణ్యం చేసుకున్నావయ్యా.

గు: ఈ రాయసం విద్య మా వంశంలో మొదటినుంచీ వుంది. తాటాకులు చివ్వి పత్రాలుగా తయారు చెయ్యడం చక్కని ములుకులు వచ్చేటట్లు గంటాలు తీర్చడం, ఎంత అందమనుకున్నావ్. ఈ ఆనంద మంతా ఒక యెత్తు, గురువుగారు విరామం లేకుండా పద్యాలు చెబుతుంటే ఆగకుండా వ్రాసుకుపోవడంలో ఉండే ఆనందం ఒక యెత్తు. ఆ సమయంలో

నాకు ఒళ్ళే తెలియదు మారన్నా.

మా: ఆ మరపులో గురువుగారి కవిత్వంలో మన పైత్యం కొంత ఎక్కడ కలుస్తుందోనని నాభయం. అది సరేగాని గురునాథా. మన నెల్లూరి ప్రజలు ఏమనుకుంటుంటూన్నారో తెలుసా

గు: ఏమనుకుంటున్నారేమిటి?

మా: నెల్లూరు చుట్టుప్రక్కల ఉండే తాటితోపులన్నీ ఈ మధ్య పలచబడిపోతున్నవనుకుంటున్నారు.

గు: నాకు కావలసినవి ఒక తాటాకులేకదా మారన్నా- వాళ్ళు అట్లా అనుకోవడం లేదు.

మా: మరేమనుకుంటున్నారు.

గు: ఎక్కడి తాటి ముంజలూ తేగలూ బుర్రగుంజూ తాటి పండ్లూ మారన్నకే చాలడం లేదునుకుంటున్నారు.

మా: ఏమోననుకున్నా మంచి చతురుడివయ్యా నీవు.

గు: కాకపోతే ఈ పెన్నమ్మ ఇక్కడ రెండు పాయలై నెల్లూరును తన బాహువలయంలో పొదువుకుందిగదా, ఎంతమంది గురునాథులైనా, ఎంతమంది మారన్నలైనా, ఈ పట్నానికి ఏ విషయంలో లోటుంటుంది. చెప్పు. మూలఘటిక కేతన వంటి సరసకవులు కూడా దీని సౌభాగ్యానికి ముగ్ధులై ఇక్కడే కాపురం పెట్టారుగదా.

మా: అడుగో మాటల్లోనే వస్తున్నాడు. రావయ్యా, కేతన్నా, రా. నీకు నూరేండ్లాయుస్సు.

కేతన: నెల్లూరి నెరజాణలేమో మంతనాలు సాగిస్తున్నారే.

గు: కేతన్నా. నీవు వేంగీ విషయంలోని వెంటిరాలనే అగ్రహారానికి అధిపతివి. అయినా ఈ విక్రమ సింహపురానికి పాత కాపువై పోయావు. నీవు కూడా నెల్లూరి నెరజాణవేనయ్యా

కే: నెల్లూరంటే ఏమనుకున్నావ్, కేతన్నా...

సీ. ఏ పట్టణమ్మున నెన్నంగ మున్నూటయరువది దేవాలయంబులుండు
ఏపట్టణమ్మున రూపింప నన్నియు నీరారు బావు లింపారుచుండు
ఏపట్టణమ్మున నెల్లమానవులు ప్రశస్తిగాంచిరి నెరజాణలనగ
ఏ పట్టణమ్మున నేకాలమును పెన్న కాల్వల చేత ముక్కారు పండు.

శివుని కృప బుట్టె వేమాల సెట్టి బావి
పరగ జగమెల్ల నెరుగ నే పట్టణమున
అట్టి పట్టణ మిలను సౌఖ్యముల కునికి
పట్టనందగు నెల్లూరు పట్టణమ్ము.

కే: అయితే నెల్లూరి వాసన తగిలిన వాళ్ళంతా నెరజాణలేనన్నమాట. ఎంత సొగసుగా వుందయ్యా పద్యం.

గు: కేతన్నా. నీకీ ఆస్థానంలో ప్రవేశం ఎట్లా లభించింది.

కే: అదంతా ఉభయ కవిమిత్రుల అనుగ్రహం.

మా: ఎంత మంచి బిరుదునిచ్చావయ్యా మా గురువుగారికి.

కే: ఒకరివ్వడమేమిటి ? ఇదేం పెట్టుబిరుదనుకున్నారా?

కం. అభినుతుడు మన్మభూవిభు
సభ తెన్గున సంస్కృతమున చతురుండై తా
నుభయ కవిమిత్ర నామము
త్రిభువనముల నెగడ మంత్రి తిక్కడు తాల్చెన్.

గు: మా గురువుగారు తెలుగులోనూ సంస్కృతంలోనూ సభారంగాన అతి చతురులే., కాని ఆ సభే ఇప్పుడు లేకుండా పోయింది కదా. మనుమసిద్ధి యొక్క స్థితి తలుచుకుంటే గుండె తరుక్కుపోతూ ఉంది.

మా: అవును పాపం. నిన్న గాక మొన్న సింహాసనమెక్కిన ఆ మహారాజుకు ఇంతలో ఎంత కష్టం ముంచుకు వచ్చిందో! మన రాజవంశాల్లో ఈ పాడు దాయాది మత్సరం ఇంతగా జీతించి పోయిందేం కేతన్నా? ఈ అక్కన బయ్యనల కిదేం పోయే కాలం హఠాత్తుగా బలాలు కూడగట్టుకు వచ్చి మనుమసిద్ధిని రాజ్యచ్యుతుణ్ని చేసి, అజ్ఞాత వాసం చేయిస్తున్నారు.

కే: ఇదంతా కాల ప్రభావం, మారన్నా. ఆనాటి పాండవ వీరులకే ఈ బెడద తప్పలేదు.

గురు: వారికి శ్రీకృష్ణభగవానుని అండ ఉండడం వల్ల వారి కష్టాలు గట్టెక్కాయి.

కే: మన మహారాజుకేనా అండ లేంది? మనుమసిద్ధి మహీశ సమస్త రాజ్య భార ధౌరేయుడూ, దీనజనతానిధానమూ, అయిన మన తిక్కశౌరి లేరూ. చూస్తూ వుండండి, ఆయన అ ప్రతిమరాజనీతి ప్రభావం వల్ల మనుమసిద్ధి కడగండ్లన్నీ సూర్య కిరణాలకు మంచుమబ్బులవలె త్రుటిలో విరిసిపోతాయి.

మా: తథాస్తు, కేతన్నా, తథాస్తు. ఇటీవల తిక్కనామాత్యుల హృదయాకాశంలో అటువంటి తలపులు మెరుస్తున్నట్లే వున్నాయి.

గు: మాటల సందడిలో మరిచిపోయాం. ప్రదోషకాలమైంది. గురువుగారీపాటికి హరిహరనాథాలయం చేరుకుని వుంటారు. పదండి పోదాం..

(ఇసుకలో నడుస్తున్న చప్పుడు.)

కే; హరిహరనాథుడు! ఎంత విశిష్టమైన భావన! మారన్నా. ఈ భావాన్ని మూర్తిమంతం చేసుకున్న నెల్లూరి భాగ్యమే భాగ్యం.

మా: శివకేశవులభేదాన్ని ప్రతిపాదించే హరిహరనాథుడు ధర్మాద్వైతమూర్తి. ధర్మాద్వైత స్ఫూర్తిమతియైన గురువుగారి కిష్టదైవం. భక్తునకు తగిన దైవం, దైవానికి తగిన భక్తుడు. ఈ జంటకిదేసాటి, కేతన్నా!

గు: ఇదుగో, ఆలయ ప్రాంగణం

(ఆలయ ఘంటా ధ్వనులు ఉండి ఉండి మెల్లగా వినిపిస్తుంటాయి.) అరుగో, గురువుగారు భక్తి పరవశులై అర్ధ నిమీలిత నేత్రాలతో ముకుళిత హస్తాలతో తన ఆరాధ్యమూర్తి ఎదుట నిబడి వున్నారు--

తిక్కన: (భక్తి పారవశ్యంతో)

శ్లోకం.

కిమస్థి మాలామ్ కిముకౌస్తుభంవా<br>
పరిష్క్రియాయామ్ బహుమన్యసే త్వమ్<br>
కిమ్కాలకూటః కిమువాయశోదా<br>
స్తన్యమ్ తవస్వాదు వద ప్రభో మే.. ..

స్వామీ నీవు ద్వంద్వాతీతుడువు., నీకు ఎముకలహారమూ ఒకటే కౌస్తుభమణీ ఒకటే. కాలకూటాన్నీ యశోదచనుబాలనూ సమాన ప్రీతితో ఆరగించగలవు. నాది కేవలం బాలస్వభావం, నాకిది సాధ్యమా. మనుమసిద్ధి రాజ్యచ్యుతి విషయమైన చింతా కాలకూటం నన్నుక్కిరిబిక్కిరి చేస్తున్నది. నీకృపామృతం కొంచెం నాపై చిలకరించవా తండ్రీ.-- అహో ఏమి నాభాగ్యం నాదేవుని కను కొనలలో దివ్యానుగ్రహం తళుక్కున మెరిసింది. దొరికింది. దొరికింది. -- గురునాథా. రేపటినుంచీ కొన్నాళ్ళపాటు నీ గంటానికి ఆటవిడుపు. మారన్నా పెన్నమ్మ చల్లని తెల్లని ఇసుక

పొరలవాడిలో నీకు స్వేచ్ఛావిహారం. ఓహో. కేతనార్యుడు కూడా వచ్చాడే. కేతన్నా. నిన్నొక కోరిక కోరుకోవాలని నాకు చాలా కాలంగా వుందయ్యా. కాని ఇప్పుడది వంశక్రమాగతమైన నా సచివత్వానికే పరీక్షా సమయం. ఈ గండం గడిచే దెట్లాగని మనసొకటే ఆరాటపడుతున్నదయ్యా కేతనా.

కే: మహాకవీ. ఉభయకవిమిత్రా. తిక్కనామాత్యా. మహనీయుల నైజమే అంత. వారి సామర్థ్యం వారికి తెలియదు.

సీ॥ సరస కవీంద్రుల సత్ప్రబంధములొప్ప
గొనునసుటధిక సంకీర్తనకు తెరువు
లలిత నానా కావ్యములు చెప్పనుభయభా
షల యందు నసుట ప్రశంసత్రోవ
అర్థిమై పెక్కూళ్లనగ్రహారములు
గా నిచ్చునసుట పొగడ్త పొలము
మహిత దక్షిణలైన బహువిధయాగంబు
లొనరించుట వర్ణనము దారి.

పరుని కొక్కని కిన్నియు ప్రకటవృత్తి
నిజములై పెంపు సొంపారి నెగడు నెట్లు
కొమ్మనామాత్యు తిక్కని కొలది సచివు
డింక నొక్కరు డెన్నంగ నెందు గలడు.

తి: సరస కవీంద్రా మూలఘటిక కేతనా! నా కోరికను మూలముట్టుగా గ్రహించావు. నీవెంత ఘటికుడవయ్యా. నీ సత్ప్రబంధాన్ని సముచితమర్యాదతో నేను కృతి తీసుకునే శుభసమయం త్వరలోనే వస్తుంది. నా సాచివ్యపరమైన నీ అమోఘ వాక్కే శుభసూచకమైన ఉపశ్రుతిగా కార్యసాధనకు పూనుకుంటున్నాను. మారన్నా. గురునాథా. రేపు శన్యుషస్సు లోనే కాకతీయ చక్రవర్తి గణపతిదేవుల సన్నిధికి ఓరుగంటికి నా ప్రయాణం అంతా సిద్ధం చేయించండి.

మా: గురువర్యా. మేము మిమ్ము వదిలి వుండలేం. మేము కూడా మీతో రావడానికి అనుమతించి అనుగ్రహించండి.

తి: నాయనలారా. నేను నిరంతరం కొనియాడే కావ్యరసకంధి ఈ పెన్నమ్మనూ, కొట్టరువు వారి సచివత్వ చతురతకు కాణాచియైన యీ నెల్లూరు పట్నాన్నీ,వదిలి వుండడం నాకు మాత్రం సంతోషమా? కార్యం సాధించుకుని నిమిషాల మీద తిరిగి వస్తాను. అందాకా నిస్సహాయుడై అజ్ఞాతవాసంలో వున్న మన మహారాజును వెయ్యికండ్లతో కనిపెట్టి వుండండి.

( ప్రయాణాన్ని సూచించే సంగీతం --- ఓరుగల్లు చక్రవర్తి అభ్యంతర మందిరం-- గణపతి దేవుడు, శివదేవయ్య)

గణపతిదేవుడు: మహామంత్రి శివదేవయ్యగారి వదనంలో ఏదో కార్యవ్యగ్రత దోబూచులాడుతున్నది.

శివదేవయ్య: గణపతిదేవమహారాజు సూక్ష్మగ్రాహులుకదా! నెల్లూరి నుండి ప్రభువుల దర్శనార్థం ఒక మహాపురుషుడు వచ్చియున్నాడు.

గ: మనుమసిద్ధి ఆస్థానం నుంచా? ఎవరాయన?

శి: ఆయన మనుమసిద్ధి రాజ్య సుస్థితికి మూలకందం. మహా మంత్రి తిక్కనార్యుడు.

గ: శివదేవయ్యగారూ. ఈ కాకతీయ సామ్రాజ్య సుస్థితికి మూలకారకులైన మీ కంటె ఘనుడా ఆ నెల్లూరి మంత్రి!

శి: ప్రభూ. రాజ్యాల విస్తృతిని బట్టి మంత్రుల ప్రతిభను కొలవలేం. ఆయన మహా మేధావి. మహాకవి.

గ: మీరు సంస్కృతాంధ్ర కవితా పితామహ బిరుదాంచితులు.

శి: మహారాజా. ఈ పెట్టుబిరుదులకేం భాగ్యం! నేను వ్రాసిందెల్లా ఒక్క పురుషార్థసారం. అదీ నీతి బోధక గ్రంథం. అది లోకంలో శాశ్వతంగా నిలుస్తుందని నమ్మకమేమిటి? తిక్కన మహాకవి, ఉభయ కావ్యాలలోని ప్రౌఢ శిల్ప మార్గాలన్నీ ఆకళింపుకు తెచ్చుకున్నవాడు. కళావిదుడు!

గ; ఏం రచించాడాయన?

శి: తెలుగులోనూ సంస్కృతంలోనూ కొన్ని ఉత్తమకావ్యాలు వ్రాశాడు. కాని తెనుగుసేతను పునీతం చేసే మహాగ్రంథమొకటి అచిర కాలంలోనే ఆయన వెలువరిస్తాడు. ఇది నా అంతర్వాణి ప్రబోధం.

గ: మీరు పరమ శివాచార సంపన్నులు. మహా శివభక్తులు.

శి: తిక్కనామాత్యుడు శివకేశవ ధర్మాద్వైత సిద్ధికలవాడు. నెల్లూరిలో వేంచేసి వున్న హరిహరనాథుని భక్తుడు.

గ: హరిహరనాథుడు! ఎంత చక్కని పేరు! ఎంత నవ నవాద్భుత మూర్తి! శివదేవయ్యగారూ. తిక్కనామాత్యుల దర్శనం కోసం నా మనస్సు ఉవ్విళ్ళూరుతున్నది.

శి: ఎవరక్కడ! నెల్లూరినుంచి వచ్చి ప్రభువుల దర్శనార్థం వేచివున్న తిక్కనామాత్యులను సగౌరవంగా ప్రవేశపెట్టు.

తిక్కన: (ప్రవేశించి) కాకతీయ సామ్రాజ్యాధినేతలు శ్రీగణపతి దేవ చక్రవర్తులకు స్వస్తి. ప్రభూ. సాక్షాత్తూ అపరమశివుడే ఈ శివదేవయ్యగారి రూపంలో మీకు మంత్రిత్వం నెరపుతున్నాడు. మీ భాగ్యమే భాగ్యం.

గ: తిక్కనామాత్యా. మీకు స్వాగతం. ఈ ఆసనం అలంకరించండి. మీరాజు గారికి కుశలమేనా?

తి: ఆ ధర్మరాజిప్పుడు రాజ్యచ్యుతుడై స్వజనంతో అష్టకష్టాలు పడుతున్నాడు. శ్రీకృష్ణుని సహాయార్థం అర్జునుడు ద్వారకకు వెళ్ళినట్లు నేను ప్రభువుల సన్నిధికి బయలుదేరి వచ్చాను.

గ: మీ మహాభారతకథాభిరతి మమ్మల్ని ముగ్ధులను చేస్తున్నది. ఇది కూడా దాయాదుల కుతంత్రమేనా?

తి: అవును ప్రభూ. అక్కన బయ్యన్నలని మనుమసిద్ధికి దాయాదులు! ఇది వారి దౌర్జన్యం.

గ: శివదేవయ్యగారూ! ఈ సంగతి లవలేశమైనా ముందు తెలియలేదే మనకు.

తి: చక్రవర్తులకీ విషయం ముందే తెలిసివుండాలని మేమనుకున్నాం.

శి: అదేమిటి తిక్కనామాత్యా.

తి: ఈ దౌర్జన్యంలో అక్కన బయ్యనలకు వత్తాసి వెలనాటి చోడరాజు, కులోత్తుంగరాజేంద్రుడు. అతడు గణపతి దేవుల సామంతుడు.

గ: ఏమీ. ఈ వెలనాటి చోడునికింత స్వతంత్రమా? మహామంత్రీ. ఈ సామంతునికి బుద్ధి చెప్పడం. అక్కన బయ్యనలను సంహరించి మనుమసిద్ధిని సింహాసనం మీద పునఃప్రతిష్ఠ చెయ్యడం, వెంటనే జరగాలి.

శి: అట్లాగే మహారాజా-- తిక్కనామాత్యా. మీరు సంకల్పసిద్ధులు.

తి: మీ పరోపకారబుద్ధి మెచ్చదగ్గది చక్కవర్తీ! మారాజునూ, నన్నూ అనుగ్రహించారు. మేము ధన్యులం. ఇక నాకు సెలవిప్పించండి.

శి: మీరు కొన్నాళ్ళు మాకు అతిథులుగా వుండాలని మా కోరిక. మహామండలేశ్వరులు మహాభారతకథా శ్రవణకతూహలురై

వున్నారు.

గ: తిక్కనా మాత్యా. మీకు మహాభారతమంటే ఎందుకంత ప్రీతి.

తి: నేను సర్వధర్మ సామరస్యం కోరుతాను. వ్యాసభగవానులు ధర్మాద్వైతప్రతిపాదకంగా సంస్కృతంలో మహాభారతం రచించారు. దాన్ని నిరంతరం పఠిస్తూ తన్మయుణ్ణి అవుతుంటాను.

శి: అందుకే కదా మీరు నిరంతరం హరిహరనాథుణ్ణి ఆరాధించేది!

గ: శైవవైష్ణవ ధర్మాద్వైత మూర్తేకదా హరిహరనాథుడు! మరి తక్కిన ధర్మాలమాటేమిటి.

తి: భారతీయ ధర్మాలన్నిటిలోనూ ఈ రెండే ప్రధానమైనవి. తక్కినవన్నీ వీటినుంచి వచ్చినవే. ఈ రెండిటికీ అభేదత్వం కుదిరితే తక్కినవాటికన్నిటికీ కుదిరినట్లే. అందుచేత హరిహరనాథుడు సకల ధర్మాద్వైతమూర్తి.

గ: తిక్కనామాత్యా! మీరు లోకోత్తరపురుషులు. మీ దర్శనభాగ్యం వల్ల నేను తరించాను. రేపటినుంచీ మా ఆస్థాన విద్వద్గోష్ఠిలో మీరు మహాభారత పరమార్థం మాకు వినిపించాలి.

తి: మహారాజా. మహాభాగ్యం.

గ: మహామంత్రీ. మన సైన్యం మనుమసిద్ధికి సహాయం పోవడానికి ఉత్తరువు లిప్పించారా.

శి: ఇంతసేపా, మహారాజా. --- అదుగో, మన సైన్యం కదిలింది.

( ప్రయాణ భేరీ ధ్వని --- సైన్యం కదిలిపోతున్న చప్పుడు-- కాహాళ ధ్వనులు భేరీ ధ్వనులు, జన కోలాహలం)

---- -- -- -- --

(నెల్లూరులో మనుమసిద్ధి మహారాజు సభ -- వంది, మనుమసిద్ధి -- తిక్కన, గురునాధుడు, మారన, కేతన..)

వంది: జయము, జయము, శ్రీ విక్రమ సింహపురవరాధీశ్వరా. రాయగండగోపాలా. రాయవేశ్యాభుజంగా, అరాతిభయద రాయపెండారబిరుదాభిరామా, ఉభయరాయ గండాంకా, ఖండియరాయా, మనుమసిద్ధి మహీపాలా, జయము, జయము.

మనుమసిద్ధి: మామా తిక్కనామాత్యా! వంది పలికిన నీ ప్రశస్తి ఎంత గొప్పగా వుందో చూచావా.

తి: అల్లుడా సిద్ధిరాజా! నెల్లూరి నెరజాణలలో ప్రథముడివి. చమత్కారానికేం తక్కువ నీకు. ఇది నా ప్రశస్తి కాదయ్యా, నీ ప్రశస్తి.

మను: ఈ శుభోదయమంతా నీవు పెట్టిన భిక్షేకదా, మామా!

తి: నాయనా. మా వంశానికీ మీ వంశానికీ వున్న స్నేహ సంబంధం ఈ నాటిది కాదు. గుంటూరి విభులైన మా పూర్వులను మీ పూర్వులు తమ సౌహార్దం చేత ఆకర్షించి ఈ నెల్లూరుకు పాతకాపులను చేశారు. గుంటూరి విభుడైన మాతాత మంత్రి భాస్కరుడు, ధర్మాద్వైతమూర్తి అయిన మీతాత మనుమసిద్ధి అమాత్యుడు. మా పెదతండ్రి సిద్ధనామాత్యుడు మీ తండ్రి తిక్కభూపాలుని మంత్రి. మా తండ్రి కొమ్మనామాత్యుడు మీ తండ్రి దండనాథుడు. నేను నీ మంత్రిని. మా పెదతండ్రి కొడుకు ఖడ్గతిక్కన నీ సేనాపతి. నీ సింహాసనం నీకు తిరిగీ చేకూర్చడంలో నా కర్తవ్యం నేను నెరవేర్చాను.

మను: తిక్కనామాత్యా, అందలాలూ, గొడుగులూ, అడపాలూ, మేల్కట్లూ, చామరాలూ జమిలిశంఖాలూ, కంబగట్లూ, భూమి కానికలూ మొదలైన రాచపదవులన్నీ ఇదివరకే నీకు సమర్పించుకున్నాను.

ఈ శుభసమయంలో నీ కివ్వడానికిన నావద్ద ఏమీలేదు. నీవే నాకివ్వాలి.

తి: మంత్రిమాత్రుణ్ని, మహారాజుకు నేనేమివ్వగలను?

మను: మామా. కొత్త పెండ్లికొడుకును కావాలని నాకు ఉబలాటంగా వుంది. మహాకవీ. నేను నిన్ను మామా అని పిలుస్తాను కదా. దానికి తగినట్లు నాకు నీ భారతీ కన్యకను ప్రసాదించు.

తి: రాజా! నీ మాట నా చిత్తాని కింపుకూర్చిందయ్యా.

సీ॥ సకలలోకప్రదీపకుడగు పద్మినీ
మిత్రవంశమున జన్మించితివని
చూచిన మగలైన చొక్కెడునట్టి సౌం
దర్యసంపద సొంపు దాల్చితివని
జనహృదయానందజనకమై నెగడిన
చతురత కల్మి న ప్రతిముడవని
మెరసి యొండొంటికి మిగులు శౌర్య త్యాగ
విఖ్యాత కీర్తుల వెలసితివని

వివిధ విద్యా పరిశ్రమ వేది వనియు
సరస బహుమాన విరచనా శాలివనియు
మత్కృతీశ్వరుడగుచున్న మాన్యు నిన్ను
సుభగు గావించుటకు సముత్సుకుడనైతి.

మను: కవిలోక చక్రవర్తీ! మహా ప్రసాదం.

గురునాధుడు: నా గంటాని కిక ఉపిరిసలపని పని.

తి: కేతనార్యా! ఈ కావ్యానికి ఇతివృత్తం ఏమి ఎన్నుకోనయ్యా.

కేతన: మా వంటి వారా కవిబ్రహ్మకు చెప్పేది. అయినా అడిగారు కాబట్టి నాకు తోచింది చెబుతాను. కృతిభర్త ఇక్ష్వాకు వంశస్థుడు.

ఇక్ష్వాకు కులతిలకుడైన రామభద్రుని కథ ఉభయ తారకంగా వుంటుందని నా అభిప్రాయం.

తి: సారకవితాభిరాముడు మా తాత మంత్రి భాస్కరుడు రామాయణం ఇదివరికే చెప్పాడు.

మా: ఆయన ఉత్తర రామాయణం చెప్పలేదు.

తి: అవునవును. ఆ భాగం నాకోసమే వదిలిపెట్టినట్లుంది. ఉత్తరరామాయణమే చెబుతాను.

మను: మామా! పిల్లకు సొమ్ములేం పెట్టదలిచావో ముందే చెప్పడం మంచిది.

తి: ఎంత ఖరాఖండి అల్లుడివయ్యా నీవు!

కే: కవిబ్రహ్మ కావ్యరచనా నియమాలు తెనుగు నేలకే మార్గదర్శకాలు, సెలవియ్యండి.

తి: కావ్యరచన చేస్తాననేవాడు, భావస్ఫోరకాలైన పదాలను ఎన్నుకోవడం, వాటిని చక్కగా అతకడం, నేర్చివుండాలి. పాతమాటలనే పట్టుకుని వ్రేలాడడం మంచిదికాదు. అవి హృదయాన్ని రంజించలేవు.

గు: గురువర్యా! తెలుగు కవిత్వంలో సంస్కృతం గుప్పించడం ఎంతవరకు సమంజసం?

తి: జాత్యం కాకపోవడం చేత, ఒప్పయినప్పటికిన్నీ సంస్కృతం నేను ఎక్కడబడితే అక్కడ చొప్పించను.

మా: గురుదేవా. సంస్కృతంలో లేని యతిప్రాసల జంజాటం తెనుగులో మాత్రమెందుకు?

కే: మారన్నా! యతిప్రాసలు లేకుండా పద్యరచన చేద్దామను కుంటున్నావేటి కొంపతీసి.

తి: అర్థానికి తగిన మాటలు తీసుకుంటున్నానని యతిప్రాసలు నిలపకుండా పులిమి పుచ్చడం, తెనుగుకవిత్వం చెప్ప దలుచుకున్న కవికి నేర్పుకానేకాదు. శ్రుతికి అనుగుణంగా వున్నాయని ప్రాస ప్రకారం వేరైన అక్షరాలుంచడం కవిత యొక్క బీదతనాన్ని సూచిస్తుంది.

కే; ఇన్ని చక్కని నియమాలతో మీరు వ్రాయబోయే కావ్యం లోకోత్తరంగా వుంటుంది. సందేహం లేదు.

తి: ఎల్లా వున్నా మన కావ్యం మనకు బాగానే వుంటుంది. సరసులైన కవులకు నచ్చినప్పుడే అది సత్కావ్యమౌతుంది. నాకృతిలో వేయి గుణాలు నిక్షేపించడానికి ప్రయత్నించినా చివరకందులో ఒక్కగుణమూ లేకపోవచ్చు. కాని ఆ విషయమై నాకేమీ బెంగలేదు. సారకవితకాభిరాముడైన మా తాతగారి మీద వుండే గౌరవం చేతనైనా లోకం నా కావ్యాన్ని మన్నిస్తుందని నా కొకటే ధైర్యం.

మను: మామా! పద్యంతో పాటు గద్యం కూడా వుండవలసలిందేనా, కావ్యంలో?

తి: ఓహో అల్లుడు గారికి నిర్వచన కావ్యం మీద మనసు పోయిందే. వచనం లేకుండా వర్ణన కొంతవరకు చెయ్యవచ్చు. కథంతా పద్యాలతోనే పొందించి ఔచిత్యం చెడకుండా చెప్పడం కష్టమే. రాజా! వాక్యాలు కలిపేటప్పుడు కూడా గద్యంతో పని లేకుండా నిర్వచనంగానే ఉత్తరరామాయణం రచిస్తాను గురునాథా!

గు: గురుదేవా! నేను సిద్ధంగా వున్నాను.

తి: ఇదుగో నిర్వచనోత్తర రామాయణ మహాకావ్యానకి శ్రీకారం

చుడుతున్నాను.

శ్లోకం. శ్రీరాస్తాం మనుమక్షితీశ్వర భుజాస్తంభే జగన్మండల
ప్రాసాదస్థితభారభాణి దధతీ సాసాలభంజీశ్రియం
శుండాలోత్తమ గండభిత్తిషు మద వ్యాసంగ వశ్యాత్మనాం
యా ముత్తేజయతే కదాం మధులిహామానంద సాంద్రాస్థితిః.

(కాలం దొర్లిపోవడాన్ని సూచిస్తూ సంగీతం - ఆనందంగా ప్రారంభమై కొంచం విషాదంగా ముగుస్తుంది)

(నెల్లూరు -తిక్కన మందిరం- తిక్కన కేతన- మారన- గురునాథుడు)

తిక్కన: కేతనా! గంధవారణ బిరుదాంకితుడు, మా అన్న ఖడ్గ తిక్కన, ఇక లేడుగదా.

కేతన: తిక్కనామాత్యా, ప్రాజ్ఞులు మీరు. కాటమరాజు సేనాని బ్రహ్మ రుద్రయ్యతో హోరాహోరిగా పోరాడి ఆ మహావీరుడు మరణం పొందాడు. అందుకు చింతించవలసిన పనిలేదు.

తి: మా వదిన చానమ్మ - ఆమెను తలుచుకుంటే ఇప్పటికీ వొళ్ళు పొంగిపోతుంది- వీరపత్ని అన్న పేరు సార్ధకం చేసుకుంది. చిన్నత్త మార్గం అనుసరించిందామె.

మారన: గురువర్యా. మీ తల్లి అన్నమ్మగారి సంగతి కదూ మీరు చెప్పేది.

తి: అవును మారనా. నేనప్పుడు చిన్నవాణ్ణి. మా తండ్రి కొమ్మన దండనాథుడీ నెల్లూరి వద్ద జరిగిన ఒక యుద్ధంలో వీరమరణం చెందగా ఆమె సహగమనం చేసింది.

కే: తిక్కనామాత్యా. ఎంత మహిమాన్వితమైన వంశమయ్యా మీది. మీరు ఆదరంతో అడిగి కృతిపుచ్చుకున్న నా దశకుమార చరిత్రలో ఒక ఆశ్వాసమంతా మీ వంశవర్ణనకే వినియోగించాను. అయినా తృప్తిలేదు.

గురు: అందులో మనుమసిద్ధి మహీపాలుని వంశవర్ణన కూడా వున్నట్లుందే.

కే: ఏదో కొద్దిగా. నిర్వచనోత్తర రామాయణంలో గురువర్యులు ఆవంశవర్ణన సవిస్తరంగా చేశారు. దాని ముందు, నా వర్ణన, దివిటీ ముందు దీపం. మహా కవీ! తెనుగు వాడికి భవతారకమైన మహా కావ్యమింకొకటి మీరు రచించాలి.

మా: గురువర్యులిప్పుడు విచారంలో వున్నారు. వారి మనస్సు మథనపడుతూ ఉంది.

కే: మనస్సు మథన పడితేనే మహాకావ్యం ఉద్భవించేది మారనా!

తి: కేతనార్యా! నీ వన్నది నిజమే. కాని నిన్నగాక మొన్న అక్కడ పలనాటి వీరుల ప్రళయ తాండవం, ఇపుడిక్కడ ఈ కాటమరాజు గడబిడ. అవిచారమూలకమైన వైరానల జ్వాలలో అట్టుడికినట్లు వుడికి పోతున్న దేశం దుస్థితి తలుచుకున్న కొద్దీ నామనస్సు చింతావికలమైపోతున్నది. స్థాయి చిక్కడం లేదు.

గు: దీనికంతా మూలకారణం ఏమిటంటారు?

తి: విభిన్న ధర్మాల మధ్య పుట్టిన అర్థం లేని సంఘర్షణా, అందువల్ల కలిగిన వివేకం లేని విద్వేషం.

మా: ఇందుకు విరుగుడేమిటి?

తి: దేశంలో ధర్మాద్వైత భావ వ్యాప్తి.

కే: మన నీతి విదులు, ఇటువంటి ఉపదేశాలు చేస్తూనే వున్నారు.

తి: సారంలేని శుష్కనీతుల వల్ల ఏమౌతుంది. వాటిని సరసంగా కాంతా సమ్మితంగా మహా కావ్యరూపంలో జనుల హృదయాలకు

హత్తుకునేటట్లు చెయ్యాలి. సంస్కృతంలో వ్యాసభగవానులు ధర్మాద్వైత పరంగా రచించిన మహాభారతం అటువంచి మహా కావ్యం. దానిని తెలుగు చెయ్యడానికి పూనిన ఆంధ్ర కవిత్వ విశారదుడు, విద్యా దయితుడు నన్నయ భట్టారకుడు, ఆంధ్రులకు పరమపూజ్యుడు, చిరస్మరణీయుడు. ఆయన దానిని తుదముట్ట చెప్పక పోవడం ఆంధ్రుల దురదృష్టం.

గు: అది మరొక విధంగా తెనుగు వారికి సాటిలేని అదృష్టమని నా తలం పు.

మా: నన్నయ భట్టారకుని పూనికను తుది ముట్టించడానికి గురువర్యులు పూనుకుంటే సరి.

తి: నేనా? భారతం తెనుగు చెయ్యడమా? బ్రహ్మానంద స్థితి అనుభవించిన వాడే ఆపని చెయ్యగలడు. నా వంటి బాల స్వభావు డేం చెయ్యగలడు?

కే: హరిహరనాథుని కృపాకటాక్షం, మీమీద పరిపూర్ణంగా వుంది.

తి: ఈ మనస్సూ ఈ శరీరమూ నానా లౌకిక కార్యాచరణంలో కలుషితమైవి. ఈ పనికి నేను పనికి వస్తానా?

మా: నిరంతర హరిహరనాథ భక్తి భావనతో మీ ఆత్మ కొడిగట్టని జ్యోతి వలె ప్రకాశిస్తున్నది. మీ మనశ్శరీరాలకు మాలిన్యమేమిటి?

గు: కాకపోతే గురువర్యులొక మహాయజ్ఞం చేయవచ్చు. అవబృథస్నానంతో మరింత పవిత్రులై ఆంధ్రమహాభారత రచనకు ఉపక్రమించవచ్చు.

తి: గురునాథా. చక్కని సూచన! పావన పినాకినీ తీరంలో జిన్నవాడ మహాక్షేత్రంలో, కామితార్థ ప్రదాయిని శ్రీ కామాక్షీ దేవి సన్నిధిలో, సోమయాజినౌతాను.

(కొన్నాళ్ళు గడిచింతర్వాత. - నెల్లూరు- మొదట తిక్కన మందిరం, తర్వాత హరిహర నాథాలయం- కేతన- గురునాథుడు- మారన- తిక్కన )

కే: గురునాథా. మీ గురువర్యుల పనికదా, యజ్ఞస్థలంలో నీవెక్కడా కనిపించనే లేదేమయ్యా?

గు: నేను గురువుగారి పని మీదనే వున్నాను కేతన్నా.

మా: అవునవును. ఊరిబయటి తాటితోపులన్నీ గాలిస్తున్నాను.

గు: మేలిరకపు తాటాకు బండ్లకొద్దీ పోగుచేసి, వ్రాతకు సిద్ధం చేశాను. చాలినన్ని గంటాలు తయారు చేసి పెట్టుకున్నాను గూడా.

కే: అయితే భారత రచన ఆరంభమైనట్లేనా గురునాథా?

గు: అహో!

మా: ఏదీ మొదలు.

గు: ఇదుగో.

ఉ. శ్రీయనగౌరి నాబరగు చెల్వకు చిత్తము పల్లవింప, భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపము దాల్చి, విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చ మెచ్చు పరతత్వము గొల్చెద నిష్ట సిద్ధికిన్.

కే: కవి బ్రహ్మచేసిన ఈ సకల బ్రహ్మ ప్రార్థన ఎంత చక్కగా వుందయ్యా! తర్వాత వేదవ్యాసుణ్ణి భారతామ్నాయాన్నీ నన్నయ్యభట్టారకులనూ ప్రశంసించి హృదయాహ్లాదిరైన విరాటపర్వం మొదలు పదిహేను పర్వాలూ తెనుగు బాసలో రచించేందుకు తనకున్న కౌతుకాన్ని వెల్లడించారు.

గు: ఆ తర్వాత మౌన ముద్ర వహించారు. ఆయన బొమముడిలో

ఏదో నిగూఢమైన ఆలోచనా రేఖ సుడి తిరిగింది. ఉన్నట్లుండి లేచి హరిహరనాథాలయం కేసి నడిచివెళ్ళారు.

కే: ఇదేమిటో విస్మయజనకంగా వుందే. పదండి, మనం కూడా అక్కడికి పోదాం.

(కించిద్విరామం)

గు: అరుగో గురుదేవులు. మంటపస్తంభాని కానుకుని ప్రశాంత చిత్తంతో కూర్చుని వున్నారు.

మా: ఆయన వదనారవిందం వికాస వంతమై ఉంది.

కేత ; ఏదో సంతోషం, ఏదో ఆశ్చర్యం ఏదో భక్తితాత్పర్యకలితమైన తలంపు ముప్పిరికొన్న ఆయన మానసం ఆయన సువిశాల నయనాలలో నాట్యం చేస్తున్నది. కవిబ్రహ్మ కేదో దివ్యసాక్షాత్కార మైనట్లుంది.

తిక్క: (తన్మయం సూచించే గొంతుతో) రండయ్యా రండి. కేతన్నా. గురునాథా. మారన్నా. రండి రండి. నాదేవుడు నన్ను అనుగ్రహించాడు. నాకు ప్రత్యక్షమైనాడు.

గు: ధన్యులం గురుదేవా. ధన్యులం.

తి; ఈ మహాభారత ప్రబంధమండలికి కృతిపతిగా ఎవరిని పేర్కొందునా అనే తలంపు మనస్సులో మెదలగానే, లేచి ఇక్కడికి వచ్చాను. వచ్చి నా స్వామిని తనివి తీర ధ్యానించాను. అంతట కొంచెం నిద్రవచ్చిందయ్యా నాకు. ఆ నిద్రలో కల- ఓహో. ఏమి కలయ్యా అది! దాని ప్రభావం ఇంకా నన్ను వదలలేదు. ఆ కలలో నా తండ్రి--

కే: హరిహరనాథుడు సాక్షాత్కరించాడా మీకు.

తి: నా జనకుడయ్యా, జనకుడు. నను గన్నతండ్రి, కొమ్మనా మాత్యుడు! ఈ పాపిష్టి కండ్లు నా తండ్రిని చూడక ఎంత కాలమైంది కేతన్నా! ఆయన కనపడగానే రెండు చేతులూ జోడించి నమస్కారం చేశాను. ఆయనకు నేనంటే ఎంత వాత్సల్యమని! నన్ను తుష్టిగా దీవించి, దయారసం ఉట్టిపడేటట్లు చూచి,--

గు: ఏమి సెలవిచ్చారు కొమ్మనామాత్యులు?

తి: నాయనా. నీవు మునుపు రచించిన పద్యం భక్తవత్సలుడైన హరిహరనాథుడు గాఢాదరంతో స్వీకరించాడు. నీపట్ల దయాళుడై నిన్ను కృతార్థుని చెయ్యడానికి సంకల్పించాడు. అని చెప్పాడయ్యా, నా జనకుడు.

మా: గురువర్యా, ఆ పద్యం, కిమస్థిమాలాం.. .. కదూ.

తి: అవునవును. అదే సర్వకాల సర్వావస్థలయందూ నా జిహ్వాగ్రాన నర్తించే తారక మంత్రం.

కే: మహా కవీ, తిక్కన సోమయాజీ! ఒక్క పద్యంతో భగవంతుని ఆకట్టుకున్న మీకవిత్వ మహిమ అనన్యసాధ్యం.

గు: భగవంతుని దివ్య చిత్తాన గల ఈ కారుణ్యం కొమ్మనామాత్యులకు ఎట్లా అవగతమైందో?

మా: ఆ నాకలోక వాసికి భగవంతుడే ఆ శక్తిని ప్రసాదించి ఉంటాడు.

కే: అంతే కాదు కొమ్మనామాత్యులను ఆకర్షించి కొలిపించుకుని భగవంతుడు ఆయన వెంట బయలుదేరి వుంటాడు.

తి: అంతేనయ్యా. అంతే ఈ సంగతంతా చెప్పి నా జనకుడు, అడుగో, భగవంతుడు అని ఆవైపు చూపించాడు. సవిశేష

సంభ్రమ భరితమైన హృదయంతో అటు చూతునుగదా.

సీ. కరుణారసము పొంగి తొరగెడు చాడ్పున
శశిరేఖ నమృతంబు జాలువార
హరినీలపాత్రిక సురభి చందనమున్న
గతి నాభి ధవళ పంకజము మెరయ
గురియైన చెలువున నెరసిన లోక ర
క్షణమన గరళంబు చాయ దోప
ప్రథమాద్రి దో తెంచు భాను బింబము నా
నురమున కౌస్తుభ రత్నమొప్ప

సురనదియును కాళిందియు బెరసినట్లు
కాంతి పూరంబు శోభిల్లు శాంతమూర్తి
నామనంబు నానందమగ్నముగ జేయ
నెలమి సన్నిధి సేసె సర్వేశ్వరుండు.

గు: ఆహా! ఎంత పరమాద్భుత మన్నివేశం. విన్నవాళ్ళకు మాకే మనస్సు వివశమౌతున్నది.

తి: నా దైవాన్ని చూడగానే నాలోని భక్తి కట్టలు తెంచుకుని ప్రవహించింది. నా స్వామికి సాష్టాంగ నమస్కారం చేశాను. వినయవినమ్రుడనై కొంచము పక్కకు తప్పుకుని నుదుట అంజలి ఘటించి నిలుచున్నాను. నా కళ్ళలో ఆనంద బాష్పాలు నిండాయి.

మా: అప్పుడే చేశాడు సర్వేశ్వరుడు?

తి: అంతులేని కనికారంతో తన కుడికన్ను కూడా వెన్నెలే వెదజల్లగా కొత్తలేకుండా నన్ను చూచాడయ్యా నా దేవుడు! నా ప్రభువు వదనంలో చిరునవ్వు వెల్లివిరిసింది. తిక్కశర్మా! వైదిక మార్గనిష్ఠమైన వర్తనతో, భేదం లేని భక్తివల్ల నిర్మలమైన మనస్సుతో, నన్ను నిరంతరం ధ్యానించడం చేత

ఆనందమయమైన ఆత్మతో, ఎప్పుడూ కావ్యరసాన్ని కొనియాడుతూ ఉంటావు. నీవు రచించబోయే తెనుగు భారతానికి కృతిపతిత్వం కోరి వచ్చానయ్యా.. అన్నాడు.

కే: కవిబ్రహ్మ యొక్క భవ్య పురుషార్థతరువున అమృతఫలం పండింది.

తి: దేవదేవుని దివ్య వచనామృతం నా మనస్సులో వెల్లివిరిసి నేను పరవశత్వం చెందాను. నా స్వామికి ఎన్ని సార్లు మొక్కానో లెక్కలేదు. నా వంటి బాల స్వభావుడికి ఇటువంటి మహనీయ మహిమ కలిగించాడే అప్రమేయ ప్రభావ భావనాతీతుడైన ఈ పరమేశ్వరుడు! ఆశ్రితులకింత సులభుడా అనిపించింది. నా దైవానికి ఒక విన్నపం చేసుకుందామనే కోరిక కలిగింది. కొమ్మనామాత్యుని వదనం చూచాను.

గు: ఆయన చూపులోనే అనుమతి తెలిపి వుంటాడు.

మా: తెలిసింది తెలిసింది. స్వామిని బ్రహ్మానందస్థితి ప్రసాదించమని కోరి ఉంటారు, గురుదేవులు.

తి; అవునయ్యా అవును. ఆ అఖిలాండపతి ఆశ్చర్యకరంగా నాక్షుద్ర చిత్తంలో విస్తార మహితమైన కారుణ్య క్షీరాబ్ధిని నిక్షేపించాడు. ఆయన మహా విభూతిని కొనియాడే పదవి నా వాక్కు కంటగట్టాడు. ఇంకేముంది. చను విచ్చిన కుర్రవాడు చంక కెక్కి తన అంతస్తు తెలుసుకోకుండా మహా పదార్థం కోసం మారాము చేసినట్లు, జన్మాంతర దుఃఖాలు తొలిగించి నన్ను సుఖాత్మణ్ణి చెయ్యి, మహానుభావా అని నా స్వామి పాదాలముందు సాగిలపడ్డాను. నీకు మోక్ష జ్ఞానం ఇచ్చానన్నాడు నా దేవుడు. లేచి నిలుచున్నాను. నా మనస్సంతా సంతోషం నిండి తొణికిసలాడింది. మెలకువ వచ్చింది.

కే: మహాత్మా మీరు పుణ్య చరిత్రులు. మీ జన్మ కృతార్థమైంది. లోకోత్తరమైన పదాన్ని పొందారు. పరమేశ్వరుణ్ణి కృతిపతినిగా చేసుకున్నారు. పుణ్యమూర్తియైన భారత సంహితా రచనకు ఉన్న ఒక్క అవరోధమూ తొలగిపోయింది.

తి: కేతనార్యా.

ఉ. కూర్చుట నూత్నరత్నమునకున్ కనకంబునకున్ తగున్ జనా
భ్యర్చితమైన భారత మపార కృపాపరతంత్రవృత్తి మై
పేర్చిన దేవదేవునకు ప్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చినయట్లు చెప్పి వరణీయుడనయ్యెద భక్తకోటికిన్.

అనన్య సామాన్యాకారమైన పరమ ధర్మ ప్రకారమయ్యా, ఇది!

ఉ. కావున భారతామృతము కర్ణపుటంబుల నార గ్రోలి ఆం
ధ్రావళి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయ సంస్మృతి
శ్రీవిభవాస్పదంబయిన చిత్తము తోడ మహా కవిత్వ దీ
క్షా విధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ కృతుల్.

గురునాథా. ఇటువంటి పుణ్యప్రబంధాలు దైవ సన్నిధిలో చెప్పడమూ ఒక ఆరాధన విశేషమే. కాబట్టి ఈ నా స్వామికి విన్నపం చేస్తున్నట్లుగా ఈ మహా కావ్య రచన సాగిస్తాను.

--లోపలా బయటా అంతటా నిండివున్న ధర్మాద్వైత మూర్తీ!

శరణాగత సంశ్రితభయ
హరణా. సురనికర శేఖరానర్ఘమణి
స్ఫురణా పరిచయ రంజిత
చరణా వనమాలికా భుజంగా భరణా.

భుజగసమాచరితశయన భూషణకృత్యా. మరుత్సరిదా
కల్పిత మనోజ్ఞ చరణశిరస్సుందరమూర్తీ. జలనిధి హిమ
వద్భూధర కలిత జనన కేళి కౌతుకవ్య క్తా వ్య క్త లలిత సౌందర్య
స్ఫురదలఘు తనుస్ఫీ్తసనాధా. హరిహరనాథా.

హరిహరనాథా! దివ్య చిత్తాన అవధరించు దేవా అవధరించు.

( కొంత కాలం గడిచిం తర్వాత- నెల్లూరు-పెన్నా నదీ తీరం గురునాథుడు, మారన, కేతన)

గు: అమ్మయ్యా, కవిబ్రహ్మ, మహాకవిత్వదీక్షావిధి సమాప్తమైంది. మా అచ్చపు తెనుగునది ఈ పెన్నమ్మ ఒయ్యారపు వంపులవలె తెనుగు మెలికలు తిరిగిన భారతామ్నాయం లభించి ఆంధ్రులు తరించారు.

కే: గురునాథా. కవిబ్రహ్మ భవ్యకవితావేశాన్ని గంటపు ములికితో పట్టి అక్షర బద్ధం చేసి నీవు తరించావు.

మా: కేతన్నా! కవిబ్రహ్మకు కృతియిచ్చి నీవు తరించావు. కావ్యమంటూ వ్రాయడం వుంటే గురుదేవుని మీద నేను ఒక్కటే ఒక్క పద్యం చెబుతాను.

గు: ఏదీ పద్యం?

మా; ఇదుగో.

చం. ఉభయ కవిత్వ తత్త్వవిభవోజ్జ్వలు, సంహితాధ్వర క్రియా
ప్రభు, బుధబంధు, భూతి గుణ బంధురు, భారత సంహితా కథా
విభు, పరతత్త్వ బోధను నవీన పరాశరసూను, సంతత
త్రిభువన కీర్తనీయయశు, తిక్కకవీంద్రుని గొల్తు నర్థితోన్.

కే: బలే! ఒక్క పద్యంతో ఇష్టదైవాన్ని మెప్పించిన కవిబ్రహ్మకు తగిన శిష్యుడివి అవుతావు మారన్నా. ఆ ఒక్క పద్యంతోనే నీవు

తరిస్తావు.

గు: ఇంతకూ కవిబ్రహ్మ బిరుదులోని సార్థకత ఏమిటి.

కే: అది చెప్పడానికి మన మెవళ్ళం? కవి బ్రహ్మంతవాడు చెప్పవలసిందే! ఆరణ్యపర్వశేషం పూరించనున్న భవిష్యద్వాణి అదుగో, వినవస్తున్నది. ---

(నేపథ్యంలో)

మ. తనకావించిన సృష్టి తక్కొరుల చేతంగాదు నా, నేముఖం
బున తా బల్కిన పల్కులాగమములై పొల్పొందునా, వాణి న
త్తను నీతండొకరుండనా, జను మహత్త్వాప్తిన్ కవిబ్రహ్మనా,
వినుతింతున్ కవితిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్.

(ప్రసారం తేది: 1-8-62)

----- 0 -----

# సత్యభామ

*పాత్రలు:*

1. సత్యభామ.
2. నళిని - చెలికత్తె.
3. శ్రీకృష్ణుడు.
4. నరకాసురుడు.
5. భూదేవి.

(సత్యభామ అంతఃపురములో ఆయుధాగారం-సత్యభామ ధనుర్విద్యా పరిశ్రమ చేస్తూ వుంటుంది దూరం నుంచి)

నళిని-- అమ్మా సత్యభామాదేవీ ఎక్కడున్నావమ్మా?

సత్యభామ-- నళినీ ఇటు ఇటు ఇక్కడ, ఈ ఆయుధాగారంలో.

నళిని-- (దగ్గరికి వచ్చి) వేళగానివేళ ఇక్కడేం చేస్తున్నావమ్మా?
సత్యభామ-- ధనుర్విద్య అభ్యాసం చేస్తున్నానే,

నళిని-- మంచివిద్యే దీనివల్ల పుణ్యమా, పురుషార్థమా? అయినా మనస్త్రీలకు దీంతో అవసరమేముంటుంది?

సత్యభామ-- స్త్రీలేమిటి, పురుషులేమిటి? విద్య అనేది ఒకటి నేర్చుకుని వుంటే దాని అవసరం ఎవరికైనా ఎప్పుడో ఒకప్పుడు కలగనే కలుగుతుంది. మా నాన్నకు నేనొక్కదాన్నే సంతానం కావడం చేత నన్ను పుత్ర నిర్విశేషంగా పెంచాడు.

నళిని-- అయితే దేవీ ఆనాడు పితృహంతయైన శతధన్వుడిమీద ఈ విద్య ప్రయోగించలేదే?

సత్య- అందుకు ప్రాణేశ్వరుల అనుమతి కావాలి గదా? అప్పుడాయన హస్తినాపురంలో ఉన్నారాయెను. నేను వెళ్ళి చెప్పగానే అయనే కలగచేసుకున్నారు. నా విద్యా ప్రదర్శనానికి మరి అవసరమే లేకపోయింది.

నళి- ఓహో అదా సంగతి? సతులవిద్యా ప్రదర్శనకు, ముందుగా పతుల అనుమతి వుండాలన్నమాట.

సత్య- సతీధర్మమంటే ఏమనుకున్నావే మరి?

నళి- అయితే దేవీ! దీనికొక్క మినహాయింపు కనబడుతున్నదే, ఇదెట్లా?

సత్య- ఎందులోనే?

నళి- దోహదక్రియలో.

సత్య- అదేమిటేవ్?

నళి- ఎంతనంగనాచివమ్మా దోహదక్రియంటే తెలియదూ? పూలచెట్లకు, తీగలకు, అకాలంలో పువ్వులు పుట్టించడానికి స్త్రీలు చేసేపని. సురపొన్నకు నవ్వూ, మోరటికి పాటా, గోరంటకు ఆలింగనం, మామిడికి కరస్పర్శా-

సత్య- ఉండుండు. అశోకానికి పాదతాడనం అని కదూ నీవు చివరకు చెప్పబోయేది?

నళి- మనకు అశోక పుష్పాలెందుకమ్మా? మనకిప్పుడు కావలసినవి పారిజాతపుష్పాలు.

సత్య- ప్రణయకోపం పట్టించుకుని ప్రాణనాథుని శిరస్సు అలవోకగా అలా వామపాదంతో తొలగదోస్తే-

నళి- పారిజాతం పుష్పిస్తుంది, అంతేనా?

సత్య- పిచ్చిదానా! పారిజాతం పుష్పించడమేమిటే? అది దేవలోకతరువు. అకాలం అనకుండా ఎల్లప్పుడూ విరియబూచే వుంటుంది.

నళి- అయితే ఈ దోహదక్రియ దేనికమ్మా?

సత్య- దేవలోకం నుంచి తర్లివచ్చి మన పెరట్లో అవతరించడానికి. తెలిసిందా?

నళి- దోహదక్రియేమో జరిగింది గాని ఫలితం మాత్రం ఇంతవరకూ శూన్యం. ఈ సంగతే మీ సవతులంతా విడ్డూరంగా చెప్పుకుంటున్నారు.

సత్య- ఓసి, నీ యిల్లు బంగారంగానూ, అప్పుడే ఆయేడిళ్ళూ చుట్టివచ్చావ్?

నళి- మీకు చెలికత్తెనై పుట్టింతర్వాత తప్పుతుందా యేమిటి? ఏపూటకాపూట తాజా వార్తలన్నీ పోగుచేసి, విశేషాలు ఒకసారికి రెండుసార్లు చెబితేనేగాని మీకు తృప్తి కలగదాయె.

సత్య- ఈపూట విశేషాలేమిటే?

నళి- చిన్నక్క జాంబవతమ్మగారు, పెద్దక్క రుక్మిణమ్మగారి భేటీకి వేంచేశారు. ఆమాటా ఈమాటా కదిపి జాంబవతి, మన సత్య ఇంత అఘాయిత్యానికి ఒడిగట్టినా ఫలితం దక్కలేదు కదా, అక్కా అని నవ్విందమ్మా.

సత్య- ఆ ఎలుగుబంటి మొగందాని మాటలకేం గాని, పెద్దక్క అందుకేమన్నదే ?

నళి- ప్రాణనాధుల వాగ్దానానికి తిరుగుండదు. సత్య పుణ్యమా అంటూ మనమందరం రోజూ పారిజాతపు పువ్వులు పెట్టుకుంటాం అని అన్నది.

సత్య- సవతైనా రుక్మిణి మహాదొడ్డ ఇల్లాలు. ప్రాణేశ్వరులు ఈ విషయంలో ఇంకా జాప్యం చేస్తున్నారెందుకో?

నళి- తమ వామపాదతాడన మాధుర్యం మరొకసారి చవిచూడాలని వారి శిరస్సు ఉవ్విళ్ళూరుతున్నదేమో నమ్మా.

సత్య- ఎంత కొంటెదానివై పోయావే నీవు.

నళి- ఇదంతా తమ సహవాసభాగ్యమే తల్లీ.

సత్య- అదేమిటోగాని నళినీ ఇప్పుడు నా మనస్సు ఆ పారిజాతం మీద లేదే.

నళి- అయితే ఇప్పుడు దేనిమీదికి మళ్ళిందమ్మా, మీ మనసు?

సత్య- ఇంతకాలంగా కొనసాగించిన ఈ ధనుర్విద్యా పరిశ్రమను సార్ధకం చెయ్యాలని ఉబలాటంగా వుంది. ఆ మహిషాసురమర్దనిలాగ ఏ మహా రాక్షసుడితోనో యుద్ధం చేసి నా శౌర్య పరాక్రమాలు లోకానికి చాటాలని ఒకటే కోరిక నా మనస్సులో సుళ్ళు తిరుగుతున్నది.

నళి- ఇది వీరపత్నికి సముచితమైన కోరికే. మీ కోరిక త్వరలోనే నెరవేరుతుంది, తప్పదు.

సత్య- నీకు జోస్యం కూడా వచ్చినట్లుందే?

నళి- జోస్యం కాదమ్మా అయ్యగారు ఆయేడిళ్ళలో ఎక్కడా కనపడకపోతే వారు ఎక్కడ ఉన్నారో ఎం చేస్తున్నారో ఆ సంగతి కూడా కనుక్కువద్దామని బయలుదేరాను. వారు సభా భవనంలో ఉన్నారు.

సత్య- ఈ వేళప్పుడు అక్కడే ం చేస్తున్నారే?

నళి- బారెడు బారెడు గడ్డాలవారు జడలు కట్టిన తలవెంట్రుకలవారు,

పుట్టగోచీలవారు చుట్టూ పరివేష్టించి ఉండగా, ఆరముగ్గిన రేగుపండ్లు అమిత ఆప్యాయంగా ఆరగిస్తున్నారమ్మా.

సత్య- ఈనాడు నీ చమత్కారానికి పట్టపగ్గాలు లేట్లుందేమే. వారు బదరికా శ్రమవాసులైన మహా మునులే! వాళ్ళు ప్రాణేశ్వరుని నరనారాయణావతారంలో ఆయన చెలికాళ్ళు వస్తూ ఆయనకు ప్రీతిపాత్రమైన ఆ బదరీఫలాలు కానుక తెచ్చివుంటారు. ఎందుకొచ్చారో, ఆమహాత్ములు?

నళి- ఊరికేవస్తారటమ్మా, మహాత్ములు! ఎవరో నరకాసురుడట. యజ్ఞ భాగా లివ్వలేదని వాళ్ళను ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగించాడట. ఆ గోడంతా వెళ్ళబోసుకోడానికి వచ్చారు.

సత్య- అయితే వాడికి ఆయుస్సు మూడిందన్నమాటే. ఎవడే ఆ నరకాసురుడు?

నళి- ఎవరోనమ్మా నాకేం చెలుసు? వాళ్ళ సంభాషణను బట్టి వాడెవడో లోకకంటకుడైన ఒక మహారాక్షసుడనిపించింది. అయ్యగారు వాళ్ళను సముదాయించి ఇలా పంపించారో లేతో అలా ఒక దివ్యపురుషుడు పై నుంచి వూడిపడ్డాడు.

సత్య- ఎవరే, ఆయన?

నళి- మనపారిజాతవృక్షపు ఖామందమ్మా.

సత్య- దేవేంద్రుడా? ఆయనకేమొచ్చింది?

నళి- ఆ నరకాసురడేనమ్మా లోకాలన్నీ ఆక్రమించి లోకపాలకులను లోకయాత్రికులను చేసి వదిలిపెట్టాడట.

సత్య- అయితే ఇప్పుడు పారిజాతవృక్షం నరకాసురుడి స్వాధీనంలో

వుందన్నమాట. భేష్. ఈ దెబ్బకు రెండు పక్షులూ పడవలసిందే.

నళి- ఏమిదెబ్బో, ఏమిపక్షులో అరుగో అయ్యగారు వేంచేస్తున్నారు. కోపగృహం సిద్ధం చెయ్యమన్నారా?

సత్య- అక్కర్లేదు లేవే పద, ప్రాణేశ్వరులకు ఎదురుపోయి స్వాగతం చెబుదాం.

(శ్రీకృష్ణుడు , సత్యభామా, గరుడవాహనం మీద ఆకాశమార్గాన పోతూఉంటారు.)

సత్య- నాథా! ఈ పక్షివాహనం మీద ఈ వ్యోమయానం పరమా నంద కరంగా వుంది సుమా.

శ్రీకృ- సత్యా జాగ్రత్త! పరమానందంలో పడి మేను మరిచి పట్టువదిలావో క్రిందపడగలవు.

సత్య- ఏం విచిత్రమండీమీది! సువిశాలమైన ఈ గరుత్మంతుడి వీపుమీద ఎంత మందైనా పదిలంగా కూర్చోవచ్చు. మనోవేగాన్ని మించిన వేగంతో ఈయన గాలిని చీల్చుకుంటూ ముందుకు దూసుకుపోతున్నాడు. ఇవేమిటండీ ఇవి, రంయిమని మీదికి వచ్చినట్లువచ్చి ప్రక్కల నుంచి తుప్పుకుపోతున్నై?

శ్రీకృ- ఇవి సిద్ధసాధ్యవిద్యాధర కిన్నర కింపురుషాదుల విమానాలు. (ఆదుర్దాగా) సత్యా సత్యా నీవేణీ, వోణీ గాలికి వదిలి పెట్టేవ్ సుమా, గాలివాటుకవి ఏ విమానానికైనా పట్టుకుంటే ప్రమాదం.

సత్య- ఏమిటండీ మీరు మరీనూ, చిన్న పిల్లకు చెప్పినట్లు చెబుతున్నారు! చౌళ్ళం చుట్టి నా వేణిని దిగ్బంధం చేశాను. పమిటకొంగు వెనుకకు ఈడ్చిలాగి కుడివైపున కట్టి బంధించాను.

శ్రీకృ- సత్యా, ఎందుకైనా మంచిది. దగ్గరగా జరిగి నా వీపునానుకుని నన్ను గట్టిగా పట్టుకో.

సత్య- బాగానే వుంది మీ సరసం. ఈ అనంతవాయు పథంలో నా మనస్సు లోకకళ్యాణ సాపేక్షమై శివమూర్తిగా రూపొందుతున్నది.

శ్రీకృ- భేష్, సత్యా భోగలాలసులైన ఈ నిరంతర విమాన సంచారులకు బుద్ధే ఉంటే జగత్కళ్యాణం ఏనాడో అవలీలగా సిద్ధించి ఉండేది. లోకకంటకుడైన నరకాసురుడు నీ పవిత్రమనోబలంచేత హతాయుష్కుడైనాడు. ఇదిగో, వాడి ప్రాగ్జ్యోతిష నగరానికి వచ్చేశాం.

సత్య- నాథా. ఇవేమిటీ పట్టణం చుట్టూ ఏవో తాళ్ళలాటివి అల్లిబిల్లిగా అల్లుకుని వున్నై? సూర్యకిరణాలు కూడా చొచ్చుకుని పోవడానికి వీలు లేకుండా వుందే, మనమీ నగరంలోకి ప్రవేశించేదెట్లా?

శ్రీకృ- ఇవి మురాసురుడు తన మాయతో సృష్టించిన పాశాలు. వాడు నరకాసురుడి అనుచరుడు. ప్రాగ్జ్యోతిషపుర రక్షకుడు. ఇదుగో నాచక్రాన్ని ప్రయోగిస్తున్నాను. చూడు ఏం జరుగుతుందో!

సత్య- ఇదేమి అద్భుతం, నాథా మీ చేతినుంచి విడిపడ్డదో లేదో, ఈ చక్రం కోటిసూర్యులకాంతితో కళ్ళు మిరుమిట్లు గొలుపుతూ మురపాశాల మీదికి రివ్వున ఉరికింది.

శ్రీకృ- నా చక్రమంటే ఏమనుకున్నావ్ సత్యా! సూర్యుణ్ని తరిమెన పట్టగా రాలిన కిరణరజంతో విశ్వకర్మ దీన్ని నాకు చేసిచ్చాడు.

సత్య- మీ చక్రధారలకు మురపాశాలన్నీ తునాతునకలై సూర్యకిరణాలకు మంచులాగా విడిపోయాయి. అడ్డం వచ్చిన మురాసురుడికీ వాడి అనుచరులకూ మెడకాయల మీద తలకాయలు లేవు. నాథా

వాథా! ఇదేమిటీ విపరీతం? ఈ చక్రం రివ్వున తిరిగి వస్తున్నది, మనమీదికి కాదు గదా?

శ్రీకృ- ఇందులో విపరీతమేమీ లేదు, సత్యా! చెప్పినపని పూర్తిచేసుకుని ఇది మళ్ళీ నా చేతిలోకే వస్తుంది.

సత్య- ఇది పరమాశ్చర్యకరంగా వుందే, అరుగో, వేలకువేలు రాక్షసులు యుద్ధసన్నద్ధులై నగరం వెలువడి మనపైకి వస్తున్నారు.

శ్రీకృ- మరేం ఫరవాలేదు. వాళ్ళపని మనగరుత్మంతుడు చూస్తాడు.

సత్య- మీరామాట అన్నారో లేదో, ఈ మహానుభావుడు ఉప్పొంగిపోయి మేరుపర్వతమంత అయినాడే! రెక్కలతో పడగొట్టి, ముక్కుతో చెక్కి, గోళ్ళతో రక్కి, కాళ్ళతోమట్టి, ఈ రాకాసిమూకను నిమిషంలో నిశ్శేషం చేసి పారేశాడు. పరాక్రమమంటే ఇలా ఉండాలి. నాథా ఆ నరకాసురుడేడీ? ఎక్కడా కనపడడేం?

శ్రీకృ- ఆ దుర్మదాంధుడి కింకా సంగతి తెలిసివచ్చినట్లులేదు, ఉండు, ఈ పాంచజన్యం పూరించి వాడి మత్తువదల గొడతాను.

(పాంచజన్య ధ్వానం)

సత్య- అబ్బ ఇదేం శంఖధ్వానం బాబూ, చెవులు చిల్లులు పడిపోయాయి! ఈ ధ్వనికి నగరం నగరమంతా దద్దరిల్లిపోయినట్లుంది. ఉసుళ్ళపుట్ట పగిలినట్లు రాక్షససైన్యం బిలబలా బయటకి వస్తున్నది. నాథా ఆ సేనా మధ్యంలో మహోన్నతమైన రథం మీద చెవులరత్నకుండలాలు ధగద్ధగాయమానంగా మెరిసిపోతున్న ఆ వీరుడెవరు?

శ్రీ.కృ. సత్యా! వాడే, నరకాసురుడు. ఇక మనకు చేతినిండా పని.

నరకాసురుడు. చెప్పకుండా పెట్టకుండా దొంగచాటుగా నా నగరం మీదికి

వచ్చావే, దారి తప్పివచ్చావా యేం?

శ్రీ.కృ. దుష్టచిత్తులై దారితప్పి చరించే వాళ్ళను శిక్షించి వారికొక దారి చూపించడమే నా పని.

నర. అబ్బో మాటలు కోటలు దాటుతున్నయే! ఈ చచ్చు బొల్లిగద్దనెక్కి ఆ తుక్కుబండిగానొకటి చేతబట్టి, త్రిభువన భయంకరుడైన ఈ నరకాసురుడి మీదికే రావడానికి సాహసించావే, ఎవర్రా నీవు?

శ్రీ.కృ. మూర్ఖుడా! తల్లిదాస్య విముక్తికి దేవలోకం నుంచి అమృతం సాధించి తెచ్చిన ఈ మహానీయుడు నీ కళ్ళకు బొల్లిగద్దగా కనపడుతున్నాడటరా?

నర. ఎట్లాగూ? ఈ పక్షి అమృతం సాధించాడూ? నేను దేవలోకం జయించినప్పుడు ఎంత గాలించినా అది నాకు కనపడనేలేదే. అది సరేగాని, చేతిలో ఆతుప్పుపట్టిన బండిచక్రం ఎందుకురా నీకు?

శ్ర.కృ. ఎందుకా, నీ కంఠం ఉత్తరించడానికి. ఇది విశ్వకర్మ నిర్మితమైన విష్ణుచక్రంరా, అవివేకీ! లోకకంటకులైన దుష్టులను సంహరించి జగత్కళ్యాణం సమకూర్చడమే దీనిపని. నీ తాతల్లాంటి రాక్షసులెందరో దీనికి బలి అయినారు.

నర. (భయం నటిస్తూ వెటకారంగా) ఇంతకూ ఈ అమోఘాయుధం ధరించిన తమరెవ్వరో సెలవిచ్చారు కాదేం, మహానుభావా?

శ్రీ.కృ. కన్న తలిదండ్రులను కూడా గుర్తించలేని పరమమూర్ఖుడివి, నా సంగతి నీకేం అంతుపడుతుందిరా? నేను వాసుదేవుణ్ణి.

నర. అరె! గాడిదకాళ్ళు పట్టుకున్న ఆ మహావీరుడి కొడుకువా నీవు? నీ సంగతి ఇప్పుడు తెలిసిందిలే.

శ్రీకృ. ఏం తెలిసిందిరా, నీకు .

నర. తెలిసిందిలేవోయ్, మహా చెప్పొచ్చావ్, కాకపోతే నేను సర్వాంతర్యామిని అంటావ్, అంతేకదూ? నీ సర్వాంతర్యామిత్వం చట్టుబండలైనట్లేవుంది. ఆనాడు దేవేంద్రుడితో సహా దిక్పాలకులందర్నీ దిక్కులపాలు చేసి దిశాపట్టంగా తోలి తొప్పరలుపెట్టినప్పుడు ఏమైనావురా నీవు?

శ్రీ.కృ. నీకు తెలియకుండా నీ వెన్నంటే వున్నారా, అజ్ఞానీ! ఈనాటికిక నీ పాపం పండింది. ఇప్పుడు ప్రత్యక్షమైనాను.

నర. నా పాపంకాదురా పండింది. నా పుణ్యం పండి నేటికి నీవు నాపాలబడ్డావు. నిన్నీరణరంగానికి బలియిచ్చి పూర్వం నీ మాయోపాయాలకు బలైన మా రాక్షస స్వాములకందరికీ ఆత్మతృప్తిగా నీ రక్తంతో తర్పణాలు వదులుతాను.

సత్య. నాథా! వీడిపని పట్టిందాకా వీడిట్లా వాగుతూనే వుంటాడు.

నర. ఆహా ఏమి అందం. ఏమి చందం! ఇందాకటి నుంచీ ఈ నల్లవాడితో మాటలు పెట్టుకుని నిన్ను గమనించనేలేదు. మేఘమండలం నుంచి విడివడ్డ మెరుపులాగా తళుక్కున మెరిశావు. ఎవరే భామా, నీవు?

శ్రీ.కృ. ఈమె నా భార్య సత్యభామ.

నర. భువనమోహన సౌందర్యవతులైన భార్యలను ఎన్నిక చెయ్యడంలో మాత్రం నీ తెలివి తేటలను మెచ్చుకు తీరవలసిందే. ఇంతచక్కని చుక్క ఈ లోకంలోనే వున్నదని తెలిస్తే ఆముదిజంత ఊర్వశి కోసం అంతగా ఆరాటపడకనే పోదును. ఒప్పులకుప్పా ఒయ్యారి భామా, ఈ నల్లవాడు నీకెంత మాత్రం తగడు. వీణ్ణి

వదిలించుకోడానికే నా మీద యుద్ధానికి పురికొల్పి తీసు కొచ్చి నట్లున్నావ్. నిన్ను చూస్తుంటే నా వొళ్ళు పరవశమైపోతున్నది.

సత్య. ఇంకాసేపటికి పరాత్పరుడి వశమై పోతుందిలేరా, మూర్ఖా! నాథా ఇంకా చూస్తారేం? వీడి వదరుబోతుతనం మితిమీరిపోయింది.

శ్రీ.కృ. ఒరే, నరకా! నిన్నిప్పుడే హతమారుస్తాను. అప్రతిహతమైన నాబాణం ఇదుగో, కాచుకో !

నర. అహ్హా హ్హా హ్హా ! ఎంతలావు బాణంరా నీది. నాబాణం దాన్ని దారిలోనే తుత్తునియలు చేసి పారేసింది. ఇదుగో యముడికోరలాంటి నా బాణం! చూచుకో, కాచుకో.

శ్రీ.కృ. (బాధాసూచకంగా) అబ్బ!
( పడిపోయిన చప్పుడు - విషాదసంగీతం - విరామం)
ఏం జరిగింది సత్యా!

సత్య. నాథా! ఏమీ లేదు. ఈ నరకుడేసిన బాణం మీ నుదుట గాటంగా నాటింది. ఆ దెబ్బకు మీరు సొమ్మసిల్లి గరుత్మంతుని మూపుమీద వాలిపోయారు. నేను బాణం పెరికి కారుతున్న నెత్తురు చేతులతో తుడిచి పమిటకొంగుతో విసిరాను. ఈ గరుత్మంతుడు కూడా తన రెక్కలతో మీకువిసిరాడు. మీరు తేరుకున్నారు. అంతే.

శ్రీ.కృ. సత్యా నేను బాగా అలిసిపోయాను. కొంచెంసేపు విశ్రాంతి తీసుకుంటాను. ఈలోగా నీవు వీడితో యుద్ధంచెయ్యి. నీ కోరిక కూడా అదేగా. ఇంద, ఈ విల్లు తీసుకో.

సత్య. ధన్యురాలిని, నాథా, ధన్యురాలిని! నా చిరకాలవాంఛితం నేటికి నెరవేరింది. మీ విల్లు చేతికి తీసుకోగానే నాకు వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లుంది. ఇక వీడి పని పట్టిస్తాను. ఒరే, నరకాసురా!

నర. ఏమే, భామా, మరువంపుమొలకా?

సత్య. నాతో యుద్ధం చెయ్యి.

నర. అవ్వ. ఇంతబతుకు బతికి ఇంటివెనకపడి చచ్చాడన్నట్లు, ఆడదానితోనా యుద్ధం?

సత్య. ఇది ఆడది కాదురా. నీ పాలిటిమిత్తి కాచుకో!

నర. భేష్ బాణం బాగానే వదిలావ్ అస్త్రవిద్యలో మంచి పరిశ్రమ వున్నట్లేవుంది. నా బాణంతో నీబాణం పరాస్తమై పోయింది.

సత్య. ఇవిగో, పుంఖాను పుంఖాలుగా బాణాలు వదిలాను. వీటితో నీ పని అయిపోయింది.

నర. సెబాష్! భామా నీ ధనుర్విద్యా కౌశలానికివే నా జోహార్లు. నన్ను విరథుణ్ని చేశావు. అంతేగాక నాపని అప్పుడే ఎక్కడైపోయింది? అడుగో, ఆపక్షివీపు మీద గువ్వలాగా కూర్చున్నాడే వాడు లేస్తేగాని నాపని పూర్తికాదు.

శ్రీ.కృ. సత్యా నీరణకౌశలం నన్ను ముగ్ధుణ్ని చేసింది సుమా! బాగా అలిసిపోయావ్. ఇక వీడిసంగతి నేను చూచుకుంటాను. ఏదీ, చెదరిపోయిన నీ ముంగురులు సవరించనియ్యి. చెమటపట్టిన నీ ఫాలభాగం తుడవనియ్యి.

నర. ఒరేయ్! ఒక్కదెబ్బతో హడిలిపోయి ఆడదాన్ని నా మీది కుసికొల్పి ఇప్పుడు సందు దొరికిందికదా అని పక్షివాహనం మీదనే ప్రణయకలాపం సాగిస్తున్నావే, ఏనాటి మగవాడివిరా నీవు లే. లేచి నాతో యుద్ధం చెయ్యి. నిన్ను హతమార్చి ఈ భామను కైవసం చేసుకుంటాను.

సత్య. నాథా. ఇదుగో మీ శార్ఙ్గం.

శ్రీ.కృ. సత్యా ఇప్పుడిక దాంతో పనిలేదు. దుష్టరాక్షసకంఠ విదళన క్షమమైన నా సుదర్శన చక్రాన్ని ఈ మదోన్మత్తుడి మీద ప్రయోగిస్తాను. ఒరే ప్రగల్భాలరాయుడా. నీవు బండిగానని ఎగతాళిచేసిన ఈ చక్రాన్ని నీ మీదికి దొర్లిస్తున్నాను. మృత్యుకన్యను కైవసం చేసుకో.

సత్య. ఇదే మాశ్చర్యమండీ. మీ చక్రం భూనభోంతరాళమంతా తానే భూమై వీణ్ణి చుట్టుముట్టింది. దాన్ని అడ్డుకోడానికి వీడు చేసిన ప్రయత్నమంతా వృధా అయింది. వీరి అస్త్రసంచయమంతా ఖాళీ. అది వీడికంఠాన్ని ఒడిసిపట్టింది.

నర. అయ్యో అయ్యో ఈ చక్రం నా కుత్తుకను కోసివేస్తున్నది. ఊపిరాడడంలేదు. బాధతో అమ్మా------ అమ్మా------ అ----- మ్మా (మొండెం భూపతనమైన చప్పుడు.)

సత్య. ఎవరండీ ఈమె? వీడు నేలకొరిగిన చోట శోకరసం కరుడు కట్టినట్లు ఒకపరిదీన వనితామూర్తి ప్రత్యక్షమైందే ! వీణ్ని ఒడిలోకి తీసుకుని ఆమె విలపిస్తున్నది. చిక్కుజీరైన ఆమె వినీలకేశపాశాలు మహావృక్షలతా సముదాయాన్ని తలపిస్తున్నవి. గాడ్పులకు చెమ్మగిల్లిన ఆమె సువిశాల నయనాంచలాలలో సమస్త నదీ నదాలూ, సప్త సాగరాలూ తొణికిసలాడుతున్నట్లున్నై. ఎవరండీ ఆమె?

శ్రీ.కృ. సత్యా ఆమె భూదేవి. ఆది యజ్ఞవరాహావతారం నాటి నా ప్రియురాలు.

సత్య. ఆమె నరకాసురుడి రత్నకుండలాలు తీసుకుని లేచింది. ఒక కుర్రవాణ్ని వెంటబెట్టుకుని ఇటే వస్తున్నది.

భూదేవి. (గద్గదస్వరంతో) నాథా. ఆనాడు నేను సలిలమగ్ననై పాతాళానికి దిగబడిపోయినప్పుడు యజ్ఞవరాహమూర్తివై నన్ను నీ కొమ్ముతో ఎత్తి నిలబెట్టావు, జ్ఞాపకముందీ అప్పుడు పుట్టాడీ దురదృష్టవంతుడు. అప్పుడు నీవే వీణ్ని నా కిచ్చావ్, ఇప్పుడు వీణ్ని మళ్ళీ నీవే తీసుకున్నావ్. కంచే చేను మేసినట్లయింది, నేనిక ఏడ్చిమాత్రమేం లాభం? అయినా కన్నకడుపు కాబట్టి ఈ నిర్భాగ్యుడి కోసం చుమ్మలు చుట్టుకుపోతున్నది.

శ్రీ.కృ. దేవీ ఊరడిల్లు. పుట్టినవేళా విశేషమో ఏమో వీడు పరమదుర్మార్గుడై లోకకంటకుడైనాడు. కొడుకని చూడకుండా వీణ్ని శిక్షించడం నా కర్తవ్యమై పోయింది. ఈ అజ్ఞాని తండ్రినైన నన్ను కొంచెమైనా గుర్తించనేలేదు.

భూ.దే. తల్లిని మాత్రం గుర్తించాడూ, వీడూ? బ్రతికినన్నాళ్ళూ నాకు నానా బాధలూ కలిగించి నా మనస్సును క్షోభపెట్టాడు. చచ్చేటప్పుడు మాత్రం అమ్మా అని ఆక్రందిస్తూ నా ఒడిలో వొరిగిపోయాడు. వీడి బ్రతుకు ఈ విధంగా తెల్లవారింది. నాథా ఈ పసివాడు నరకాసురుడి కొడుకు, భగదత్తుడు. అన్నెమూ పున్నెమూ ఎరగడు. వీడిపైన నీ చల్లని చూపు ప్రసరింపజెయ్యి.

శ్రీ. అలాగే, దేవీ. ఈ నీమనమణ్ని ప్రాగ్జ్యోతిషపురానికి పట్టం కట్టు. వీడు చూస్తే చాలా మంచివాడుగా కనపడుతున్నాడు. వీడికి నా రక్ష ఎల్లప్పుడూ వుంటుంది.

భూ.దే. నాథా! మహాభాగ్యం. ఇవిగో నరకాసురు డపహరించిన అదితిదేవి రత్నకుండలాలు. పిచ్చితండ్రి వీటిని పెట్టుకుని మురిసిపోవడం ఒకటే చూచుకున్నాడు గాని, ఈ దురాగతం వల్ల సర్వనాశనం అవుతుందని తెలుసుకోలేపోయాడు.

శ్రీ.కృ. పరమమూర్ఖుడు! మనమేం చేస్తాం, దేవీ!

భూ.దే. నాథా ఇక నాకు సెలవా?
శ్రీ.కృ. మంచిది. వెళ్ళిరా, దేవీ. నీకూ నీ మనమడికీ శుభం.
(కించిద్విరామం)

సత్య. నరకాసురుడు మీ కొడుకటండీ! చెప్పారేకాదు? మీ దుష్టశిక్షణా వ్రతం ఆదర్శప్రాయమైందిప్పుడు. ఇక మనమేం చెయ్యాలి నాథా?

శ్రీ.కృ. మా తల్లి అదితిదేవి----

సత్య. అమె దేవేంద్రుడి తల్లికదూ? మీకు అమ్మ ఎప్పుడైంది?

శ్రీ.కృ. నా వామనావతారం అమె కడుపుపంటే, సత్యా. అమె కుండలాలు అమె కివ్వడానికి ఇప్పుడు మనం దేవలోకం పోవాలి.

సత్య. భేష్. నాకోరికకూడా అదే.

శ్రీ.కృ. అత్తగారిమీద అంత భక్తిప్రపత్తులున్నందుకు నిన్ను అభినందిస్తున్నాను సత్యా.
సత్య. అత్తగారిమీద భక్తిసంగతి దేవుడెరుగు. పారిజాతం మీది ప్రపత్తి స్వామీ ఇదీ! చేసిన వాగ్దానం అప్పుడే మరిచిపోయారా?
శ్రీ.కృ. అబ్బే లేదు. అది అంత సులభంగా మరిచిపోవడానికి వీలా?

సత్య. ఆ మాటంటూ తలతడువుకుంటారెందుకండీ?
శ్రీ.కృ. ఆ కలహభోజన ముని ఏ ముహూర్తాన ఆపారిజాత పుష్పం మన ద్వారకకు తెచ్చాడోగాని, అప్పటినుంచీ నాకిదొక అలవాటై పోయింది.
సత్య ఆ పారిజాతవృక్షం తీసుకొస్తే గాని ఈ అలవాటుపోదు.

శ్రీ.కృ. అందుకు నేను సిద్ధమే సత్యా. కాని అన్నగారేమంటారోనని

అనుమానంగా వుంది.

సత్య. ఏమంటారు? నరకాసురుణ్ని చంపి తమరాజ్యం తమకిప్పించినందుకు ఈ విధంగా తమ కృతజ్ఞత చూపించుకుంటారు.

శ్రీ.కృ. అది అంతసులభమని అనుకోను, సత్యా! మగవాళ్ళం మేము ఎలాగైనా సరిపెట్టుకోగలం గాని, మా వదిన శచీదేవికి, ఆ పారిజాతం ప్రాణంలో ప్రాణం. భార్యకోసం ఆయన నాతో యుద్ధానికి రావచ్చు.

సత్య. కొడుకుతో యుద్ధం చేసినవాళ్ళు అన్నతో చెయ్యలేరూ?- మరి మీరు మీ భార్యకోసం ఏం చేస్తారు?

శ్రీ.కృ. ఏమైనా సరే, పారిజాతవృక్షం తీసుకువస్తాను. పోదాంపద, దేవలోకానికి.

సత్య. మీరంటే సాక్షాత్తు విష్ణుదేవులు. నేను మానవకాంతను. దేవలోకానికి మానవులు పోగలరా?

శ్రీకృ. సత్యా. నీవు మానవకాంతవేమిటి? నీవు ఆదిసురాంగనవు సుమా. అందుకే నీ యెడమకాలి అందె మాటిమాటికి ఘలుఘల్లు మంటుంటుంది. అన్నప్పుడల్లా నాతల జలుజల్లు మంటుంది.

సత్య, నాథా. ఎప్పుడో ఏదో చేశానని అస్తమానం వేళాకోళం చేస్తే ఎట్లా? పదండి, దేవలోకానికి పోయి పారిజాతం తీసుకుని ఇంటికి పోదాం.

(ప్రసారం తేది 28-10-62)

# “గోవుమాలచ్చిమికి కోటిదణ్ణాలు”

*గొంతులు:*

1. వయసు మళ్ళిన ఆడగొంతు
2. మధ్యస్థపు మగగొంతు
3. పడుచు ప్రాయపు ఆడగొంతు

ఆడగొంతు: గోవుకూ పూజ చేసేమూ
కోటి దణ్ణాలు పెట్టేమూ

1. బ్రహ్మలోకానికీ పైనా
సత్యలోకములోన వెలిసీ
చందమామా తోటి కలిసీ
పొందుగా సంచరించేటీ -- గోవుకూ---

2. సురభి మార్తాండులకు పుట్టీ
సౌరభేయ పదము మెట్టీ
అమృతమే పాలు గావించీ
అవని కానందమ్ము పంచే --- గోవుకూ---

3. లేగనోటీ పాలనురుగూ
తీగసాగీ పైన బడినా
అభవు సెగ కంటి మంటలకూ
కపిల వర్ణము పొంది నట్టీ -- గోవుకూ---

మగగొంతు: నీ పాట చాలా బాగుంది, కాని చప్పున అర్థం కావడం లేదమ్మా.

ఆడగొంతు: అర్థం కాకపోవడానికి ఇందులోగహన విషయాలేమున్నై, నాయనా! గోవును గురించి మన సంస్కృతిలో జీర్ణించుకొని పోయిన భావాలే కొన్ని ఇందులో ఉన్నై. ఆ సంస్కృతిని చాటే మన పురాణ గ్రంథాలతో పరిచయం వున్న వాళ్ళకు నా పాట ఇట్టే అర్థమవుతుంది.

మ: ఇప్పుడా పుస్తకాలు చదవడానికి మాకు ఓపికాలేదు, తీరికాలేదు. ఆ అర్థాలేవో నీవే చెప్పి పుణ్యం కట్టుకోవాలి. గోవులు మనతోపాటు ఇక్కడే వున్నై కదా, వాటి కేదోలోకం వేరే

వుందంటావేమమ్మా?

ఆ: అవున య్యా మన పూర్వులు అలాగే భావించారు. సత్యలోకమే గోలోకం. అక్కడ అవి చంద్రుడితో కలిసి సంచరిస్తూ ఉంటై.

మ: చంద్రుడికీ వాటికీ ఏం సంబంధమమ్మా.

ఆ: చంద్రుడు అమృతకరుడు. ఓషధీశుడు. తన కిరణాల చలవచేత ఓషధులను పెంపొందించి మనకు అమృతం పంచుతాడు. ఆవు మనకు పాలిస్తుంది. ఆవు పాలు కూడా అమృతమే.

మ: అది నిజమే. గంగిగోవు పాలు గంటెడైనను చాలు అని వేమన్న అన్నది అందుకే గదా. ఈ గోలోకం ఎక్కడ వుందమ్మా?

ఆ: లోకాలన్నిటికీ పైన, బ్రహ్మలోకానికి కూడా పైన, ఉంది.

మ: బ్రహ్మ సృష్టికర్త కదా ఆయన కంటే ఎక్కువా ఈ గోవులు?

ఆ: సృష్టికర్త కూడా సృష్టించబడ్డవాడే. గోవుతో సమానమైన మహావస్తువు ఒక్కటే. అది సత్యం. అందుకే గోలోకాన్ని సత్యలోకమంటారు.

మ: నీపాటలో గోవుల పుట్టుకను గురించి ఏదో వుంది అదేమిటో సవిస్తరంగా చెబుతావా?

ఆ: చెబుతా విను. విశ్వకర్మ వున్నాడే, ఆయన తపోదీక్షలో ఉండి మనోవృత్తి చేతనే ఒక కన్యను సృష్టించాడు.

మ: మంచి పనే చేశాడు. తపస్సు చేసుకనే వాళ్ళకు ఇదేం పనమ్మా.

ఆ: ఆయన ఆపని యజ్ఞం కోసం, మోక్షం కోసం చేశాడయ్యా. ఆకన్య పేరు సురభి. ఆమె అమృతమయమూర్తి, కామరూపిణి. ఆ వెంటనే విశ్వకర్మ మహాతేజోమయుడైన ఒక పురుషుణ్ణి కూడా

సృష్టించాడు.

మ: ఆ పురుషుడి పేరేమిటో?

ఆ: వస్తున్నా! ఆ పురుషుడు ఆ సుందరిని చూచి కామమోహితుడై ఆర్తి పొందాడు.

మ: సరి సరి మహాత్ములకు కూడా ఇది తప్పలేదన్నమాట.

ఆ: సృష్టి స్థితి లయ హేతుభూతులైన త్రిమూర్తలకే అది తప్పలేదు. ఈ సృష్టి రహస్య మంతా అందులోనె ఉంది. అప్పుడు బ్రహ్మ చక్కా వచ్చి 'మార్తోభవ' అని ఆ పురుషుణ్ణి ఊరడించాడు. ఆయన మార్తాండు డైనాడు.

మ: 'మార్తోభవ' అంటే ఏమిటమ్మా?

ఆ: ఆర్తుడవు కావద్దు అని. అప్పుడు బ్రహ్మ ఏంచేశాడో తెలుసా. సురభిని మార్తాండుడికిచ్చి, వాళ్ళకు పుట్టే సంతానం, యాగం కోసం, మోక్షంకోసం, పాలిచ్చేవై తనలోకానికి పైన సంచరించేటట్లుగా వరమిచ్చాడు. ఆ సౌరభేయులే గోవులు.

మ: ఎంత మంచి కథ చెప్పావమ్మా. అయితే కపిల వర్ణమంటే ఏమిటి?

ఆ: గోరోజనపు రంగు.

మ: గోవులకు ఆ రంగు ఎలా వచ్చిందమ్మా.

ఆ: ఈ సౌరభేయులు ఒకసారి హిమవత్పర్వతంపైన విచ్చలవిడిగా సంచరిస్తున్నై. అప్పుడు ఒక దూడపాలు తాగుతుంటే దాని నోటి పాల నురుగు గాలికి పోయి అక్కడ తపస్సు చేస్తున్న శంకరుడి తలమీద పడ్డది. అందు కాయనకు కోపం వచ్చి చిచ్చర కన్ను

తెరిచాడు.

మ: ఆ మంటకు ఆవులన్నీ మాడి భస్మమై పోలా?

ఆ: అగ్నిమయయాలూ, అమృతమయయాలూ నాయనా గోవులు! ఆ మంట వాటినేం చేస్తుంది. దానికి అగపడ్డ గోవులు మాత్రం కపిల వర్ణానికి తిరిగాయి. అంతే.

మ: తరవాత

ఆ: గోవులన్నీ బిత్తరపోయి చంద్రుడి వద్దకు వెళ్ళిపోయాయి. ఈ సంగతి తెలిసి బ్రహ్మ, శివుడి వద్దకు చక్కా వచ్చాడు. వచ్చి, అమృతానికి ఎలా ఎంగిలి లేదో అలాగే ఆవు పాలకూ ఎంగిలి లేదని చెప్పి, శంకరుణ్ని ప్రసన్నుణ్ని చేశాడు. ఆయన గోవులను కరుణార్ద్ర దృష్టితో చూచి, తన చూపు వల్ల రంగు మారిన కపిల గోవులను తక్కిన గోవుల కంటే మేలైనవిగా పూజలందు కుంటాయని వరమిచ్చాడు.

మ: గోవుల విషయంలో ఎంత గ్రంథం వుందమ్మా!

ఆ: ఇంకా చాలా వుంది. చెప్పడానికిప్పుడు వ్యవధి లేదు.

ఆడగొంతు 2 : ఈ నిన్నటి కబుర్లిక చాల్లేవమ్మా. ఇప్పుడెవరికి కావాలివి?

ఆ: అమ్మాయ్ నీ వెవరో చదువుకున్న దాని వల్లే ఉన్నావ్. నిన్న మీద అలా విరుచుకు పడితే ఏం లాభం, తల్లీ! నిన్న నుంచి నీకు సంక్రమించిన ఆస్తి నిన్న పోయిందని వదులుకుంటానంటావా. ఉంచి, నేటికీ రేపటికీ వాడుకోవద్దూ! నిన్నను నేటితో సమన్వయం చేసి నీ రేపును సుసంపన్నం చేసుకో. అదీ సవ్యమైన పద్ధతి. ఇంతకూ గోపూజ పనికి రాదంటావా.

ఆ 2: నేనలా ఎందుకంటాను? ఒక పక్క గోవుకు పసుపు రాచి కుంకం

బొట్టు పెట్టి ధూపం వేసి హారతెత్తి, ఇంకొక పక్క దాన్ని సరిగా పోషించక డొక్కలు మాడిస్తే మాత్రం లాభం లేదంటాను.

మ: అయితే ఇప్పుడు గోపూజ ఎలా చెయ్యాలో నీవు చెప్పమ్మాయ్.

ఆ 2: సమస్త సృష్టిలోనూ గోవు చాలా ఉత్తమమైందే, అందుకు సందేహం లేదు. కాని గోవు ఎలా ఉత్తమ సృష్టో, మనం కొంచం ఆలోచించాలి. దేశానికి రైతు వెన్నెముక అంటారు గతా. రైతుకేది వెన్నెముక?

మ: ఏదో నీవే చెప్పు.

ఆ 2: రైతుకు వెన్నెముక గోవు, అతడి వ్యవసాయానికి కావలసిన పశు సంపదను ఉత్పత్తి చేస్తుంది కాబట్టి.

మ: వ్యవసాయానికి ఇంకా కోడెలూ, ఎద్దులూ, ఎందుకమ్మాయ్. ట్రాక్టర్లు పెట్టి దున్నిస్తే సరిపోలా?

ఆ 2: మన దేశంలో పొలాలన్నీ దున్నడానికి లక్షల కొద్దీ ట్రాక్టర్లు కావాలి. ఆపరిస్థితి రావడానికి ఇంకొక వంద సంవత్సరాలైనా పడుతుంది. అప్పటి దాకా పశువులే మనకు శరణ్యం. పశుసంపదకు ఉత్పత్తి స్థానమైన గోవును మనం ఎలా చూస్తున్నామన్నదే ఇప్పుడు ప్రశ్న.

మ: ఎలా చూస్తున్నామంటావ్.

ఆ 2; మన దృష్టి ఎంత సేపటికీ మనకు సద్యా పనికివచ్చే ఎద్దుల మీదనే. అవి తొక్కి తొంబాడిన మేత తీసుకుపోయి ఆవు ముందు రాలుస్తాం. మళ్ళీ గోమాత అని పూజ చేస్తుంటాం. పూర్వ రైతులు విధిగా బీళ్ళు వుంచేవారు, పశువులకోసం. ఇప్పుడు రూపాయల మోజులోపడి అనువైన భూమంతా దున్ని వ్యాపారపు పంటలు పండిస్తున్నారు. పశువులు పుష్టిగా

ఉండాలంటే వాటికి పచ్చి మేత పుష్కలంగా ఉండాలి.

మ: బాగుంది గోసంవర్ధన విషయంలో ఇంకా ఏం చెయ్యాలంటావ్?

ఆ 2: మన దేశంలో పశువులకు వచ్చే జబ్బులు ఇన్నీ అన్నీ కావు. ప్రతి గ్రామానికీ ఒక పశు వైద్యశాల వుండాలి. పని చేసినన్నాళ్ళూ చేసి జవసత్వాలుడిగిన పశువులను మనమేం చేస్తున్నాం. నిర్దాక్షిణ్యంగా కసాయి అంగడికి తోలుతున్నాం. అలాటి వాటికి గోసంరక్షణ శాలలు దేశమంతటా ఏర్పాటు చెయ్యాలి. అన్నిటి కంటే ముఖ్యమైన విషయం ఇంకొకటుంది.

మ: ఏమిటమ్మాయ్ అది.

ఆ 2: మన దేశంలో పశువులేమో విస్తారంగానే వున్నాయి. కాని అవి ఎక్కువగా ఉత్తమ జాతికి చెందినవి కావు. ఇతర దేశాల ఆవులతో పోల్చి చూస్తే మన ఆవులు చాలా తక్కువ పాలిస్తున్నై. కాబట్టి కేవలం పశు సంఖ్యను వృద్ధి చెయ్యడమే మన లక్ష్యం కాకూడదు. మన పశు జాతిని ఉత్తమంగా తయారు చెయ్యాలి. మన గోపూజ ఇన్ని రకాలుగా సాగాలి.

మ: భేష్ బాగుంది. చిన్నదానివైనా పూర్వపు భావాలకూ, ఇప్పటి భావాలకూ చక్కగా సమన్వయం కుదిర్చావమ్మాయ్. ఏదీ నీ పాట కూడా వినిపించు, తల్లీ.

ఆ 2. పాట

గోవు మాలచ్చిమికి కొసరి మొక్కేము.
కోడెల్ల తల్లికీ కొలువు చేసేము.
మంచి పచ్చిక బీళ్ళు మహిని పెంచేము
మంచి నీటికుంట లెంచి త్రవ్వేము
మంచి కొట్టాలలో నుంచి సాకేము --- గోవు ----
జాతి ఆ బోతులను సంతరించేము

జాతి ఆ బెయ్యలను దాట జూపేము
కులము పశువుల కోట్లకొలది పుట్టించి
భరతోర్విపై పరవళ్ళు తొక్కించేము---- గోవు ----
కోడెలను జత చేసి గాడి గట్టేము
ఆడుతూ పాడుతూ అరక దున్నేము
పైరు పచ్చల తోటి వసుధ పెంపొంద
కంకర పొలాల బంగారు పండించేము. ---- గోవు--

(ప్రసారం తేదీ 31-10-62)

----- 0 -----

# దక్షయజ్ఞం

*పాత్రలు:*

1. కథకుడు
2. దక్షపత్ని
3. దక్షుడు.
4. సతీదేవి
5. బ్రహ్మ
6. పరమేశ్వరుడు.

కథకుడు: బ్రహ్మ చేత నియమితుడై దక్ష ప్రజాపతి సృష్టికార్యానికి పూనుకున్నాడు. ముందుగా త్రిలోక జననియైన ఆధార శక్తిని ఆరాధించి ఆమెను కూతురుగా పొందాడు. ఆమే సతీ దేవి.,. తరువాత పరమేశ్వరుణ్ణి ఆరాధించి అయనకు సతీ దేవిని భార్యగా ఇచ్చాడు. ఆ దంపతులు తన సృష్టి కార్యానికి బీజశక్తులై వుండాలని దక్షుడి ఆశయం. వారికి మహాగణాధిపతియైన విఘ్నేశ్వుడు పుట్టాడు.

దక్షుడు మరి యాభైమంది కూతుళ్లను కన్నాడు. వారిలో పదముగ్గుర్ని కశ్యపుడికీ, పదిమందిని యముడికీ, ఇరవైయేడుగుర్ని చంద్రుడికీ, ఇచ్చి పెండ్లిచేశాడు. సర్వజగజ్జనులనూ నిర్మించి సంతోషించాడు. కుమార్తెలు కాపురాలు ఎలా చేస్తున్నారో చూడాలని బుద్ధిపుట్టింది దక్షుడికి. నలుగురల్లుళ్ల యిళ్ళకూ వెళ్ళి చక్కా వచ్చాడు.

* * *

దక్షపత్ని: నాథా ఏమిటి విశేషాలు? మన అమ్మయిలంతా బాగున్నారా? అల్లుళ్లందరూ క్షేమమేనా?

దక్షుడు: ఏమి కూతుళ్ళో, ఏమి అల్లుళ్ళో పోవే ఈ ప్రయాణం చెయ్యకపోయినా బాగుండేది.

ద.ప: ఏమి అలా అంటున్నారు? అలా నిరుత్సాహంగా నీళ్ళు నములుతున్నారు? అక్కడ ఏం జరిగిందేమిటి? జరగవలసిన మర్యాదలన్నీ సలక్షణంగా జరగలేదా?

ద: జరగవలసిన వన్నీ సలక్షణంగానే జరిగాయి. చెబుతా విను. ఇక్కడ నుండి బయలు దేరి మొదట కశ్యప ప్రజాపతి యింటికి వెళ్ళాను.

ద.ప: సాటి ప్రజాపతి అనే అభిమానం ఎక్కడికి పోతుంది. అక్కడేం

జరిగింది?

ద: భార్యలతో, మనుమలతో, శిష్యులతో, కశ్యపుడు మహోత్సాహంగా నాకు ఎదురు వచ్చాడు. సాష్టాంగ దండప్రణామాలు చేశాడు. ఇంట్లోకి తీసుకుపోయి అర్ఘ్యం పాద్యం మొదలైన విశేషార్చనలు చేశాడు. మణికనకాది వస్తువులతో పూజించాడు. అమ్మాయిలు పంచభక్ష్యపరమాన్నాలతో షడ్రసోపేతంగా భోజనం పెట్టారు.

ద.ప: మామగారికి మర్యాద ఘనంగానే చేశాడల్లుడు. తర్వాత

ద: అక్కడ నుండి బయలు దేరి యమధర్మరాజు ఇంటికి వెళ్ళాను. ఆయన సకళత్రపరివారంగా వినయంతో ఎదురు వచ్చి నమస్కరించి తోడ్కొని వెళ్ళాడు. కశ్యపుని కంటే మిన్నగా అర్చనలిచ్చి నన్ను సంతోషపెట్టాడు. ఇక అమ్మాయిల సంగతి సరేసరి, చెప్పనే అక్కర్లేదు.

ద.ప: మన పుణ్యం కొద్దీ ఇంత మంచి అల్లుళ్ళు దొరికారు అక్కడ నుంచి...

ద: అక్కడ నుంచి బయలుదేరి చంద్రుడి ఇంటికి వెళ్ళాను. ఎంత చల్లని తండ్రే ఆ అల్లుడు. నేను వస్తున్నానని విని దారి దారంతా చల్లటి మంచు కిరణాలతో కప్పివేసి నాకు ప్రయాణపు బడలిక అనేదే లేకుండా చేశాడు. కశ్యపుడి కంటే, ధర్మరాజు కంటే, ఎక్కువ మర్యాదలు చేసి నన్ను గౌరవించాడు.

ద.ప: ఇంతకూ మన అమ్మాయిలు చేసుకున్న పూజ అలాటిది. మంచి పురుషులే దొరికారు వాళ్ళకు.

ద: అక్కడ నుండి కైలాసం వెళ్ళాను.

ద.ప: ఇంకేం, అక్కడ ఇంకా బాగా జరిగి వుంటుంది మీకు.

ద: ఆ, జరగవలసింది అంతా అక్కడే జరిగింది. ఆ కొండ ఎంత చక్కగా ఉందనుకున్నావ్. చూడముచ్చటగా ఉంది. ఆ దృశ్యం వల్ల కలిగిన ఆశ్చర్యాన్నుంచి తేరుకోడానికే గంటసేపు పట్టిందనుకో.

ద.ప: పెద్దమ్మాయి, పెద్దల్లుడూ ఎదురు వచ్చి మిమ్మల్ని ప్రకృతిస్థులను చేసి వుంటారు.

ద: పెద్దమ్మాయి పెద్దల్లుడు కాదు కదా. ఆయింటి కుక్క కూడా ఎదురు రాలేదు. ఇంత దూరం వచ్చి వాళ్ళను చూడ కుండా పోవడం బాగుండదని నేనే లోపలికి వెళ్ళాను.

ద.ప: అయితే పెద్దల్లుడేదో పెద్దపనిమీదనే ఉండి ఉంటాడు.

ద: ఆ పెద్దపనే! ఆ ఏనుగు మొగం కొడుకు నెత్తుకుని ముద్దాడు తున్నాడు. పెళ్ళాన్ని నవ్విస్తూ, తానూ నవ్వుతున్నాడు.

ద.ప: మిమ్మల్ని చూడగానే లేచి వచ్చి మనమణ్ని ఆప్యాయంగా చేతి కందించి వుంటాడు.

ద: అదేం లేదు. నేను తనకు సాష్టాంగ నమస్కారం చేయలేదని కోపం వచ్చిందో ఏమో, ముఖం అటు తిప్పుకున్నాడు.

ద.ప: అయితే కావచ్చు. ఆయన పరమేశ్వరుడుగదా మరి.

ద: ఎంతైనా అత్త అల్లుడి పక్షమే. నేనక్కడికి భక్తుడి హోదాలో పోతే నీవన్నది నిజమే. మామగారి దర్జా ఒలకబోస్తూ పోతినా, అల్లుడు ఎదురు వచ్చి నాకు నమస్కరించవద్దూ?

ద.ప: అమ్మాయేమన్నది.

ద: ఆమె ఉలకా లేదు. పలకా లేదు. బెల్లం కొట్టిన రాయల్లే

నిలుచుంది.

ద.ప: పాపం. ఈ వైపరీత్యానికి నిశ్చేష్టురాలై వుంటుంది. అయినా, తల్లీ తండ్రీ వున్నవాడైతే గదూ, అత్తా మామా అని ప్రేమ చూపడం. ఆ బిడ్డ మన బిడ్డ కాదనుకుని ఆ సంగతంతా మరిచి పోండి.

ద: అతడు నాకు చేసిన అవమానం నా మనస్సును దహించి వేస్తున్నది. ఎలా మరిచిపోను? ఆ అపకారానికి ప్రత్యపకారం చేస్తేనే కాని నా మనస్తాపం చల్లారదు. పెద్ద యజ్ఞం చేస్తాను. దానికి ఈ పధ్నాలుగు లోకాల వాళ్లందరీన్నీ పిలుస్తాను. పెద్దల్లుణ్ని మాత్రం పిలవను. ఈ విధంగా అతణ్ని వేదబాహ్యుణ్ని చేస్తాను.

ద.ప: మీ పరస్పర కోపాగ్నికి అన్నెమూ పున్నెమూ ఎరగని అమ్మాయి ఆహుతి అవుతుందేమో!

ద: అయితే కానియ్ నా నిశ్చయానికి తిరుగులేదు.

* * * *

కథకుడు: దక్షుడు మహాయజ్ఞ ప్రారంభానికి సర్వ సన్నాహాలూ చేశాడు. అతి వైభవోపేతంగా యజ్ఞశాలను నిర్మించాడు. అందరీన్నీ ఆహ్వానించాడు. బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు, మొదలైన దేవతలంతా వచ్చారు. మునీశ్వరులంతా వచ్చారు. ఇంతెందుకు, ఈ చరాచర ప్రపంచం యావత్తూ దక్షుడి యజ్ఞానికి హాజరైందంటే అందులో అతిశయోక్తి ఎంత మాత్రం లేదు. ఈ వైభవ మంతా సతీ దేవి చూచి పోయి భర్తకు చెబితే ఆయన ఖిన్నుడు కావాలని దక్షుడి ఆశయం. అందుకని పరిచారికలను పంపి సతీ దేవిని యజ్ఞానికి పిలిపించాడు. భర్తను పిలవకపోయినా పుట్టింటి మీది మమకారం కొద్దీ, ఆమె యజ్ఞానికి

వచ్చింది. తండ్రి యొక్క మహత్వవిభుత్వానికి సంతోషించింది. తండ్రి భయస్థుడై పరమేశ్వరుణ్ని పిలవలేదని భావించింది.

సతీదేవి. నాన్నా! హరి నీ, బ్రహ్మనూ, ఇంద్రుడు మొదలైన దిక్పాలకుల్నీ, దేవతల్నీ, మునుల్నీ, విప్రుల్నీ - అందర్నీ పిలిచావు, బాగానేవుంది. ఇంతమందిని పిలిచి పరమేశ్వరుణ్ణి పిలవలేదేం? భయపడ్డావా? ఆ వరదుడు భక్తవత్సలుడు కదా! తలచి పిలిచినవారికి నిత్యప్రసన్నుడు గదా ఆ పరమేశ్వరుడు!

ద. అమ్మాయ్! నీ మొగుణ్ని పరమేశ్వరుడంటే నేను సహించను. అసహ్యమైన పుర్రెలు, ఎముకలు, పాములు, జడలు ధరించి ఒళ్ళంతా బూడిదపూసుకునే విరుద్ధాచారుడు పరమేశ్వరుడా? ఈ లక్ష్మీపతి, ఈ వాణీపతి, ఈ శచీపతి మొదలైన దిక్పాలురు, ఈ దేవతలు, ఈ మునీశ్వరులు, ఈ విప్రులు - వీళ్ళంతా వేదాలంకారులే, వీళ్ళ మధ్యకు రావడానికి ఆ వేదబాహ్యుడు అర్హుడటమ్మా?

స: తప్పు తప్పు అతిలోక మహిమాన్వితాలైన ఈ రుద్రచిహ్నాలను తిరస్కరిస్తున్నావ్. నీవు చెప్పిన వీరందరి దేహాల మీదా ఆ రుద్ర చిహ్నాలున్నై చూచుకో.

ద: అలాగా. ఏవీ నాకేమీ కనబడడం లేదే.

స: కళ్ళున్న వాళ్ళందరికీ కనబడుతూనే వున్నై. అది సరే గాని వీళ్లందరికీ దేవతా విభవమిచ్చే పరమేశ్వరుణ్ణి పలిపించనంటావే, ఆయన తప్ప ఈ వచ్చిన పెద్దల్లో ఈ యజ్ఞఫలం నీ కిచ్చే నాథుడెవడో చెప్పు!

ద: అమ్మాయ్. నీ నోటికి హద్దూ పద్దూ లేనట్లుంది. మాటి మాటికీ వీళ్ళందరికీ నీ మొగుడే అధీశ్వరుడంటూ ఈ దేవతా

ధీశ్వరులందర్నీ నీ యిష్టమొచ్చినట్లు తూలనాడుతున్నావ్. వీళ్ళు నా మొగం చూచి వూరుకున్నారు గాని లేకపోతే ఈ పాటికి నిన్నూ నీ రుద్రుణ్ణీ ఏం చేసి వుండే వాళ్ళో! కాస్త తగ్గి మాట్లాడడం నేర్చుకో.

స: (కోపంతో) నాన్నా. నీ అజ్ఞానానికి నాకు జాలివేస్తున్నది. వీళ్ళంతా నీ వంటి బుద్ధిహీనులు కారు. ఈ హరి తన నేత్రాన్ని పరమేశ్వరుడి కర్పించి చక్రాన్ని పొందాడు. ఈ బ్రహ్మ తన శిరస్సిచ్చి ప్రాణాలు దక్కించుకున్నాడు. ఆ పరమేశ్వరుడి అంతూ పొంతూ కనుక్కోవడానికి వీళ్ళిద్దరూ చెరి ఒక వైపునా ఇప్పటికీ వెదుకుతూనే వున్నారు. అలాటి అగణితైశ్వర్యుడైన పరమేశ్వరుణ్ణి తెలిసి కూడా నీవిలా దూషిస్తుంటే నాకు కోపం ముంచుకొని వస్తుంది.

ద: వస్తే నాకేం? ఎవరి కోపం వాళ్ళనే దహిస్తుంది. అమ్మాయ్. నీవు వెయ్యి చెప్పు లక్ష చెప్పు. నీ మొగుడు వేద బాహ్యుడు. ఈ యజ్ఞశాల గడప తొక్కడానికి కూడా అతడికి అర్హత లేదు.

స: మూర్ఖుడివి. నీతో వాదించి లాభం లేదు. ఓ హరి బ్రహ్మలారా పరమేశ్వరుడు యజ్ఞాలలో పూజింపదగినవాడు అవునా కాదా. మీరు చెప్పండి.

కథకుడు: హరి బ్రహ్మలు దక్షుడి వాదాన్ని నిరాకరించి సతీదేవితో ఏకీభవించారు. అయినా దక్షుడు తన మొండిపట్టు వదల్లేదు. కర్మబాహ్యుడైన పాషండుడు పూజ్యుడు ఎట్లా అవుతాడని భీష్మించుకు కూర్చున్నాడు. సతీదేవి కోపానికి అంతు లేకుండా పోయింది. అవమానజనితమైన ఆ కోపాగ్ని జ్వాలల్లో ఆమె దేహం భస్మీపటలం అయిపోయింది. ఆ క్షణంలోనే అక్కడ సర్వజ్ఞుడైన పరమేశ్వరుడి ఫాలనేత్రం భగ్గునమండింది. ప్రళయభీకరాకారం తాల్చాడు. దక్షయజ్ఞం ధ్వంసంచేసి దక్షుణ్ణి పట్టి కట్టి తెమ్మని మహాగణాధిపతిని ఆజ్ఞాపించాడు. ఆయన

తన గణ సైన్యంతో పోయి యజ్ఞశాల మీద విరుచుకు పడ్డాడు. ఆ సైనికులు కనబడ్డ వాళ్ళందరినీ చావమోది యజ్ఞశాలను ఛిన్నాభిన్నం చేసివేశారు. పారిపోయి దాక్కున్న దక్షుణ్ణి వెదికి పట్టి కట్టి తెచ్చి పరమేశ్వరుని పాదాల ముందు పడవేశారు. బ్రహ్మాది దేవతలు వెంట రాగా దక్షపత్ని, శోకం మూర్తీభవించినట్లు ఏడుస్తూ వచ్చింది. -----

ద.ప: పరమేశ్వరా. అభయం, అభయం. ఈ యజ్ఞానికి సృష్టి క్రియాదక్షుడైన దక్షుడు కర్త. మహామునులు ఋత్విజులు, దేవతలు సదస్యులు. కర్త భక్తిలేని వాడైనా, యజ్ఞఫలాన్ని ఇవ్వవలసిన మహానుభావుడివి నీవే దాన్ని ధ్వంసం చేస్తే అది అభిచారమైపోదా, స్వామీ?

పరమేశ్వరుడు: ఇదంతా దక్షుడి స్వయం కృతాపరాధం.

బ్రహ్మ: అవును దేవా. సకల భువన స్వామివైన నిన్ను పరమేశ్వరుడవి తలంచక, పిల్లనిచ్చానుగదా అని జనసామాన్యుణ్ణిగా భావించాడు. అయినా నిన్ను బంధుడని భావించాడు గదా. ఇతడు బంధువులతో కాడా ఇలాటి దుస్థితికి రావడం న్యాయమేనా? నిర్బంధుడివైన నిన్ను చూచిన తర్వాత కూడా ఇతడు బంధాలతో వుండడం సబబేనా స్వామీ?

పర: చతురాననా నీ చతురోక్తులకు సంతోషించాను. కాని ఈ దక్షుడు చేసిన నేరం సామాన్య మైంది కాదు. నా అర్ధాంగి, సతీదేవి---

బ్రహ్మ: ఆ ఘోరానికి ఇతణ్ణొక్కణ్ణే కాదు ఇతడి వంశం వంశం గానుగలో పెట్టి తిప్పినా నిష్కృతి లేదు. ఇంత ద్రోహం చేసినా, ఇతడు వధార్హుడు కాడు. ప్రజాపతి. పరమేశ్వరుడి మామ. ఇతడికి బంధమోక్షం చేస్తాను. ఏమి సెలవు.

పర: సరే.

బ్రహ్మ: దక్ష ప్రజాపతీ నీవు బ్రతికావు. పరమేశ్వరుణ్ణి మనసారా వేడుకో.

ద: కపాలాస్థి మాలాలంకృతా. పన్నగభూషణా కంకాళధరా. జటాజిన ధారీ, భసితాంగా, శూలీ, పరమేశ్వరా, శరణు, శరణు! అజ్ఞానం చేత నిన్ను సామాన్యుణ్ణిగా భావించి ఇంత చేటు కొని తెచ్చుకున్నాను. నన్ను మన్నించి నా యజ్ఞానాన్ని సముద్ధరించు.

పర: దక్ష ప్రజాపతీ! నీ పశ్చాత్తాపానికీ నీ భక్తికీ మెచ్చాను. నీ యజ్ఞఫలం నీకిచ్చాను. ఎప్పటిలాగా ప్రజాపతి పదవిలో సుఖంగా ఉండు.

ద.ప: అయ్యో నా చిన్నారి చిట్టి కూన, నా సతీదేవి, ఈ మామా అల్లుళ్ళ పరస్పర కోపాగ్నికి నిష్కారణంగా అహుతి అయిపోయింది. నా తల్లి నాకింకెక్కడ కనపడుతుంది. ఈ గర్భశోకం ఎలా భరించను.

పర: అత్తగారూ, మీ విచారం అవిచార మూలకం. నా సతి ఆధారశక్తి. ఆమెకు మృత్యువెక్కడిది? అదుగో నా సతి హిమాచల శిఖరాగ్రాన నా కోసం తపస్సు చేస్తున్నది. -- ప్రాణప్రియా నా సతీ. పార్వతీ! ఇదుగో వస్తున్నా. ----

కథకుడు: అంటూ పరమేశ్వరుడు హిమాలయ పర్వతానికేసి నడిచాడు.

ప్రసారం- 3-9-63

----- 0 -----

# నవదుర్గ

*పాత్రలు:*

1. పార్వతమ్మ
2. కమల
3. సుశీల
4. సీత

----- సన్నని వాద్యసంగీతం ... భక్తితో రాగయుక్తంగా----

నమోదేవి మహామాయే శ్రీ సురపూజితే
శంఖచక్రగదా హస్తే మహాలక్ష్మీ నమోస్తుతే..
సర్వజ్ఞే సర్వవరదే సర్వదుష్టభయంకరీ
సర్వదుఃఖ హరే దేవీ మహా లక్ష్మీర్నమోస్తుతే
సిద్ధి బుద్ధి ప్రదే దేవీ భక్తి ముక్తి ప్రదాయినీ
మంత్ర మూర్తే సదా దేవీ మహాలక్ష్మీర్నమోస్తుతే
ఆద్యంత రహితే దేవీ అదిశక్తి మహేశ్వరీ
యోగజ్ఞే యోగ సంభూతే మహా లక్ష్మీర్నమోస్తుతే..
ఓం శ్రీ మాత్రే నమః, ఓ హరి బ్రహ్మేంద్ర సేవితాయై నమః,
ఓం అంబికాయై నమః, ఓం దైత్యహంత్రై్యనమః,
ఓం దరహాసోజ్జ్వలసుముఖాయై నమః,
ఓం శివశక్త్యైక రూపిణ్యైనమః
ఓం శ్రీలలితాంబికాయైనమః

( గంట మ్రోగించిన చప్పుడుతో సహా---లోపలినుండి---)

పార్వతమ్మా: అమ్మా, కమలీ! అందరూ వచ్చి దేవికి నమస్కారం చేయండి. ఆరగింపు పెట్టి హారతియెత్తుతాను.

కమల: ఏమిటో ఈ అమ్మ చాదస్తం. పొద్దున్న మూడు గంటలకు లేచిన మనిషి అదేపనిగా ఒళ్ళు విరగగొట్టుకుంటున్నది. గడియారం పన్నెండు గంటలు వేసినా ఇంకా హారతీ నైవేద్యమునూ!

సుశీల: తప్పు కమలా అమ్మకు పూజే ప్రాణం. ఆపూజలు సేసిన చేత్తోటే మనల్నింత పెద్దవాళ్ళను చేసింది. మనకు బుద్ధి జ్ఞానమూ వికసించేట్లు చేసింది.

కమ: అది సరే సుశీలక్కా! పొద్దస్తమానమూ ఇలా విగ్రహాల ముందు

కూర్చుని పూజ చెయ్యడమేనా మన బ్రతుక్కి ధ్యేయం. అందులో ఈ రోజుల్లో ఒక ప్రక్క దేశ పరిస్థితులెలా ఉన్నాయ్. శత్రువు కాలాహిలా కాలకూటవిషాన్ని కక్కుతూ బుసలు కొడ్తూంటే, మనం ఇలాగా కాలాన్ని వ్యర్థం చేసేది? ఈ దేశంలో పుట్టిన ప్రతిజీవీ ఒక్క క్షణమైనా వృథా చెయ్యకుండా ఆత్మార్పణం చెయ్యవలసిన క్లిష్టసమయం కదా ఇది! ఆ జ్ఞానం ఈ నడుమ ఆడవాళ్ళలో ఎంతమంది కుంది సుశీలక్కా? పూజలూ పునస్కారాలూ అంటూ వయస్సు మళ్ళినవాళ్ళూ, పెళ్ళిళ్ళూ చదువులూ అంటూ వయస్సు వచ్చిన వాళ్ళూ, ఎవరి వ్యాపకాల్లో వాళ్ళు పడిపోతే ఇక దేశం గతి ఎవరికి పట్టినట్టు?

సీత: ఏమిటి పెద్దక్కా. మీరిద్దరూ ఇక్కడ బాతాఖానీ వేస్తున్నారు. అమ్మ పిలవడంలా?

సుశీల: ఓ సీతమ్మగారా! సీతమ్మ సింగారమే ఇదుగో వచ్చేస్తున్నామే. పదవే కమలా.

కమల: పడ్డాయీ చెవిన? నీ చెవులు పాముచెవులు! చీమ మిరపకాయ సీతమ్మా ఇది నీకు సంబంధించిన విషయం కాదులే! పదండి, పదండి దేవికి నమస్కారం చేస్తేగాని కడుపులో దేవుడికింత ఎత్తు పడేట్లు లేదు.

( మంత్రపఠనం మరింత దగ్గరిగా, గంటమ్రోగించిన చప్పుడుతో-
------మొదటిదే-----)

పార్వతమ్మ: వచ్చారమ్రా. అమ్మవారికి మనసారా చూచి మరీ నమస్కారం చెయ్యండి. నేను ఆరగింపుకు అన్నీ అమర్చుకుని వస్తాను. నువ్వు నాతో రావే సీతా!

కమల: సుశీలక్కా.

సుశీల: ఊఁ.

కమల: ఏవిటే యీ అనుభవం! ఈ దేవీ మూర్తిని చూస్తుంటే ఒళ్ళు చూచావా ఎలా గగుర్పొడుస్తూ వుందో.

సుశీల: అమ్మ మూడు గంటలకు లేచిమరీ ఊరికే ఉందంటావా. అలంకారాలు చెయ్యడంలో ఆవిడది ఆరితేరిన చెయ్యి.

కమల: ఇది కేవలం అలంకారాలవల్ల వచ్చిందంటావా? కలశానికే అమర్చినా, ఆముక్కూ ముఖమూ తీరు చూచావా! కాటుకతో తీర్చి దిద్దిన ఆ కళ్ళల్లో ఏమిటా వింత తేజస్సు? వంకరగా వల్లగా మన్మథ ధనురాకారంలో ఉన్న కనుబొమలు చూచావా! పొడుగూ పొట్టీ కాకుండా సమంగా శ్రీకారాల్లా ఉన్న చెవులూ, ఆ చెవుల కోసమే తయారు చేయించినట్లున్న చెంపసరాలూ, జూకాలూ చూచావా!

సుశీల: ఇదేమిటి కమలా! ఇందాకంతా అమ్మది ఒట్టి చాదస్తమని ఇప్పుడావిడ అలంకరించిన బొమ్మను చూసి మైమరచిపోయావ్!

కమల: ఇంకా విను! నువ్వుపువ్వులా ఉన్నముక్కూ, ముక్కుకు అమర్చిన బులాకి, మెళ్ళో పొడవుగా వ్రేలాడే ముత్యాలదండా, కట్టబెట్టిన సరిగంచు తెల్లపట్టు చీరా. అయితే సుశీలా ఈ అలంకారాలవల్లే విగ్రహానికి అంత తేజస్సు వచ్చిందంటావా?

సుశీల: నీకు నేనేం చెప్పగలనే కమలా? నీవు కేవలం విగ్రహాన్ని విగ్రహంగా మాత్రమే భావిస్తే ఆ తేజస్సూ, అందమూ అలంకారాలవల్లే వచ్చిందనుకోవాలి. కాని అమ్మ తన మనస్సులోని భక్తి నంతటినీ ముద్ద చేసి రూపు కట్టించిన ఈ విగ్రహం, నాకు కేవల విగ్రహంలా కనిపించదు. ఈవిడ దుర్గ పరాంబిక. సకల శత్రు సంహారకర్త్రి అయిన మహాలక్ష్మి, శుభాకారా, సుస్వరా, అయిన ఈ దేవి, కదనరంగంలో చండి,

అయి సింహగర్జన చేస్తుంది. త్రిమూర్తులకు కూడా లొంగని రాక్షసులు ఈవిడ ఎఱ్ఱని కంటి సెగలలో శలభాలై మాడిపోయారు. అటువంటి శక్తి స్వరూపిణి, ఆకర్షణీయంగా ఉండక ఎలా ఉంటుంది చెప్పు కమలా! గగుర్పాటు కలిగించక ఏం చేస్తుంది?

కమల: నువ్వు చెప్పిందే నిజం మనఃపూర్వకంగా ఈ దేవీ మూర్తికి నమస్కరిద్దాం దా! తల్లీ. రిపుంజయీ. మహిషాసుర మర్దనివైన నీవు, శుంభనిశుంభ దానవ ప్రాణదీపాలపాలిట ఝుంఝామరుత్తువైన నీవు, చండముండాసుర జీవన లతా లవిత్రవైన నీవు, మమ్మల్ని దయచూడు! శత్రుసంహారం చేసే నీలోని వీర గుణాన్ని మా మా నరనరాల్లో నిండేట్లు దీవించు తల్లీ!

సుశీల: అదేమి కోరికే కమలా! అమ్మవారికి మ్రొక్కే ఆడపిల్లలు సిరీ సంపదా కోరుకోవాలి. పైకి అనకుండా మనస్సులో మంచి భర్తని కోరుకోవాలి.

కమల: నువ్వూ, నీ కోరికలూ. అవన్నీ పాతకాలపు కోరికలు. ఈ నాడు భారత దేశంలో ఉన్న ప్రతి నారీ ఒక నవదుర్గ కావాలి సుశీలక్కా.

సుశీల: బాగా చెప్పావ్. ఆనాటి ఆ దుర్గామూర్తి మహిషాసుర మర్దనం చేస్తే, ఈ నాటి యీ నవదుర్గామండని చైనాసుర మర్దనం చేయాలనేగా!

కమల: అవునంతే ష్ అమ్మ వచ్చేస్తోంది.

( విరామ సంగీతం)

సీత: అమ్మయ్యా, భుక్తాయాసంగా ఉందమ్మా. ఏ పనీ చెయ్యకుండా నువ్వు అమర్చి పెట్టిన మృష్టాన్న భోజనం వల్లనే ఇంత

ఆయాసంగా ఉంటే, ఒంచిన నడుం ఎత్తకుండా ఇంతవరకూ నానా హైరానా పడిపోయిన నీ కెట్లా ఉందమ్మా!

పార్వ: పిల్లకాకులు. అన్నానికి ఆలస్యం అయితే ప్రాణం శోషవచ్చి పడిపోతుంది. నాకీ పనిపాటలు, పూజాపునస్కారాలు అలవాటయినవేగా!

లలిత: బాగాచెప్పావమ్మా. తాకితే కందిపోవడం, ఆటలకే అలసిపోవడం, అలవాటయిన జాతికదూ మనది.

సీత: నిజం లలితక్కా. మా తెలుగు పుస్తకంలో నరకాసురవధ అని ఓ పాఠముంది. అందులో సత్యభామను గురించి పోతనగారేం వ్రాశారో తెలుసా.

బొమ్మ పెండ్లిండ్లకు బోనొల్లనను బాల
　　　　రణరంగమున కెట్లు రాదలంచె
మగవారిగనిన దా మఱుగు జేరెడు నింతి
　　　　పగవారి గెల్వనే పగిది జూచె
పసిడి యుయ్యేల లెక్క భయమందు భీరువు
　　　　ఖగపతి స్కంధమే కడిది నెక్కె
నీల కంఠములకు నృత్యముల్ గఱపుచు
　　　　నలసి , తలగిపోవు నలరుబోడి
ఏవిధమున కుందె ఎలమి నాలాఢాది
　　　　మానముకు రిప్పల మానకుండ.

కాని అటువంటి సుకుమారే చివరకు యుద్ధానికి సిద్ధమై నరకుని అంతు కనుక్కున్నదట.

కమల: నాకా సత్యభామ అంటే అందుకే ఇష్టం. అటు ఇంటా భర్తను గిరిగీచి అదుపులో పెట్టుకుంది. ఇటు బయట శత్రువును అడుగు ముందుకు వెయ్యకుండా అరికట్టింది. ఈనాడు స్త్రీలందరూ సత్యభామ లయితే...

పార్వ: మంచి మాటన్నావు తల్లీ. సరిగ్గా నా మనస్సులో ఉన్నమాట ప్రతి ఒక్క స్త్రీ కేవలం సత్యభామే కాదు. ఆదిశక్తి సర్వదుష్ట రాక్షస సంహారిణీ అయిన దుర్గామూర్తి అయితే ఎంత బాగుండును! దుర్గాదేవి కత వింటుంటేనే గుండెల్లో వేడీ, నరాల్లో వాడీ పొంగులెత్తుతుంది.

లలిత: అమ్మా. ఆ కథ ఇవ్వాళనే వెంటనే వినాలనుంది చెప్పమ్మా.

పార్వతి: అంతకంటేనా!

శరత్కాలం దేవికి ప్రీతికరమైన కాలం. యుద్ధ విజయార్థులైన పౌరుషధనులు ఈ కాలంలోనే దిగ్విజయాలు చేసి తమ పరాక్రమప్రకటన చేస్తారు. అనాది కాలంలో ఒక శరత్కాలంలోనే మహిషుడనే మహా వీర్య సంపన్నుడైన అసురుడు దేవతలను ఓడించి స్వర్గం నుండి తరిమి కొట్టాడు దేవతలను. త్రిమూర్తులకు కూడా లొంగని వాడి బలగర్వాన్ని ఎలా అణచడం? ఈ విషయంలో వ్యగ్రులై తదేకంగా ఆలోచిస్తున్న త్రిమూర్తుల ముఖాల నుండి దివ్య తేజస్సు నిర్గతమైంది. బ్రహ్మముఖంలో నుండి పద్మరాగ మణి కాంతిలా ఎఱ్ఱగా శుభప్రదంగానూ, ఈశ్వర వదనం నుండి నల్లగా, భయంకరంగా పరమదారుణంగానూ, విష్ణు శరీరం నుండి, తెల్లగా నయనానందకరంగా, చల్లని వెలుగులు చిమ్మతూనూ వచ్చిన, ఆమహా తేజస్సే అతిలోక సుందరిగా మారిపోయింది. ఆవిడ త్రిగుణాలతో ప్రకాశించే విశ్వమోహిని. ఆవిడ నేత్రాలు నల్లకలువలూ, పెదవులు పెసరకాయలూనూ! ఉంగరాలు తిరిగి మనోహరంగా ఉన్న ఆవిడ వేణీ, పరభృత, శుక సుస్వరాలను మించిన ఆవిడ వాణీ మృదుమధురాలు, కోటి చంద్రప్రభాభాసమానమైన ఆవిడ ఫాలం చూడ చక్కనిది. పద్దెనిమిది బాహువులతో వివిధాయుధాలతో, సర్వాంగాలంకృత అయిన ఆవిడ శత్రుసంహారానికై ఉద్భవించింది. పాహి మహేశ్వరీ అన్న సకల దేవతా సమూహాన్ని అభయ ముద్రతో

బుజ్జగించి ఆవిడ శత్రు సంహారం చేసింది. అలనాటి దుష్టదానవ సంహనన క్రీడాలాలస యైన దేవీ మూర్తినే ఈనాడు మనం ధ్యానం చేసింది.

కమల: దేవి కథంతా ఇంత ఆవేశంతో ఎందుకు చెప్తున్నావో నా కర్థమైందిలేమ్మా. ఈ క్షణాన, మన దేశపరిస్థితులూ, శత్రురూపంలో మనల్ని పీడిస్తున్న బాధలనూ, నిన్ను కలచి వేస్తున్నాయి కదూ.

పార్వతి: ఆవేశ పడడం కంటే నేను చెయగలిగింది మాత్రం ఏముంది తల్లీ. జీవిత సంధ్యాకాలంలో మెసలుతూన్న మాలాటి వాళ్ళ ఆవేశోద్వేగాలు కార్యోన్ముఖం అయ్యే అవకాశాలు లేవు.

లలిత; నీ కెందుకమ్మా అంత నిస్పృహ! నువ్వు స్వయంగా కదనరంగానికి కదిలిరాలేవేమో కాని, శత్రువులగుండెల్ని చీల్చే, వీరనారీ నరసమూహాన్ని ఉత్సాహ ప్రపూర్ణుల్ని చేసి కదిలించేది మీలాంటి తల్లులేగా!

పార్వతి: నీ మాటలతో నాకు కొంత ఊరట కలుగుతోంది తల్లీ ఆ లోకమాత, సర్వరాక్షస సంహారకారిణి అయిన ఆ దుర్గాదేవి అందరిలో అంతో ఇంతో పాదుకోవాలనే ఈరోజు ఈ దుర్గా పూజ యింత భక్తితో నిర్వహించగలిగాను.

కమల: నీ సంకల్పానికి జయం. నలభై కోట్ల జనాభాలో సగానికిపైగా ఉన్న ఆడవాళ్లం. ఒక్కొళ్ళమూ ఒక్కొక్క నవదుర్గలం ఒక్కొక్క స్త్రీ ఒక్కొక్క డైనా రాక్షసుణ్ణి చంపినా చాలు.

పార్వతమ్మ: కమలా ఎంత ఆవేశమే నీది!

లలిత: అవునమ్మా. అవేశమే విజయానికి మూలం. నీలాంటి తల్లుల ఆశ, మేం వృథా పోనీయం. ఆటపాటలతో కాలం గడిపినంత తేలికగా ఇకనుండీ దేశరక్షణ కార్యాలలో నిమగ్నులం కావడానికి

ఏమాత్రమూ వెనుకంజవేయం. అటువంటి అవకాశం మాకు కలగాలి. మేం ప్రతి ఒక్కరం ఒక్క నవదుర్గగా విక్రమించి శత్రుసంహారం చెయ్యాలని, మమ్మల్ని దీవించు అమ్మా.

కమల: ఈ విజయ దశమీ శుభదినాన, భారత స్త్రీలకు ప్రతినిధులమైన, మా ప్రతిజ్ఞను మన్నించు.

పార్వతమ్మ: శుభం తల్లీ.

----- 0 -----

# వినతాదాస్యవిమోచనం

కద్రువ అనీ వినత అనీ కృతయుగంలో కశ్యప ప్రజాపతి భార్యలు కొడుకులకోసం భర్తను చాలాకాలం ఆరాధించారు. కశ్యపుడు ప్రసన్నుడై వాళ్ళ కోరికలు చెప్పమన్నాడు. తనకు వేయిమంది కొడుకులు కావాలని కద్రువ కోరుకుంది. అగ్నితేజం లాంటి కాంతితో పొడుగాటి దేహాలతో మాంచి బలం కల కొడుకుల్ని ఇద్దర్ని మాత్రమే వినత కోరుకుంది. కశ్యపుడు మీరు కోరిన వరాలు ఇచ్చాను పొమ్మన్నాడు. వాళ్లు కడుపుతో ఉండి కొంతకాలానికి గుడ్లు పెట్టారు. కద్రువ తన వెయ్యి గుడ్లనూ వినత తన రెండు గుడ్లనూ నేతికుండల్లో పెట్టి జాగ్రత్తగా చూస్తున్నారు. తర్వాత అయిదువందల ఏండ్లకు కద్రువ గుడ్లు వరసగా పగిలి శేషుడు వాసుకి ఐరావతుడు తక్షకుడు కర్కోటకుడు మొదలైన పాముల నాయకులు పుట్టారు.

వినత గుడ్లు ఎంతకీ పిల్లలు కావడం లేదు. సవతి ముందు వినతకు తలకొట్టేసినట్లుగా ఉంది. తొందరగా కొడుకు పుట్టాలని ఒక గుడ్డు

పగలకొట్టింది. అందులో నుంచి తొడలనుంచి కింది భాగం ఇంకా ఏర్పడని అనూరుడు పుట్టాడు. తన దేహం పూర్తిగా ఏర్పడకముందే సవతి మచ్చరంతో గుడ్డు పగలకొట్టిన తల్లి మీద అతడికి కోపం వచ్చింది. అయిదువందలయేండ్లు నీవు నీ సవతికి దాసివిగా వుంటావని తల్లికి శాపం పెట్టాడు. తుకు తానై పగిలే దాకా రెండో గుడ్డును జాగ్రత్తగా కాపాడవలసిందని, అందులో పుట్టేవాడు చాలా బలవంతుడై తన దాసీత్వం పోగొడతాడనీ, తల్లితో చెప్పి అనూరుడు సూర్యుడికి సారథిగా పని చెయ్యడానికి ఆకాశానికి ఎగిరిపోయాడు.

ఒకనాడు కద్రువా వినతా ఇద్దరూ సముద్ర తీరాన వినోదంగా విహరిస్తున్నారు. పాలసముద్రంలో అమృతంతో పాటు పుట్టి ఇంద్రుడికి వాహనమైన ఉచ్చైశ్రవం అక్కడ దూరంగా తిరుగుతూ కనపడింది. అది సముద్రపు నురుగు వలె తెల్లగా ఉంది. అప్పుడు కద్రువ వినతతో, చూడవే ఆ తెల్లటి గుర్రానికి పున్నమినాటి చంద్రుడిలా మచ్చలాగా తోక మీద నల్లగా వుంది - అన్నది. అందుకు వినత నవ్వి, నీవు ఏకళ్ళతో చూచావే అక్కా. నలుపెక్కడుంది? ఆ గుర్రం ఆకారమంతా మహాపురుషుని కీర్తి వలె అతి నిర్మలంగా వుంది. అన్నది. దాని మీద వాదోపవాదాలు పెరిగి నలుపుంటే వినత కద్రువకు దాసి అయ్యేటట్లు లేకపోతే కద్రువ వినతకు దాసి అయ్యేటట్లూ సవతులిద్దరూ పందెం వేసుకున్నారు. ఇప్పుడే పోయి చూద్దాం పదమన్నది. వినత. ఇప్పుడు పొద్దు లేదు రేపు పొద్దున్నే వచ్చి చూద్దాం అన్నది కద్రువ.

కద్రువ ఇంటికి వచ్చి సంగతంతా కొడుకులకు చెప్పి ఆ గుర్రం తోక ఎలాగైనా నలుపు చెయ్యమని కోరింది. ఇది అధర్మం మేము చెయ్యమన్నారు వాళ్ళంతా. కద్రువకు కోపం వచ్చి జనమే జయుడు చేసే సర్పయాగంలో మీరంతా నశిస్తారని శపించింది. కర్కోటకుడు అనేవాడు శాపానికి భయపడి నల్లటి రూపంతో ఉచ్చైశ్రవం తోక పట్టుకుని వేలాడుతూ ఉండిపోయాడు. మర్నాడు పొద్దున్నే సవతు లిద్దరూ వచ్చి చూస్తే గుర్రం తోక నల్లగా వుంది. వినత ఓడిపోయింది. కద్రువకు దాసిగా అనేక కష్టాలు పడుతూ పనులు చేస్తూ వుంది.

అలా అయిదు వందల యేండ్లు గడిచాయి. అప్పుడు రెండో గుడ్డు పగిలింది. అందులోనుంచి గరుత్మంతుడు పుట్టాడు. పుట్టీ పుట్టడంతోటే ఆకాశానికి ఎగిరాడు. అతడి రెక్కల గాలి వేగానికి తట్టుకోలేక పర్వతాలన్నీ కంపించి పోయాయి. మహాసముద్రాలన్నీ ఘూర్ణిల్లి పోయాయి. అతడి దేహకాంతి ముందు సూర్యకాంతి మాసి పోయినట్లుంది. తల్లి మనస్సు ఆనందంతో ఉప్పొంగిపోయింది. ప్రళయకాలం నాటి అగ్నిజ్వాలలు చుట్టుముడుతున్నాయన్న భ్రాంతితో దేవతలూ, మునులూ, అగ్నిసూక్తాలు చదవడం మొదలెట్టారు. నిమిషంలో ఆకాశమంతా ఒక చుట్టు చుట్టి వచ్చి గరుడుడు తల్లికి మొక్కాడు. ఇది చూచిన కద్రువ మనస్సులో పుట్టిన ఈసును దాచుకోలేకపోయింది. గరుడుణ్ని పిల్చి తన కొడుకుల్ని ఎత్తుకుని తిరుగుతూ వుడాల్సిందనీ ఏపని చెప్పినా కాదనకుండా చేస్తూ వుండాల్సిందనీ, ఆజ్ఞాపించింది. అలాగే గరుడుడు తల్లి అనుమతితో పెదతల్లి చెప్పిన పనులన్నీ అతి వినయంతో చేస్తూ వచ్చాడు. కద్రువకు రాను రాను గర్వం బలిసిపోయింది. గరుడుడి చేతా వినత చేతా అస్తమానం పనులు చేయించడం మొదలుపెట్టింది. ఒకనాడు గరుడుడు ఎందుకిదంతా అని తల్లిని అడిగాడు. అప్పుడు వినత సంగతంతా సవిస్తరంగా చెప్పి, సమర్థులైన కొడుకుల వల్ల తల్లి దండ్రుల యిక్కట్లు పోవడం అంతటా వుండేదే, నీలాటి సత్పుత్రుణ్ణి పొంది కూడా నేను దాసిగా ఉండాలా, నాయనా? అన్నది.

ఆ మాటలకు గరుత్మంతుడు చాలా దుఃఖించాడు. కద్రువ కొడుకుల వద్దకు పోయి, మాదాస్యం పోయే ఉపాయం చెప్పండి. మీరు ఏది కోరితే అది తెచ్చిస్తాను. అన్నాడు. అలా అయితే మాకు అమృతం తెచ్చివ్వమన్నారు వాళ్ళు. అలాగే తెచ్చిస్తాను. ఇచ్చి నేనూ తల్లీ దాస్యం నుంచి విముక్తులమవుతాం, అని వాళ్ళతో అని, గరుడుడు తల్లికి సంగతంతా చెప్పి, నేను అమృతం కోసం పోతున్నానని మొక్కాడు. వినత ఎంతో సంతోషించి కొడుకును కౌగిలించుకుని మనసారా దీవించింది. అమృతం తేవడానికి నాకింకా బలం కావాలి అలాటి ఆహారమేదో చెప్పమన్నాడు గరుడుడు తల్లిని. సముద్ర గర్భంలో లెక్కలేనంతమంది నిషాదులు ఉన్నారు. వాళ్ళు మానవులకు ఎప్పుడూ అపకారం

చేస్తుంటారు. వాళ్ళను తిని వెళ్ళు అని వినత చెప్పింది. వాళ్లందర్నీ పట్టి పకోడీలు తిన్నట్లు తిన్నా గరుడుడి ఆకలి తీరలేదు. అప్పుడాయన గంధమాదనంలో తపస్సు చేసుకుంటున్న తండ్రి వద్దకు వెళ్ళి మొక్కి సంగతంతా చెప్పి, నాకు ఆహారం ప్రసాదించమని వేడుకున్నాడు. కశ్యప ప్రజాపతి కొడుకు పూనికకు సంతోషించాడు.

విభావసుడనే బ్రాహ్మడు మంచి సంపన్నుడై సుఖంగా వుండేవాడు. అతడి తమ్ముడు సుప్రతీకుడు. ఒకనాడు అన్న వద్దకు పోయి మన పిత్రార్జితలో నాకు న్యాయంగా రావలసింది పంచి ఇవ్వమని అడిగాడు. అహంకారమదం చేత కోపం వచ్చి విభావసుడు తమ్ముణ్ణి ఏనుగువై పొమ్మని శపించాడు. ఇది సహించలేక తాబేలువై పొమ్మని తమ్ముడు అన్నకు ప్రతిశాపం ఇచ్చాడు. ఈ కథ చెప్పి కశ్యపుడు , ఆ తాబేలు సరోవరంలోనూ ఆ యేనుగు విపినంలోనూ ఉండి పూర్వవైరాన్ని తలుచుకొని ఎప్పుడూ తమలో తాము పోట్లాడుకుంటూ ఉంటై. వాటిని పట్టి తిను. నీకు కార్య సిద్ధి అవుతుంది. అని గరుడుడితో చెప్పి దీవించి పంపాడు.

అవి చెప్పరానంత పెద్ద జంతువులు. వాటిని పట్టి భక్షించేసరికి గరుత్మంతుడికి ఎక్కడలేని బలం వచ్చింది. స్వర్గానికి పోవడానికి పూనుకుని ఒక్కసారి రెక్కలు జాడించి ఆకాశాని కెగిరాడు. అక్కడ దేవలోకంలో ఇంద్రుడి సభలో నిప్పుల వర్షం కురిసింది. వజ్రాయుధం నూరంచులూ మొక్కపోయినై. దిగజాల మదం అణగి పోయింది. దిక్పాలకులందరి మనస్సులూ భయోద్వేగంతో సంచలించాయి.

ఈ ఉత్పాతాలు పుట్టడానికి కారణమేమిటని దేవేంద్రుడు బృహస్పతిని అడిగాడు. బృహస్పతి ఆ సంగతి తెలుసుకుని, ఇదుగో వచ్చేస్తున్నాడు గరుత్మంతుడు, తన తల్లి దాస్యం పోగొట్టడానికి అమృతం తీసుకుపోయే పూనికతో! వాడికి కామరూపం, కామగమనం ఉన్నై. వాడు నీకు అసాధ్యుడు అని చెప్పాడు.

ఆ మాటలు వింటూనే ఇంద్రుడు అమృత రక్షకుల నందర్నీ పిలిపించాడు. ఎలాగైనా సరే మీరు అమృతాన్ని రక్షించాలని వారిని ఆజ్ఞాపించాడు. వాళ్ళు వీరులు. అనేక రకాల ఆకారాలు కలవాళ్ళు. ఘోర మారణాయుధాలు కలవాళ్ళు. నల్లటి ఎర్రటి తెల్లటి పచ్చటి కవచాలు ధరించిన వాళ్ళు. అందరూ కలిసి అమృతస్థానం చుట్టూ చేరి దాన్ని రక్షించడానికి పూనుకున్నారు.

అంతలోనే మండే పిడుగుల మొత్తమో అన్నట్లుగా, రెక్కల గాలికి మేఘాలన్నీ దూది పింజలవలె నలుదిక్కులకూ చెదరి పోతూఉండగా, మనోవేగంతో పక్షీంద్రుడు అమృతస్థానం వద్దకు ఎగిరి రానే వచ్చాడు. అమృత రక్షకులు భయపడ్డారు కాని అంతలోనే ధైర్యం తెచ్చుకుని ఆయనతో తలపడ్డారు. ఆయన వాళ్ళకూ, వాళ్ళకు సహాయం వచ్చిన దేవ సైన్యాన్ని దిక్పాలకుల్నీ తుక్కు రేగ కొట్టి పారదోలి అమృతస్థానం చేరుకున్నాడు. దాని చుట్టూ అగ్ని మండుతూవుంది. పెనుగాలికి రగులుకుని దాని నాల్కలు ఆకాశాన్నే తాగుతున్నట్లున్నై. వెంటనే గరుడుడు అన్ని నదుల నోళ్ళూ పుక్కిట పట్టి తెచ్చి చల్లి ఆ మంటను ఆర్పివేశాడు. అక్కడ ఒక చక్రయంత్రం తిరుగుతూవుంది. దాని అంచులు, తగిలితే కోసుకు పోయేటంత పదునుగా వున్నై. దేహాన్ని చాలా చిన్నది చేసి దాని ఆకుల సందులో నుంచి లోపలికి చొరబడ్డాడు. అక్కడ అమృతాన్ని రక్షిస్తూ దాన్ని చుట్టుకుని రెండు పెద్దపాములున్నై. వాటి ముఖాలు అమిత వికారంగా కోపంగా వున్నై. కళ్ళు విద్యుదుల్కలవలె దారుణంగా వెలిగి పోతున్నై. వాటి దృష్టికి ఇతరులు మాడి పోవలసిందే. కాని గరుడుడు తన రెక్కలతో దుమ్ము గురిపి వాటి కళ్లు పోగొట్టాడు. వాటి తలలు చితక తొక్కి అమృతం తీసుకుని ఆకాశానికి ఒక్క ఎగురు ఎగిరాడు.

దేవతలను జయించి అమృతం తీసుకున్నాడే గాని అందులో ఒక చుక్క కూడా గరుడుడు తాగలేదు. ఈ అలోలత్వానికి మెచ్చుకుని విష్ణుదేవుడు ప్రత్యక్షమై గరుడుడు కోరిన వరాలిచ్చి అతణ్ణి తనకు వాహనంగానూ ధ్వజంగానూ స్వీకరించాడు.

అప్పుడు ఇంద్రుడు గూడా వచ్చి గరుత్మంతుడితో స్నేహం చేసుకున్నాడు. అమృతం తిరిగి ఇచ్చి వెయ్యమని అడిగాడు. "నా తల్లి దాసీత్వం పోవడానికి పాములకు అమృతం తెచ్చి ఇస్తానని చెప్పి తీసుకు పోతున్నాను. ఇది తీసుకుపోయి వాళ్ళ కిస్తాను. నాతల్లి దాస్యం పోతుంది. వాళ్ళు అమృతాన్ని తాగకముందే నీవు దాన్ని తీసుకుపో " అని గరుడుడు చెప్పాడు. ఇంద్రుడు సరే అన్నాడు.

గరుడుడు పాములవద్దకు పోయి దర్భలమీద అమృత కలశం ఉంచి, "ఇదుగో అమృతం తెచ్చాను. సూర్యచంద్రులు సాక్షిగా అనిలాగ్నులు సాక్షిగా నా తల్లి దాస్యం పోయింది. మీరు స్నానం చేసి వచ్చి దీనిని అనుభవించండి". అని చెప్పాడు. చెప్పి, తల్లిని తన వీపెక్కించుకుని, పాములకు కనపడకుండా అక్కడే వున్న దేవేంద్రుడికి వీడుకోలు చెప్పి వెళ్ళిపోయాడు.

నాగ కుమారులంతా స్నానానికి బయలు దేరారు దేవేంద్రుడు అమృతకలశం తీసుకుని స్వర్గలోకం చేరుకున్నాడు. నాగులు స్నానాలు చేసివచ్చేసరికి వాళ్ళకు అమృతకలశం కనపడలేదు. అది ఉన్న చోటని వాళ్ళు దర్భలు నాకారు. అందువల్ల వాళ్ళ నాలుకలు రెండుగా చీలాయి. అప్పటినుంచి వాళ్ళకు ద్విజిహ్వులు అనే పేరు వచ్చింది.

# భీష్మప్రతిజ్ఞ

వేదవ్యాసుడు పుట్టిన తరువాత కూడా సత్యవతి తండ్రి పంపున యమునా నదిలో ఓడ నడుపుతూనే ఉంది. కౌరవ వంశంలో ప్రతీపుని కొడుకైన శంతనుడు ఒకనాడు వేటమార్గం వచ్చి యమునాతీరాన తిరుగుతున్నాడు. ఉన్నట్లుండి అపూర్వమైన మంచి వాసన ఎక్కడ నుంచో వచ్చి ఆయన ముక్కులకు తగిలింది. ఆ వాసన ఎక్కడ నుంచి వస్తున్నదో తెలుసుకుందామని ఆయన బయలుదేరాడు. పోయి పోయి యమునలో ఓడ నడుపుతున్న యోజన గంధిని చూచాడు. ఆమె మృదు దేహం బంగారు రంగులో పచ్చగా మెరుస్తూ వుంది. నడుము సన్నగా వుంది. కళ్ళు తామర పత్రాలవలె ఉన్నాయి. ఆమె దేహ పరిమళం, తిరుగుడుపడే చూపులు, మనోహరమైన ఆకారం, నవ్వు మొగం కాంతి, విలాసం. చూచి ఆయన ముగ్ధుడైనాడు.

ఓ సుందరీ నువ్వెవతెవు? ఒంటరిగా ఈ యమునలో ఓడ నడుపుతూ ఉండడం నీకు తగిన పనేనా? అని ప్రేమతో అడిగాడు. అప్పుడా లేడికంటి చిన్నది తన నవ్వు మొగ మెత్తి దేవేంద్ర సమానుడైన రాజును చూచింది. చూచి ఆకన్య నేను దాశరాజు కూతుర్ని. తండ్రి పంపున ఈ పని ధర్మార్థంగా చేస్తున్నాను. అని ప్రీతితో బదులు చెప్పింది. ఆమె మాటలకు శంతనుడు మరీ ముగ్ధుడైనాడు. అమె అభినవ రూప సౌందర్యాలు ఇదివరకే విని తెలుసుకుని ఉండడం చేత ఆమెను కామించి దాశరాజు వద్దకు పోయి తన అభిప్రాయం వెల్లడి చేశాడు.

దాశరాజు చాలా సంతోషించాడు. మిక్కిలి భక్తితో శంతనుణ్ని పూజించి, "పుట్టిన కన్యను తగిన వరుడి కివ్వడమనేది లోక ధర్మం. నీవు వసుమతి నాధుడివి. నీలాటి వరుడికి ఈ కన్య నిచ్చి మేము ధన్యుల మవుతాం. ఆయినా నా మనస్సులో ఉన్నది చెబుతాను. ఈ కన్యను ధర్మపత్నిగా చేసుకోవడం నీకు ఇష్టమయితే ముందు నేను కోరే దాన్ని ఇవ్వాలి". అన్నాడు. ఇవ్వ తగిందైతే ఇస్తాను. తగనిదైతే ఇవ్వలేను. ఆ కోరిక ఏదో చెప్పు అని శంతనుడన్నాడు. ఓ రాజా. నీకు ఈ కన్యయందు పుట్టిన కొడుకు నీ అనంతరం రాజు కావాలి. ఇది ఇవ్వగలవా? అని దాశరాజు తన కోరిక చెప్పాడు.

అప్పుడు శంతనుడికి యువరాజైన గాంగేయుడు తలపుకు వచ్చాడు. మునుపొకసారి శంతనుడు గంగా తీరాన వేటాడుతుండగా ఆయనకు చక్కని చుక్కయైన ఒక కన్య కనిపించింది. ఆమె కూడా ఆయన్ను చూచింది. వారికి పరస్పరం మహానురాగం కలిగింది. నేను ఏది చేసినా దానికి ఒప్పుకొని నాకు అడ్డం చెప్పకూడదు. నన్ను తిట్టకూడదు. అలా అయితే నీకు భార్యనై నీ ఇష్టం నెరవేరుస్తాను. నన్ను ఎప్పుడైనా తిట్టావో అప్పుడే నిన్ను వదలి వెళ్ళిపోతాను. నన్ను భార్యగా చేసుకోవాలని ఇష్టముంటే ఈ సహాయం చెయ్యి అని ఆమె ఆయనతో అన్నది శంతనుడు అందుకు ఒప్పుకున్నాడు. ఆమె గంగాదేవి. మనుష్య స్త్రీ రూపం ధరించి శంతనుడికి ఇష్టసౌఖ్యాలు కలిగిస్తూవుంది. ఇలా ఉండగా ఆమెకు కొడుకులు పుట్టడం మొదలెట్టారు. పుట్టినవాళ్ళను

పుట్టినట్లుగా తీసుకుపోయి గంగపాలు చేస్తూ వచ్చింది. ఇలా ఏడుగుర్ని చేసింది. ఎనిమిదో కొడుకు పుట్టాడు. అప్పుడు శంతనుడు ఉండబట్టలేక, ఏడుగురు కొడుకుల్ని నీ పొట్టన పెట్టుకున్నావు. నీవు పుత్రఘాతినివి. ఉదయ సూర్య సమాన తేజంగల వీణ్ణి నే వదలలేను. అని ఆమెను తిట్టాడు.

సమయ భంగమైంది. అప్పుడు గంగ తన కథా, శంతనుడి కథా, వసిష్ఠుడి శాపం వల్ల తన కడుపున పుట్టిన అష్టవసువుల కథా, యావత్తూ శంతనుడికి చెప్పి, ఈ ఎనిమితో వాడు వసువుల్లో ఒక్కొక్కళ్ళ నాలుగో అంశమూ తాల్చి సకల ధర్మమూర్తియై పుట్టాడు. వీడు లోక హితార్థం మానవ లోకంలో చాలా కాలం ఉంటాడు. దేవవ్రతుడనే వీణ్ణి పెంచి పెద్దచేసి తిరిగి నీకు ఒప్పగిస్తాను. అని శంతనుణ్ణి ఒప్పించి గంగ, కొడుకును తీసుకుని వెళ్ళిపోయింది.

తర్వాత కొన్నేళ్ళకు శంతనుడు మళ్ళీ వేట మార్గంగా గంగాతీరానికి వెళ్ళాడు. గంగ కృశించి సన్నగా ప్రవహిస్తూ వుంది. ఏమిటా కారణమని మరికొంత దూరం వెళ్ళాడు. అక్కడ ఒక కుమారుడు విలువిద్య అభ్యసిస్తూ బాణాలతో గంగ కడ్డంగా సేతువు కట్టి ఉన్నాడు. అప్పుడు గంగ వచ్చి కొడుకు కుడి చెయ్యి పట్టి తెచ్చి భర్తకు చూపించి, వీడే నీ కొడుకు. అన్ని వేదాలు సాంగో పాంగంగా వసిష్ఠుడి వద్ద చదివాడు. శుక్ర బృహస్పతులు నేర్చినట్లుగా ధర్మశాస్త్రం మొదలైన వివిధ శాస్త్రాలూ నేర్చాడు. అస్త్రవిద్యలో పరశురాముడెంత దక్షుడో వీడంత దక్షుడు. ఆత్మజ్ఞానంలో సనత్కుమారుడు మొదలైన వాళ్ళ వంటివాడు. అని ఒప్పగించి వెళ్ళి పోయింది. శంతనుడు నిధి గన్న నిరుపేద మోస్తరుగా సంతోషించి కొడుకును తీసుకొని అందరి యెదుట యువరాజుగా పట్టాభిషేకం చేశాడు.

ఈ వృత్తాంతమంతా శంతనుడి మనస్సులో గిర్రున తిరిగింది. ఈ మాట తప్ప ఇంకొకటి ఏది కోరినా ఇస్తాను. అని దాశరాజుతో అన్నాడు. నా కిదే కోరిక. ఇంకొకటి ఏమీ లేదు. అని దాశరాజన్నాడు. ఇంకేం చేస్తాడు శంతనుడు? దాశరాజు వల్ల తన కోరిక భగ్నం కాగా ఇంటికి తిరిగి

వచ్చి సత్యవతిని తలుచుకుంటూ ఏమీ మాట్లాడకుండా విచారంగా ఉన్నాడు.

ఇలా ఉండగా ఒకనాడు గాంగేయుడు తండ్రి వద్దకు వచ్చి, "నీ రక్షణలో ఉన్న భూమిని బాధింపగల శత్రువులే లేరు. ప్రజలంతా నిత్య సంతోషులు. రాజులంతా నీకు విధేయులు. అయినప్పుడు నీకీ మనోదుఃఖం ఎందుకు"? అని అడిగాడు. శంతనుడు చాలాసేపు ఆలోచించి, వినవోయ్. ఒక్క కొడుకున్న వాడు కొడుకులు లేని వాడూ సమానమవి ధర్మాలలో నీకు తోడుగా మరి కొంతమంది కొడుకులను పొందాలని నాకు కోరిక పుట్టింది. అందుకోసం మళ్ళీ పెళ్ళి చేసుకోవాలని వుంది. అని కొడుకుతో అన్నాడు.

గాంగేయుడు పెద్దలను అడిగి యోజన గంధి మీద రాజుకు మనసున్నదని తెలుసుకున్నాడు. రాజులను చాలా మందిని వెంటబెట్టుకుని దాశరాజు వద్దకు వెళ్ళి, మారాజుకు సత్యవతిని భార్యగా ఇవ్వమని అడిగాడు. దాశరాజు దేవవ్రతుణ్ణి పూజించి, నీవు ధర్మాత్ముడివి, అర్థానర్థాలు తెలిసినవాడివి, అన్ని కార్యాలు సాధింప సమర్థుడివి, తండ్రికని కన్యకోసం వచ్చావు. కృతార్థుణ్ని. అయినా ఇందులో దాయాద దోషం ఉంది. అది నీ వల్లనే కలిగింది. నీకు కోపం వస్తే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కూడా నీకు అడ్డం రాలేరు. ఆ దోషం పోయే విధం నీవే ఆలోచించి ఈ వివాహం చెయ్యి. అని చెప్పాడు.

అప్పుడు గాంగేయుడు, "ప్రసిద్ధులైన రాజులారా, మీరంతా వినండి. తండ్రి కోసం సమయం చేస్తున్నాను. ఈమెకు పుట్టిన కొడుకే రాజ్యం చెయ్యడానికి అర్హుడు. వాడే మాకందరికీ ప్రభువు. వాడే కౌరవ కులాన్ని పెంపొందింప జేస్తాడు", అని అన్నాడు. సత్యవ్రతుడైన దేవవ్రతుడు చేసిన ఈ ప్రతిజ్ఞకు సభాస్తారులంతా మహా సంతోషం పొందారు.

అప్పుడు దాశరాజు, అన్ని ధర్మాలూ తెలిసిన వాడివి కాబట్టి నీకిలా చెయ్యడం సాధ్యమైంది. కాని ఇక ముందు నీకు పుట్టబోయే కొడుకులు నీలా వుంటారనీ, నీవు చేసినట్లు చేస్తారనీ, ఏమి నమ్మకం? అని అడిగాడు. "అయితే ఇదుగో బ్రహ్మచర్య వ్రతాన్ని చేపట్టాను. కొడుకులు లేక పోయినా అనుభవించదగిన లోకాలు నాకు చాలా ఉన్నాయి". అని గాంగేయుడు మరొక ప్రతిజ్ఞ చేశాడు. దాశరాజు అందుకు చాలా సంతోషించి సత్యవతిని ఇచ్చాడు.

ఇలా తండ్రి కార్యం కోసం రాజ్యాన్ని వదులుకుని బ్రహ్మచర్యదీక్ష చేపట్టిన దేవవ్రతుడి యొక్క సత్యవ్రతానికి దేవఋషులు మెచ్చి ఆయన మీద పుష్ప వర్షం కురిపించారు . ఆయన్ను భీష్ముడు అని పొగిడారు.

--- 0 ---

# శకుంతల

తపశ్శక్తి చేత బ్రహ్మర్షి భావం పొంది కూడా విశ్వామిత్రుడు ఇంకా ఘోరతపస్సు చేస్తున్నాడు. ఆ తపస్సుకు భయపడి దాన్ని చెరచడానికి దేవేంద్రుడు, అప్సరసలందరిలో మేటి యైన మేనకను పంపాడు. చల్లని మలయమారుతం తోడుగా ఆమె విశ్వామిత్రుడి తపోవనం ప్రవేశించింది. ముందుగా ఆ మలయమారుతం ఆమె కొప్పులోని పువ్వుల సువాసననూ, ఆమె ఒంటి గంధపు పూతల పరిమళాన్నీ మోసుకుని మునీశ్వరుడి మీద వీచింది. ఆ వెంటనే మేనక ఆయనకు మ్రొక్కి అనురాగంతో పువ్వులు కోస్తున్నట్లుగా అక్కడ విహరించడం మొదలుపెట్టింది. విశ్వామిత్రుడికి ధ్యాన భంగమైంది. మేనక సౌందర్యంతో ఆయన దృష్టి నాకట్టుకుంది. అదే సందని మన్మథుడు వాడి బాణాలతో ఆయన హృదయాన్ని వికలం చేశాడు. ఆ మునిమాణిక్యం ధైర్యం చెడిపోయింది. మేనకను పట్టడానికి లేచాడు.

ఇంకేముంది. విశ్వామిత్రుని వల్ల మేనకకు చూడచక్కని ఆడపిల్ల పుట్టింది. పుట్టిన పసికందును మాలిని అనే యేటి ఇసక దిబ్బ మీద పెట్టి మేనక దేవలోకానికి వెళ్ళిపోయింది. విశ్వామిత్రుడు తపోవనానికి వెళ్లాడు. కాని ఆ ముని ప్రభావం చేత, లేవాలని ఒకటే ఏడుస్తూ వున్న ఆ పిల్లదాన్ని, పెద్ద పులులు మొదలైన క్రూర జంతువుల వాత పడకుండా, శకుంతముల గుంపు, తమ రెక్కలతో కప్పి రక్షిస్తూ ఉంది. అక్కడికి సమిధలూ పూవులూ పండ్ల కోసం కణ్వమహర్షి , శిష్యులతో వచ్చి భూమికి దిగి వచ్చిన కొదమ నెలవంక వలె కాంతిమతియై వున్న బిడ్డను చూచి ఎత్తుకుని వచ్చాడు. శకుంత రక్షిత కావడం వల్ల ఆ పిల్లకు శకుంతల అని పేరు పెట్టి ఎంతో గారాబంగా పెంచి పెద్ద చేశాడు. ఈ విధంగా కణ్వ మహర్షికి శకుంతల హృదయానందని యైన కూతురైంది.

పౌరవుడైన దుష్యంత మహారాజు అనంతసత్త్వుడు. చిన్నతనం లోనే అద్భుత బలపరాక్రమాలు ప్రదర్శించినవాడాయన. ఒకనాడు దుష్యంతుడు వేటమార్గం బయలుదేరాడు. అడవిలో కనబడ్డ మృగాల నెల్లా వధిస్తూ చాలా దూరం వెళ్లాడు. అక్కడ ఒక పుణ్యనదీ తీరంలో ఆయనకు ఒక వనం కనపడ్డది. దాని రమణీయతకు మెచ్చుకుంటూ అందులోపడి చాలా దూరం పోయాడు. అక్కడ ఒక తపోవనం వుంది. అదే కణ్వమహాముని ఆశ్రమం. అక్కడ చిలకలు చెవులకింపుగా సామగానం చేస్తున్నాయి. ఏనుగులు కదలకుండా తదేక ధ్యానంతో వింటున్నాయి, వాటి తొండాల చివర పుట్టే మదజల బిందువుల చల్లటి గాలికి ఆశపడి సింహాలు వాటిని చేరి ఆ తొండాల చల్లటి నీడలో సుఖంగా వున్నాయి. భూత బలులకై తెచ్చి పెట్టిన అన్నపు ముద్దలు తినడానికి వచ్చిన ఎలుకలు పిల్లులు మొదలైన సహజ శత్రు జంతువులన్నీ ఒకటిగా కలిసి ఆడుతూ అక్కడ సహవాసం చేస్తున్నై.

ఇదంతా చూచి దుష్యంతుడు ముని శక్తి కెంతో ఆశ్చర్యం పొందాడు. కణ్వ మహామునికి నమస్కరించి రావాలని ఆయనకు కోరిక కలిగింది. తన పరివారాన్ని అక్కడే ఉండమని ఒక్కడూ ఆ మునీశ్వరుని మందిరం ప్రవేశించాడు.

కణ్వమహర్షి ఇంట్లో లేడు. పండ్లకోసం అడవికి వెళ్లి వున్నాడు. పద్మ పత్రాలవంటి నేత్రాలతో, కలగా పులగంగా కలిసివున్న తుమ్మెదల వలె నల్లనై వంకరలు తిరిగిన మెత్తటి కురులతో, సర్వ లక్షణ లక్షితాలైన అవయవాలతో, మన్మధ రాజ్యలక్ష్మి వలె వున్న శకుంతల ఆయనకు కనపడ్డది. అనంతవిలాసంలో జయంతుణ్ణి పోలిన ఆయన దుష్యంతుడని ఆమె గుర్తించి అమిత సంభ్రమంతో ఆతిధ్య సత్కారం నెరవేర్చింది. ఆయన అడుగగా తన వృత్తాంతం యావత్తూ చెప్పింది. ఆమెను చూడగానే చలించిన ఆయన హృదయం, ఆమె మునికన్య కాదనీ రాజపుత్రి అనీ తెలియగానే ప్రేమ ప్రవాహంలో సుళ్ళు తిరిగింది. "నీ ఒప్పిదమైన రూపమూ, కాంతి, నిర్మలగుణాలు, ఈ నార చీరలు కట్టడానికీ ఈ పండ్లు తినడానకీ , ఈ పర్ణశాలల నివాసానికీ తగినవి కావు. ఈ మునిపల్లెలో వుండడ మెందుకు? నాకు భార్యవై చంద్రకాంత సౌధాలలో రాజ్యసుఖాలు పొందవచ్చుగా! ఇంకా ఆలస్య మెందుకు? ఇప్పుడే గాంధర్వ వివాహం చేసుకుందాం. ఏమంటావ్" అని అడిగాడు. దుష్యంతుణ్ణి చూచినప్పటినుంచీ శకుంతలను కూడా మన్మధుడు ఆవేశించాడు. ఆమె సిగ్గుతో తల వంచుకుని, "కరుణా నిరతులు, ధర్మస్వరూపులు నా జనకులు ఇప్పుడే వస్తారు. వచ్చి నీ కిచ్చినట్లైతే నన్ను పెండ్లి చేసుకుందువుగాని", అని అన్నది. అప్పుడు దుష్యంతుడామెకు గాంధర్వవివాహం క్షత్రియులకు ప్రశస్తమైన విధమని చెప్పి, తన వల్ల ఆమెకు పుట్టే పుత్రుణ్ణి యువరాజును చేస్తానని వరమిచ్చి, ఆమెను ఒప్పించి, గాంధర్వ వివాహం చేసుకున్నాడు. అమెతో అభిమత సుఖాలు అనుభవించి, ఆమెను తీసుకురావడానికి మంత్రుల్ని కణ్వమహర్షి వద్దకు పంపిస్తానని చెప్పి, దుష్యంతుడు నిజపురానికి వెళ్ళిపోయాడు.

తాను చేసిన పనికి తండ్రి ఏమంటాడో అని శకుంతల భయపడుతూ ఉంది. కణ్వుడు వచ్చి ఆమె వాలకం చూచి తన దివ్యజ్ఞానంతో జరిగిందంతా తెలుసుకుని సంతోషించాడు శకుంతల మనస్సెపుడూ ధర్మమందే తగిలివుంటుందనీ, ఆమెకు పుట్టబోయే కొడుకు దీర్ఘాయురైశ్వర్య బల సమన్వితుడై చక్రవర్తి అవుతాడనీ, వంశకర్త

అవుతాడనీ, వరమిచ్చాడు. తర్వాత కొన్నాళ్ళకు శకుంతలకు భరతుడు పుట్టాడు. వాడు అనంత జవసత్వ సంపన్నుడై పసితనంలో అడవిలోని క్రూరమృగాలను పట్టి తెచ్చి వాటితో ఆడుకునేవాడు. అందుచేత వాణ్ణి అక్కడిమునులంతా సర్వదమనుడు అని పిలిచేవాళ్ళు. వాడు యువరాజు కావడానికి సర్వవిధాలా సమర్థుడైనాడని తోచగానే కణ్వమహర్షి శకుంతలతో, "తల్లీ, ఎలాటి సాధ్వులకైనా పుట్టిళ్ళలో చిరకాలం వుండడం తగదు. పతుల వద్ద ఉండడమే సతులకు ధర్మం. కాబట్టి నీ కొడుకును తీసుకుని నీ మగని వద్దకు వెళ్ళు" అని చెప్పి తన శిష్యులను తోడిచ్చి పంపాడు.

శకుంతల దౌష్యంతిని వెంటబెట్టుకుని దుష్యంతుడి పాలికి వెళ్ళింది. పేరోలగంలో వున్న ఆ రాజును చూచింది. కణ్వాశ్రమంలో తన పట్ల అనురాగం, ఆదరణ, అనుగ్రహం, కరుణ, సంభ్రమం ఇప్పుడాయనలో కనబడడం లేదు. ఆయన చూపులు విరసంగా క్రూరంగా ఉన్నాయి. ఈయన నన్ను ఎరగడా? ఎరిగి ఎరగనట్లున్నాడా? మనసు దూరం కావడం చేత మరిచి పోయినాడా? అని విచారంతో తలపోసింది. ఇంతదూరం వచ్చి వూరికే తిరిగి పోవడానికి మనసొప్పక, తన పూర్వ వృత్తాంతమంతా ఆయనకు చెప్పి, కణ్వాశ్రమంలో ఆయన ఇచ్చిన వరం జ్ఞాపకం చేసింది. ఉదయ సూర్యుని తేజంతో వెలిగిపోయే భరతుణ్ణి చూపించి నీ కొడుకు. వీడికి యువరాజపట్టం కట్టు. అన్నది.

దుష్యంతుడికి అదంతా తెలుసు. కాని తెలియని వాడి మోస్తరుగా, నిన్ను నేనెరుగను. నీవెక్కడి దానివో? ఊరికే ఉచితం కాని మాటలు ఎందుకు మాట్లాడతావ్? నీవెక్కడ నుచి వచ్చావో అక్కడికి వెంటనే వెళ్ళిపో అన్నాడు.

ఆ మాటలు విని శకుంతల తెల్లబోయింది. వేడి నిట్టూర్పులు విడిచింది. నిశ్చేష్టురాలైంది. అమెకు కోపం వచ్చింది. ఎర్రతామర రేకులవెంట కారే నీటి చుక్కల్లా, కోపం చేత ఎరుపెక్కిన అమె కనులనుంచి అశ్రుబిందువులు చిందాయి. తలవంచుకుని రాజును కడకంటి చూపులతో చూచింది. మనశ్శోకం తనకు తానే తమాయించుకుంది. చాలాసేపు

ఆలోచించి ఎన్నడూ ఏ స్త్రీ కూడా చెయ్యని మహాధర్మోపన్యాసం చేసింది.

తనకు తప్ప ఇతరులకు ఇక్కడెవ్వరికీ తెలియదు గదా అని తప్పు పలకడం ధార్మికులకు తగదన్నది. వేదాలు, పంచభూతాలు, ధర్మం, సంధ్యలు, అంతరాత్మ, యముడు, సూర్య చంద్రులు, రాత్రింబవళ్ళు అనే మహాపదార్థాలు పురుషుడి నడవడిని కనిపెట్టి చూస్తుంటాయన్నది. ఇవి వుండగా నరుడు ఆత్మవంచన చేసుకోలేడన్నది. తనకు రాజిచ్చిన వరం తనకు చెలిసినట్లు వాడికి తెలుసునన్నది. భార్య యొక్క ప్రాశస్త్యాన్ని వివరించింది. తానే కొడుకుగా పుడతాడు. కాబట్టి తండ్రికీ కొడుక్కీ భేదం లేదన్నది. దీపం వల్ల ఇంకొక దీపం పుట్టినట్లు భరతుడు నీ వల్లనే పుట్టాడన్నది. విపరీతములైన అడ్డుమాటలు కట్టి పెట్టి కొడుకు నెత్తుకుని కౌగలించుకొని ఆ సుఖం అనుభవించమని కోరింది. నాటి సత్యం వుండగా వాణ్ని తప్పు జూడడం సమంజసం కాదన్నది.

జనులకెల్ల ఆస్వాదనీయమైన నీరు లభించే బావులు నూతింటికన్నా ఒక సూనృతవ్రతమనే బావి మేలు. దాని కన్నా ఒక సత్క్రతువు మేలు. ఆ సత్క్రతువు కన్నా మహారాజా ఒక కొడుకు మేలు, రాజా ఆ కొడుకుకన్నా ఒక సత్యవాక్యమే మేలు. అంతటి సత్యాన్ని, కొడుకును వదులుకుంటారా మహారాజా అని అడిగింది శకుంతల. సుక్షత్రియుడైన విశ్వామిత్రునికి పవిత్రయైన మేనకకు జన్మించనదాన్ని నేను అబద్ధం చెబుతానా అన్నది. అయినా వినిపించుకో నట్టున్నాడు దుష్యంతుడు. నీవెవరు నేవెరు ఎక్కడిదానవు నీవు నేను నిన్ను ఇంతకు ముందు ఎప్పుడూ చూడలేదు మానినులకు ఇలాంటి అబద్ధాలు శోభించవు. మాట్లాడకుండా నీ ఆశ్రమానికి వెళ్ళు అన్నాడు. శకుంతల చాలా బాధపడింది. పుట్టగానే తల్లి నన్ను వదిలిపెట్టి వెళ్ళింది. తరువాత తండ్రీ వదిలిపెట్టాడు. ఇప్పుడు భర్త వదిలిపెట్టాడు. నేను ఏ కొఱ నోములు నోచానో కదా అనుకుని బాధపడింది. అలా అనుకుంటూ కొడుకును తీసుకొని వెళ్ళిపోవాలని వెనక్కు తిరిగింది. అంతలోనే ఒక్కసారిగా ఆకాశం నుండి దివ్యవాణి వినబడింది. దుష్యంతా ఈ సాధ్వి శకుంతల అంతా నిజమే చెప్పింది. ఈమె నీ భార్య ఆ చిరంజీవి నీకు ఆమెకు కలిగిన

కుమారుడు. ఈమె మహా పతివ్రత ఈమెను స్వీకరించి ఏలుకో అదే నీకు వివేకం అని అక్కడి సభాసదులంతా ఆశ్చర్యపోయేలా చెప్పింది దివ్యవాణి.

అప్పుడు దుష్యంతుడు సభాసదులందరితో ఇలా అన్నాడు. ఈమె నా భార్య అని, ఈచిరంజీవి నాకుమారుడని ముందే నాకు తెలుసు. కాని ఆసంగతి, నేను శకుంతలను కణ్వమహాముని ఆశ్రమంలో చూచి తొలిచూపులోనే వరించి గాంధర్వవిధిని వివాహమాడిన సంగతి, అలా ఈ బాలుడు కలిగిన సంగతి లోకానికి తెలియదు. లోకాపవాదానికి వెఱచే నేను వీరు నాకు తెలియదని చెప్పాను. అలా చెప్పలడం వల్ల ఇప్పుడు ఈ దివ్యవాణి అందరికీ తెలిసేలా ఆసంగతిని చెప్పింది. దీనితో నా శకుంతల పాతివ్రత్యం పవిత్రత జగద్విదితం అయ్యేలా అందరికీ తెలిసాయి. నిజానికీ ఈ కాసేపు ఇలా చెప్పవలసి వచ్చినందుకు నాకూ చాలా బాధగా ఉంది అని చెప్పి దుష్యంతుడు శకుంతలను దగ్గరికి తీసుకొని, పులకలు కలిగే విధంగా కొడుకునెత్తుకొని మహానంద భరితుడయ్యాడు. చూసే వారందరికీ ఆనందం కలిగింది.

ఆతర్వాత దుష్యంతుడు తనకొడుకు భరతుడికి యౌవరాజ్యాభిషేకం చేసి చాలా కాలం సుఖంగా రాజ్యం చేసాడు. అలా పెద్దకాలం ఉన్నతర్వాత తన రాజ్యం మొత్తం భారం భరతునికి ఒప్పగించి శకుంతలా దుష్యంతులు తపోవనానికి వెళ్లారు.

----- 0 -----

# వ్యాసుని జననం

పరాశరుడు అనే మునీంద్రుడు వసిష్ఠుని మనుమడు, శక్తి కొడుకు. ఆయన మదమత్సరాలు లేనివాడు. ముల్లోకాల పొగడ్తలు అందుకొన్నవాడు. ఆయన బుద్ధి చాలా గొప్పది. పాపాలను పోగొట్టే ఘోరమైన తపస్సే ఆయన ధనం. అలాటి పరాశరుడు ఒకమంచి వ్రతాన్ని పూని తీర్థయాత్ర బయలుదేరాడు. పోయి పోయి కొంతకాలానికి యమునా నదిని చేరుకున్నాడు. ఆ నదిరేవులో ఒక ఓడ వుంది. ఆ ఓడలో ఒక చక్కని చుక్క ఒకే ఒక గుడ్డ ఒంటికి చుట్టబెట్టుకుని వుంది. ఓడ యెక్కడానికి వచ్చే వాళ్ళకోసం చూస్తూ వుంది. ఆ పిల్లే సత్యవతి. ఆ కన్యకు మరొక పేరు మత్స్యగంధి.

ఆ యువతిని చూడగానే మునీశ్వరుడు మదన పరవశుడైనాడు. ఎవరా ఈ అందాలరాశి అనుకున్నాడు. అనుకోవడమే ఆలస్యం, ఆమె పుట్టు పూర్వోత్తర మంతా ఆయన దివ్య జ్ఞానానికి తెలిసి వచ్చింది.

వసువు అనేవాడు చేది దేశానికి రాజు. రాజ్య విభవం ఎంత వున్నా దానిలో తగులు కోకుండా ఆయన తపస్సుకు పూనుకున్నాడు. అందుకు మెచ్చి ఇంద్రుడు ఆయనతో స్నేహం చేశాడు. తనవద్దకు వచ్చి పోతూ వుండగలందులకు ఒక దివ్య విమానం ఇచ్చాడు. ఆ విమాన మెక్కి ఉపరి లోకంలో తిరగడం వల్ల వసురాజుకు ఉపరిచరుడు అనే పేరు వచ్చింది.

ఉపరి చర వసువు రాజధాని సమీపంలో శుక్తిమతి అనే మహానది ప్రవహిస్తూ వుంది. కోలాహలం అనే పర్వతం ఆ నదిని కామించి అడ్డం పడ్డది. వసురాజు దాన్ని తన పాదంతో తొలగదోశాడు. కాని ఆ లోపలనే కోలాహల పర్వతంతో కలయిక వల్ల శుక్తిమతికి గిరిక అనే కూతురు పుట్టింది. కొండ అడ్డు తొలగించినందుకు భక్తిమతి యైన శుక్తిమతి, గిరికను ఉపరిచరుడికి కానుక ఇచ్చింది. ఆయన గిరికను తన ధర్మపత్నిని చేసుకున్నాడు.

గిరిక ఋతుమతి అయింది. ఆమెకు జింక మాంసం తెచ్చి పెట్టవలసిందిగా పితృదేవతలు ఉపరిచరుణ్ణి కోరారు. ఆయన జింకల వేటకు వెళ్ళాడు. వెళ్ళాడేగాని తలపంతా గిరిక సౌందర్యం మీదనే వుంది. మనస్సంతా గిరిక మయమై పోయింది.

ఆ రాగావేశం యొక్క ప్రభావం యమునానదిలో తిరుగుతున్న ఒక ఆడచేప మీద పడింది. ఆ చేప గర్భం తాల్చింది. దోనెలలో ఒక జాలరి వలవేసి ఆచేపను పట్టి పొట్టకోశాడు. అందులో ఒక మగబిడ్డ, ఒక ఆడ పిల్ల వున్నారు. వాడు వాళ్ళను తీసుకుపోయి తన ఏలిక ఆయిన దాశరాజుకు ఒప్పగించాడు.

ఆ చేప మరోవ్వరో కాదు. అద్రిక అనే అప్సరస. బ్రహ్మ శాపం వల్లచేప అయింది. మనుషుల్ని కన్న వెంటనే నీకు శాప విమోచనం కలుగుతుందని బ్రహ్మ చెప్పి వుండడం వల్ల ఆ చేప ఇప్పుడు మళ్ళీ అద్రిక అయి దేవలోకానికి వెళ్ళిపోయింది. ఆమె కొడుకు మత్స్యరాజు అనే పేరుతో మత్స్య దేశానికి ప్రభువైనాడు. కూతుర్ని దాశరాజు

పెంచుకున్నాడు. ఆ కన్య పెరిగి పెద్దదై ఇప్పుడు తండ్రి పంపున ధర్మార్థంగా యమునానదిలో ఓడ నడుపుతూ వుంది.

ఇది మత్స్యగంధి పుట్టు పూర్వోత్తరం. పరాశరుడు ఓడ యెక్కాడు. మత్స్యగంధి తెడ్డు వేసి ఓడ నడుపుతున్నది. ఆ ఓడలో వాళ్ళిద్దరే. ఇంకెవరూ లేరు. నీటిని చీల్చుకుంటూ ఓడ రంయిమని ముందుకు పోతున్నది. గాలికి తెరచాప బూరటిల్లింది. ఆ గాలికే మత్స్యగంధి ఒంటిమీది ఏకవస్త్రం కూడా తెరచాపవలె తయారయింది. మునీశ్వరుడి దృష్టి ఈమె అందాన్ని వేయి నోళ్ళతో తాగుతున్నది. అది అంతేకదా మరి! మన్మథుని యొక్క శక్తిని ఓర్చుకోగల జనులెవరు?

ఆ పరవశంలో లజ్జ విడిచి మునీశ్వరుడు తన కోరికను మత్స్యగంధికి తెలియ జేశాడు. ఒప్పుకోకపోతే ముని శాపమిస్తాడేమో, అనే భయంతో, "ఒళ్ళు నీచు కంపు కొట్టే బెస్తదాన్ని నేను. అదిగాక నేను కన్యను. కన్యకా వ్రతం పోగొట్టుకుని తండ్రి మొగం ఎలా చూడగలను? కాబట్టి ఓ మునీశ్వరా, దయతో నాకు దోషం లేకుండా వుండే మార్గం చూడు". అని మత్స్యగంధి అన్నది. ఆ మాటలకు పరాశరుడు చాలా సంతోషించాడు. నా కోరిక నెరవేర్చినందువల్ల నీ కన్యాత్వం పోదు, భయపడకు, అని వరమిచ్చాడు. నీవు బెస్తదానివి ఎంతమాత్రం కావు, అద్రిక అనే అప్సరసకూ, వసువు అనే రాజర్షికీ పుట్టిన దానివి. అని ఆమె పుట్టుక సంగతి అంతా చెప్పాడు. ఆమె శరీర సౌరభం యోజన దూరం వ్యాపించేటట్లు అనుగ్రహించాడు. మత్సగంధి కాస్తా యోజన గంధి అయింది. ఆయన దయవల్ల ఆమెకు దివ్యమైన వస్త్రాలూ సొమ్ములూ అమిరాయి.

ఆమె యమునానదిలో ఉండే ఒక దీవికి ఓడను పట్టించింది. ఇద్దరూ ఓడ దిగారు. ఆ దీవిలో ఒక్క చెట్టుగాని చేమగాని లేదు. అంతా బట్టబయలు. ఆ ఒడ్డున నడిచేవారందరికీ దీవి దీవంతా కనపడుతుంది. ఈ శంక ఆమెకు కలిగిందో లేదో మునీశ్వరుడు గాఢమైన మంచుపొరను కలిగించాడు. ఆ మంచు, దీవిని దట్టంగా కప్పి చూచేవారి దృష్టిని

అరికట్టింది. మంచు చీకటిలో దీవి మునిగి పోయింది.

బ్రహ్మతో సమానుడైన ఆ ముని శక్తి వల్ల సత్యవతి అప్పటి కప్పుడు గర్భం ధరించింది. ఆ వెంటనే ఆమెకు సూర్యకాంతి వంటి కాంతితో వెలిగిపోయె కుమారుడు పుట్టాడు. ఆయన పుట్టుకతోనే జ్ఞానవంతుడు. మునీంద్రులందరికీ మొదటివాడైన వేదవ్యాసుడు. యమునా ద్వీపంలో పుట్టిన ఆ నల్లనయ్య కృష్ణద్వైపాయనుడని పిలువబడ్డాడు. పుట్టీ పుట్టడంతోటే ఆయన బుద్ధి తపస్సు మీద నిలిచింది.

సత్యవతి కోరిన వరాలన్నీ ఇచ్చి పరాశరుడు తన యిష్టం వచ్చిన చోటికి వెళ్ళిపోయాడు. జింకచర్మం కపిలజడలు, దండకమండలాలు, ధరించి కృష్ణద్వైపాయనుడు తల్లి ముందు నిలిచి రెండు చేతులూ మోడ్చి ఆమెకు మొక్కాడు. మీకు పని బడ్డప్పుడు నన్ను తలుచుకోండి. నేను వెంటనే వస్తాను. అని ఆమెకు చెప్పి తపోవనానికి వెళ్ళిపోయాడు.

అన్ని లోకాలకు మేలు గోరి వ్యాసుడు మహాఘోరతపం చేశాడు. బ్రహ్మ అంశతో పుట్టిన ఆయన, గజిబిజిగా వున్న వేదాల నన్నిటినీ స్పష్టంగా విడదీసి లోకాలలో ప్రకాశించేటట్లు చేశాడు. పంచమ వేదమైన మహాభారతం రచించాడు.

---- 0 ---

# సర్పయాగం

పరీక్షితుని కొడుకు జనమేజయుడు జనుల పొగడ్తలందుకుంటూ పూర్వరాజుల వలె చక్కగా రాజ్యం చేస్తున్నాడు. ఒకనాడాయన వద్దకు ఉదంకుడనే మహాముని వచ్చాడు.

ఉదంకుడు పైలుని శిష్యుడు. శ్రద్ధగా గురు పరిచర్య చేసి ఆయన వల్ల జ్ఞానాన్ని, అణిమాద్యష్ట సిద్ధులనూ, పొందాడు. చదువు పూర్తి అయింతరువాత, గురుభార్య ఉదంకుడుకి ఒక పని పురమాయించింది. పౌష్యుడనే రాజు భార్య పెట్టుకునే కుండలాలు తెచ్చి పెట్టమన్నది. వాటిని ధరించాలని ఆమెకు ఎన్నాళ్ళనుంచో అపేక్ష. ఉదంకుడు వెళ్ళి పౌష్యుని భార్యను అడిగి కుండలాలు తెస్తుండగా దారిలో తక్షకుడనే నాగరాజు

మాయచేసి వాటిని కాజేసి, భూ వివరం గుండా నాగలోకానికి ఉడాయించాడు. ఉదంకుడు ఆ వివరం గుండానే నాగలోకానికి వెళ్ళి నాగరాజులందరినీ స్తుతించాడు. కాని ఛాళ్ళెవరూ పలకలేదు. అక్కడ కనపడిన ఒక దివ్య పురుషుని సహాయంతో ఉదంకుడు నాగలోకానికంతటికీ మహాక్షోభం కలిగించాడు. దానికి భయపడి తక్షకుడు కుండలాలు తెచ్చి ఇయ్యగా వాటిని తెచ్చి గురుపత్నికిచ్చి ఉదంకుడు గురు ఋణం తీర్చుకున్నాడు.

ఆ తర్వాత ఉదంకుడు చాలా కాలం తపస్సు చేశాడు. కాని తక్షకుడు చేసిన అపకారానికి బదులుచెయ్యవలెననే కోరిక అతడికి పోలేదు. అందుకని జనమేజయుడి వద్దకు వచ్చి ఆయనతో ఇలా చెప్పాడు :- రాజా.. నేను గురుకార్యంలో నిమగ్నుడనై ఉండగా, తక్షకుడు మోసబుద్ధితో కారణమేమీ లేకుండానే నాకు అపకారం చేశాడు. నా సంగతి అలా ఉంచు. మీ తండ్రి పరీక్షిన్నరేంద్రుడు ఎటువంటివాడు! పరిపాలనలో ప్రజలందరికి హితమైన పద్ధతులవలంబించాడు. శౌర్యంలో అర్జునుని వంటివాడు. ఒక బ్రాహ్మణుడు చెప్పాడని తక్షకుడు చెట్టంత ఆ మహారాజును తన పొట్టను పెట్టుకున్నాడు. కాబట్టి నీవు అనేకమంది బ్రహ్మలు చేయించగా సర్పయాగం చేసి ఒక్క తక్షకుణ్ణి కాకుండా పాములన్నింటినీ అగ్నిలో బూడిద చెయ్యి. ఒక పాము చేసిన తప్పుకు పాముల నన్నిటినీ నాశనం చెయ్యడం ధర్మం కాదనుకుంటావేమో, దుష్టుడైన కులపాంసనుడు ఒక్కడు చేసిన తప్పుకు ఆకులమంతా నిందించబడడం లోకంలో ఇదివరకు వున్నదే, ఇదేమీ కొత్త కాదు. ఇలా చెప్పి ఉదంకుడు, సర్పయాగం చెయ్యవలెననే బుద్ధి జనమేజయుడికి కలిగించాడు.

పరీక్షితుడు మరణించినపుడు జనమేజయుడు చాలా చిన్నవాడు. అతడికి తండ్రి మరణం కారణం తెలియదు. ఇప్పుడు తెలుసుకోవాలని బుద్ధి పుట్టింది. ఆ విషయమంతా సవిస్తరంగా చెప్పమని మంత్రుల్ని అడిగాడు. వాళ్ళు ఆ కథ యావత్తూ చెప్పారు.

పరీక్షితుడు ఒకనాడు వేటకు వెళ్ళాడు. మహారణ్యాలన్నీ తిరిగి

అనేక మృగాలను చంపాడు. ఒక్క మృగం మాత్రం వేటుపడి కూడా అతడికి చిక్కకుండా పారిపోయింది. దాన్ని వెతుక్కుంటూ పరీక్షితుడు బయలుదేరాడు. దారిలో తపోదీక్షలో వున్న శమీకుడు అనే ముని కనిపిస్తే ఆయన్ను అడిగాడు. ఆయన మౌనవ్రతంలో ఉండడం చేత జవాబు చెప్పలేదు. పరీక్షితుడికి కోపం వచ్చింది. అక్కడ చచ్చి పడి వున్న ఒక పామును ఆ ముని మెడలో వేసి హస్తినాపురానికి తిరిగి వచ్చాడు.

శమీకుని కొడుకు శృంగి అనేవాడు ముక్కోపి. తండ్రికి జరిగిన అవమానం తెలిసి అతడు కోపంతో నిలువెల్లా కంపించి పోయాడు. ఏడు రోజుల్లోపల తక్షకుని విషాగ్ని చేత పరీక్షితుడు దగ్ధమై పోవుగాక అని శాపమిచ్చాడు.

ఈ శాపం సంగతి విని పరీక్షితుడు భయపడి , అతి ప్రయత్నం మీద ఒంటి స్తంభం మేడ కట్టించి, అందులో పాము మంత్రాలు తెలిసిన వాళ్ళనూ, విష వైద్యులనూ చుట్టూ పెట్టుకుని కూర్చున్నాడు. ఏడవరోజు పొద్దుగూకే వేళ నాగకుమారులను బ్రాహ్మణ వేషాలతో పరీక్షితుడి వద్దకు పంపి తక్షకుడు అదృశ్యుడై తానూ వారి వెంట వెళ్ళాడు. ఆ విప్రకుమారులు చూడముచ్చటగా ఉన్నారు. వాళ్ళు తెచ్చిన పూవులూ పండ్లూ చాలా అందంగా ఉన్నాయి. పరీక్షితుడు వాళ్ళను ఆహ్వానించి వాళ్ళు తెచ్చిన కానుకలు తీసుకుని చుట్టూవున్న వాళ్ళకు పంచి పెట్టి తానొకపండు చిదిమాడు. అందులో దాక్కుని వున్న తక్షకుడు మొదట ఒక నల్లని క్రిమిగా కనపడి ఆ వెంటనే లక్కరంగు పామై పరీక్షితుణ్ని కాటు వేసి వెళ్ళిపోయాడు. ఈ ఘోరానికి అక్కడ వున్న వాళ్ళంతా భయపడి పారిపోయారు. తక్షకుడి విషాగ్ని చేత ఒంటిస్తంభం మేడతో కూడా పరీక్షితుడు కాలిపోయాడు.

ఈ వృత్తాంతం విని జనమే జయుడు కోపోద్దీపిత చిత్తుడయ్యాడు. సర్పయాగం చెయ్యడానికి నిశ్చయించాడు. రాజు తలుచుకుంటే దెబ్బలకేం కొదవ? వెంటనే కావలసిన ఏర్పాట్లన్నీ పూర్తయ్యాయి. జనమే జయుడు సర్పయాగ దీక్షితుడై యజ్ఞశాలలో కూర్చున్నాడు. అప్పుడొక

పౌరాణికుడు, రాజా కార్యక్రమమంతా బాగా తెలిసిన ఋత్విక్కుల చేత సంపూర్ణంగా ప్రయోగింపబడి కూడా ఈ యాగం పూర్తికాదు. ఒక బ్రాహ్మణుని వల్ల మధ్యలో ఆగిపోతుంది అని చెప్పాడు.

• ఎవరా బ్రాహ్మణుడు? పాములతల్లి కద్రువ పాములన్నీ జనమేజయుడు చేయబోయే సర్పయాగంలో మాడి మశానమై పోవుగాక అని ఒక కారణం చేత శపించింది. తల్లి శాపం వల్ల నాగకుల ప్రళయం కాబోతున్నదే అని వాసుకి మొదలైన నాగరాజులకు మనో దుఃఖం పట్టుకున్నది. ఇలా జరగకుండా చేసే ఉపాయమేమైనా వుందా అని వాసుకి ఆలోచిస్తున్నాడు. జరత్కారుడనే మహామునికీ వాసుకి చెల్లెలు జరత్కారువుకూ పుట్టిన ఆస్తికుడు సర్పకుల ప్రళయం వారిస్తాడని కద్రువ శాపాన్ని గురించి జరిగిన సంభాషణలో బ్రహ్మదేవుడా దేవతలకు చెప్పాడని, ఆ సంభాషణ విన్న ఏలాపుత్రుడు తెలియజెయ్యడంతో వాసుకికి వూరట కలిగింది. జరత్కారుడు ఎప్పుడు పెళ్ళి చేసుకుంటాడా అని అప్పటినుంచీ వాసుకి ఎదురు చూస్తున్నాడు.

జరత్కారుడు బ్రహ్మచర్యం పాటిస్తూ పెళ్ళి చేసుకోవడానికి ఇష్టపడలేదు. కాని చివరకతడు తన పితృదేవతల చేత ప్రబోధితుడై తన పేరే వున్న కన్యను పెండ్లాడడానికి సుముఖుడైనాడు. అలాటి కన్య భూలోకంలో ఎక్కడా కనపడలేదు. ఇదంతా వాసుకి విని చెల్లెలు జరత్కారువును వెంటబెట్టుకుని వెళ్ళి జరత్కారుడికిచ్చి వివాహం చేశాడు. జరత్కారువు గర్భవతి అయింది. ఒకనాడు తనకు అవమానం తలపెట్టి సమయం భంగం చేసిందని ఆమెను పుట్టింటికి పంపి జరత్కారుడు తపోవనానికి వెళ్లాడు. జరత్కారువు ఆస్తికుడనే కొడుకును కన్నది. పౌరాణికుడు చెప్పిన బ్రాహ్మడు ఈ ఆస్తికుడే.

జనమేజయుడు ఆ పౌరాణికుడు చెప్పిన మాటలు లక్ష్యపెట్టలేదు. సర్పయాగానికి ఉపక్రమించమని మహామునులందర్నీ నియోగించాడు. వాళ్ళు నల్లటి వస్త్రాలు కట్టుకుని, పొగచేత ఎర్రబడిన కళ్ళతో, అగ్నికుండంలో హోమం వేలుస్తూ మంత్రాలు చదువుతున్నారు. ఆ

మంత్రాల ధాకకు, నాగులందరూ ఒకళ్ళ నొకళ్ళు పిలుచుకుంటూ భయవివశులై అగ్ని కుండంలో పడుతున్నారు. తెల్లపాములు, నల్లపాములు, పచ్చపాములు, ఎర్రపాములు, ఒంటితలవి, మూడు తలలవి, అయిదు తలలవి, ఏడు తలలవి, ఇలా అనేక తలలుగల పాములు, ఆపరాని వేగంతో హాహాకారాలు చేసుకుంటూ వచ్చి అగ్గిలో పడి బుగ్గయి పోతున్నాయి. తడబడుతూ వచ్చిపడే శబ్దమూ, పడి కాలే శబ్దమూ, కాలి పిట్లే శబ్దమూ, పాముల దేహాల నుంచి బయల్దేరి దిక్కులను మోగిస్తున్నవి. ఈ ఘోరానికంతకూ కారకుడైన తక్షకుడు పోయి, దేవేంద్రుడి శరణుజొచ్చాడు.

అప్పుడు, తల్లీ మేనమామల పంపున ఆస్తికుడు వేదవిదులైన బ్రాహ్మలతో, సర్పయాగ స్థలానికి వచ్చాడు. ఆయన దేహకాంతితో ఆ సభాంతగమంతా వెలిగిపోయింది. ఆయన కల్మషం ఏమీ లేనివాడు. నిర్మల తపోమహిమలో బ్రహ్మదేవుని వంటివాడు. ముందు స్వస్తివచనం చెప్పి తర్వాత జనమేజయుణ్ణి, ఆయన యజ్ఞం యొక్క మహిమనూ, యాగ తంత్రం నడిపే ఋత్విజుల్ని, సదస్యుల్ని, అగ్నిదేవుణ్ణీ, ఆ సమయానికి తగిన మంచిమాటలతో స్తుతించాడు. ఆయన అంటే అందరికీ ప్రీతి కలిగింది. ఆయనకేం కావాలో కోరుకుంటే ఇస్తానని జనమేజయుడన్నాడు. అందుకు సంతోషించి ఆస్తికుడు సర్పయాగం నిలిపివెయ్యమని కోరాడు. సదస్యులంతా ఆయన కోరికను బలపరిచారు. జనమేజయుడు సర్పయాగం చాలించాడు.

ఆ లోపల మంత్రాల మహత్తు చేత ఇంద్రుణ్ణి కూడా వదలి పెట్టి, తక్షకుడు చేష్టలుడికి గిరికీలు కొడుతూ అగ్నికుండంలో పడడానికి సిద్ధంగా ఉన్నాడు. అప్పుడు ఆస్తికుడు, ఓహో. తక్షకా, నీకింక వచ్చిన భయంలేదు. తిరిగి వెళ్ళిపో. అని అతణ్ణి నిప్పుల్లో పడకుండా కాపాడాడు. సర్పకుల ప్రళయాన్ని ఇలా వారించినందుకు సదస్యులంతా ఆస్తికుణ్ని కీర్తించారు.

----- 0 -----

# ప్రమద్వర

ప్రమద్వర, విశ్వావసుడనే గంధర్వరాజుకూ మేనక అనే అచ్చరకూ పుట్టింది. తండ్రి గంధర్వుడు. తల్లి అప్సరస. ఇక ఆకన్య అందచందాలకు కొదవేముంటుంది? రూపంలోనూ కాంతిలోనూ గుణాలలోనూ ప్రమదలందరికీ మేలుబంతి కావడం చేత ఆమెకు ప్రమద్వర అనే పేరు సార్థకమైంది. అప్సరసలు పిల్లలను కంటారేగాని వాళ్ళను పెంచరు. కనగానే ఎక్కడో వదిలేసి వాళ్ళు పోతారు. మేనక అలా

వదిలివేసిన ప్రమద్వరను స్థూలకేశుడు అనే ముని తెచ్చి తన ఆశ్రమంలో పెంచుతున్నాడు.

రురుడు అనే ముని కుమారుడు ప్రమద్వరను ప్రేమించాడు. భృగువంశస్థుడైన ప్రమతికీ, ఘృతాచి అనే అప్సరసకూ, రురుడు పుట్టాడు. ప్రఖ్యాతమైన భృగువంశంవాడు కావడం వల్ల, అచ్చరకు జనించడం వల్లా, రురుని దేహకాంతి నిరుపమానంగా ఉండేది.

భృగు కులానికి మూలపురుషుడు భృగుడు అనే విప్రుడు. అతని భార్య పులోమ. ఆమె గర్భంతో ఉంది. ఒకనాడు, అగ్నిహోత్రానికి అగ్నులు విహరించమని భార్యతో చెప్పి, భృగుడు స్నానానికి వెళ్ళాడు. అంతట పులోముడు అనే వింత రాక్షసుడు అక్కడికి వచ్చాడు. పులోమను చూచి ఉన్మత్తుడై, ఈమె ఎవరి భార్యో చెప్పమని అగ్నిదేవుణ్ణి అడిగాడు. అగ్నిదేవుడికి ప్రాణసంకట మైంది. చెబితే భృగుడు శపిస్తాడు. తెలిసి కూడా చెప్పక పోతే అసత్యం పలికిన పాపం చుట్టుకుంటుంది. విప్రుడిశాపభయం ఎలాగైనా తీర్చుకోవచ్చు, కాని అబద్ధం చెప్పడంవల్ల కలికే పాపభయం తీర్చడానికి వీలులేనిది. అనుకుని అగ్నిదేవుడు, ఉన్నసంగతి చెప్పేశాడు. ఈమెను నేను మొదట వరించాను. తర్వాత భృగుడీమెను చేసుకున్నాడు, అన్నాడు పులోముడు. అని పందిరూపు తాల్చి పులోమను ఎత్తుకుని పరిగెత్తాడు. భయంతో ఆ కోమలి ఒకటే ఏడవడం మొదలెట్టింది. పులోముడు పరిగెత్తుతూనే వున్నాడు. ఇందుకు గర్భంలో వున్న పిల్లవాడికి చెప్పరానంత కోపం వచ్చింది. గర్భంలోనుంచి తటాలున క్రిందికి జారాడు. కుక్షిచ్యుతుడు కావడం వల్ల వాడికి చ్యవనుడు అనే పేరు వచ్చింది. చక్కగా ఉదయించిన వెయ్యి సూర్యుల తేజస్సు ఎలా వుంటుంది? భరింపరానిదిగా వుంటుంది. ప్రళయకాలంలో లోకాలన్నిటినీ కాల్చివేసే అగ్ని ఎలా ఉంటుంది? ఎంతో క్రూరంగానూ తీవ్రంగానూ ఉంటుంది. ఆ బాలుడి తేజస్సు అలా వుంది. వాణ్ణి చూస్తూనే అసుర, సురసురా కాలి మాడి మసైపోయాడు.

ఇలా భృగువంశం నశించిపోకుండా దాన్ని వర్ధిల్లజేసిన చ్యవనుని

మనమడే, రురుడు. ప్రమద్వర కూడా రురుణ్ని ప్రేమించింది. ప్రమతి ఆశ్రమం, స్థూలకేశుడి ఆశ్రమం, రెండు దరిదాపుల్లోనే వుండేవి. రురుడూ, ప్రమద్వరా ఇద్దరూ తరుచుగా కలుసుకుంటా వుండేవాళ్లు. రాను రాను వారి స్నేహం వృద్ధి చెందింది. ఒకరిని విడిచి ఒకరు నిమిషం వుండలేక పోయేవాళ్ళు. ఆ స్నేహం ప్రేమగా మారింది. ఈ సంబంధానికి రెండు పక్షాల పెద్దలూ అంగీకరించారు. ఇక వివాహం జరగడమే తరవాయి. ఆ శుభదినం కోసం ఇద్దరూ ఉత్కంఠతో ఎదురు చూడసాగారు. పగళ్ళూ, రాత్రిళ్ళూ వాళ్ళకు ఎంతో దీర్ఘంగా ఉన్నట్లు తోస్తున్నై. రోజులు ఒక పట్టాన గడవడం లేదు.

ఈ పరిస్థితిలో ఒకరోజు ప్రమద్వర ఉబుసుపోకకు తోటి కన్యలతో ఆటలాడడం మొదలుపెట్టింది. ఆటసందడిలో చూడక ఒక పామును కాలితో తొక్కింది. ఆ పాము బుస్సుమని పడగ విప్పి ప్రమద్వరను కాటు వేసింది. చెలికత్తెలందరూ ఎక్కడలేని భయంతో చిందర వందరగా అటూ యిటూ పరుగెత్తుతూ అరవడం మొదలెట్టారు. పాము విషం తలకెక్కి ప్రమద్వర చచ్చి పడిపోయింది. ఈ సంగతి తెలిసి ప్రమతీ రురుడూ చక్కా వచ్చారు. చుట్టుపట్ల ఆశ్రమాల్లో వుండే మునులంతా వచ్చి చేరారు. చచ్చిపడి వున్న ప్రమద్వరను చూచి అంతా దుఃఖ వివశులైనారు.

శోకంతో రురుడి హృదయం స్తంభించి పోయింది. దేహం మొద్దుబారినట్లైంది. అతని ప్రాణాల్లో ప్రాణాలు లేవు. లోకవ్యాపారమంతా ఉన్నట్లుండి హఠాత్తుగా ఆగిపోయినట్లనిపించింది. ఎవతెను తాను పెన్నిధిగా ప్రేమించాడో ఆ ప్రమద్వర ఇప్పుడు జీవంతో లేదు. ప్రాణం లేని వట్టి బొందె మాత్రమే తన కెదురుగా పడి వుంది. ఇన్నాళ్ళ తమ పరస్పర ప్రేమకు ఇదా ఫలితం? దైవం ఈనాడు తన్ను ఈ విధంగా వంచించి హతాశుణ్ణి చేస్తుందా? అక్కడ ఒక్క క్షణం కూడా వుండలేక పోయాడు. ఒంటరిగా అడవిలోకి వెళ్ళాడు.

"నేనే అలుపు లేకుండా యజ్ఞయాగాది పుణ్యకార్యాలు చేస్తున్న వాణ్ణయితే గురువుల యెడలా సద్బ్రాహ్మణులయెడల భక్తి గలవాణ్ణయితే,

ఉత్తమ తపస్సు చేసిన వాణ్ణయితే, ఓ దేవతలారా. భూదేవతలారా, నా మనస్సులో పీఠం పెట్టుకున్న ప్రమద్వరకు మీ దయవల్ల ఇప్పుడు విషం దిగిపోవాలి అని ఎవరైనా మహాపురుషులు తమ తిరుగులేని ఆజ్ఞచేత గానీ, విషవైద్యంలో నిపుణులైన వాళ్ళు మంత్ర తంత్రాలచేత గానీ, ప్రమద్వరకు తిరిగి ప్రాణం వచ్చే వుపాయం చేస్తే, వాళ్ళకు నా తపస్సూ మొదలైన వాటి ఫలం ధారపోస్తాను". అనీ, అడవి అడవంతా మారుమ్రోగేటట్లు దీనవదనంతో ఆక్రోశించాడు రురుడు.

అప్పుడు ఆకాశంలో ఒక దేవదూత కనపడ్డాడు. కాలవశం అయినప్పుడు తీర్చడానికి ఎవ్వరి తరమయ్యా? అయినా ఒక్క ఉపాయం వుంది. నీవు చెయ్యగలిగితే చెబుతా విను. నీ అయుస్సులో సగం ప్రమద్వరకు ఇవ్వు, బ్రతుకుతుంది. అని ఆ దేవదూత రురుడితో అన్నాడు. నా ప్రేయసి బ్రతకడం కంటే కావలసిందేముంది? అలాగే చేస్తాను. అని రురుడు తన ఆయుస్సులో సగం ప్రమద్వరకిచ్చాడు. వెంటనే ఆమె ఇనుమడించిన అందంతో లేచి కూర్చున్నది. ప్రేమ, మృత్యువునే జయించింది. ఆవెంటనే వాళ్ళు పెళ్ళాడి సుఖంగా వుంటున్నారు.

తన భార్యకు అపకారం చేశాయని పాములంటే రురుడికి తగని కోపం. దుడ్డుకర్ర తీసుకుని, పాము కనపడితే సరి, చంపడం మొదలుపెట్టాడు. అడవులన్నీ తిరుగుతూ పుట్టల్లో పొదల్లో ఉండే పాములను గాలించి దుడ్డుకర్రతో హతమారుస్తుండేవాడు. ఇది రురుడికి నిత్యకృత్యమై పోయింది.

ఒకనాడు రురుడికి ఒక పాము కనబడ్డది. అది డుండుభం. అంటే రెండు తలల పాము. దాని తోక వైపు కూడా తలే. దాన్ని చూడగానే రురుడు చంపడానికి దుడ్డుకర్ర ఎత్తాడు. ఆ పాము భయంతో హరిహరీ అన్నది. "నాయనా నీవు చూస్తే, వ్రతాలు అవీ చేసిన సద్బ్రాహ్మణుడవుగా కనపడుతున్నావు. దివ్యకాంతితో వెలిగిపోతున్నావు. నీకు పాములమీద ఎందుకయ్యా కోపం?" అని అడిగింది. పాములు నా ప్రేయసికి హాని చేశాయి, నేను రురుణ్ని అని రురుడన్నాడు. రురుడు అన్న మాట

వినగానే పాము మునిగా మారిపోయింది., రురుడికి ఆశ్చర్యం కలిగింది. పామువైఉండి మునీశ్వరుడుగా మారిపోయావే, ఇది ఎట్లాగో చెప్పు. అని అడిగాడు.

ఆ పాము అసలు సహస్ర పాదుడు అనే ముని. అతని సహోధ్యాయుడు ఖగముఖుడు అనే ముని. అతడు అగ్నిహోత్రగృహంలో ఉన్నప్పుడు, సహస్రపాదుడు నవ్వులాటకు అతని మీద గడ్డి పామును వేశాడు ఖగముఖుడు ఉలిక్కి పడ్డాడు. అతనికి బాగా కోపం వచ్చింది. పామై పొమ్మని సహస్రపాదుణ్ని శపించాడు. తమాషాకు చేసిందానికి ఇంత కోపమా? నన్ను క్షమించు అని సహస్రపాదుడు వేడుకోగా ఖగముఖుడు ప్రసన్నుడైనాడు. నా మాటకు తిరుగులేదు. కొంతకాలం నీవు డుండుభంగా వుండి భృగవంశవర్ధనుడైన రురుణ్ని జూడగానే శాపవిముక్తుడ వవుతావు. అన్నాడు.

తన యీ కథంతా చెప్పి సహస్రపాదుడు రురుడితో ఇలా అన్నాడు:- "ఉత్తమజ్ఞానం, సర్వజీవులకూ హితం చేసే బుద్ధీ, మనశ్శాంతీ, సమత్వం, మానమూ మదమూ లేకుండా వుండడం, సత్యం పలకడం కరుణా పరత్వం- ఈ మొదలైన సద్గుణాలతో పుట్టిన వాడే నిజమైన బ్రాహ్మడు. భృగువంశంలో పుట్టావు. నీకీ హింసా పరత్వం ఏమిటి? నీవు బ్రాహ్మడివి పాములను హింసించడం మానుకో"

రురుడికి సహస్రపాదుడి బోధతో మనసు తిరిగింది. దుడ్డుకర్ర పారవేశాడు. పాములను చంపడం మానుకొని ఇంటికి వెళ్ళి ప్రేయసి యైన ప్రమద్వరతో సకలభోగాలూ అనుభవిస్తూ సుఖంగా జీవించాడు.

------0-----